

కృతికర్త                    కృతిభర్త

# విషయసూచిక



25. శాస్త్రప్రయోగములు.

26. లావ్వైస్ రసాయనపరిశోధనము.

27. ఆర్కిమెడీస్ ఘాతిక నిరూపణము.

28. జెట్ వాట్సన్ గ్రహపరిశోధన.

29. కేకే శాస్త్రాభివృద్ధి

30. స్టీంమెయింజన్ జార్జిస్టీవెన్సన్.

31. జేమ్సువెట్ పరిశోధన.

32. టార్సిలియన్ గాలి భారమితి.

33. ఉష్ణము ఉష్ణతామాపకము పరిశోధన.

34. సైకిలు, ట్రైసికిలు, గర్న్యాల్.

35. గేస్ మోటారు అపోజిగ్ డిర్యాజ్.

36. మోటారు హెన్రీఫోర్డు

37. గాలిఓడ (ఎయిర్ ప్లేన్) స్పెనియార్డు.

38. జప్లిన్లు సైలెంటు ప్లేనులు.

39. వైర్ లెస టెలిగ్రాఫి.

40. రేడియో టెలివిషన్.

41. టెలిమిషన్ నిరూపణము.

42. ఫోనోగ్రాఫ్ ఎడిసన్.

43. విద్యుచ్ఛక్తి ఫ్రాంక్లిన్.

44. ,, డేవి, ఫారాడే.

45. ఎక్సురే రాంట్జన్.

46. ఇవల్యూషన్ థియరీ డాల్టన్.

47. పదార్థనిరూపణము డార్విన్.

48. గ్రహమండలము పరిశోధన.

49.- అమెరికాలో నూతనపరిశోధనము.

50. గ్లావీపరికరములు.

సమర్పణ:

నన్ను వ్యక్తిగా రూపొందించిన
నా పిత, నా గురువు, నా నాయకుడు,
ఆచార్య రంగా పాదపద్మాలకు
ప్రేమతో సమర్పించుకొంటున్న
పూజా పుష్పం

## 'వాహిని' సంపాదకుల ప్రశంస

జాతీయ నాయకత్వం జీవంపోస్తున్న నవభారత రూపురేఖలు కండ్లకు కట్టినట్లు చిత్రించారు మా సుబ్బయ్యగారు. ఈ పుస్తకం ఒక్కసారి చదివితే దేశం తిరిగి చూడలేకపోయామే అన్న దిగులు ఎవరికీ ఉండదు.

ఈ వ్యాసావళిని మొట్టమొదటగా "వాహిని"లో ప్రచురించి తనతోపాటు పత్రికముఖంగా పాఠకుల ప్రశంసను చేకూర్చిన సుబ్బయ్యగారికి నా హృదయపూర్వక అభినందనలు.

—ఉమామహేశ్వరరావు

# మహత్తర ఆశయం

భారతదేశం శానిసవిముక్తి జెందిన అనంతరం గడచిన ఒక్క దశాబ్దంలోనే అనంతమైన అభివృద్ధిని సాధించేందుకు బహుముఖ ప్రయత్నాలు జరిగినమాట యథార్థం. జాతీయ నాయకత్వంలో విశ్వాసముంచి దేశప్రజలు అభ్యుదయ పథాన పురోగమించేందుకు ఉరకలు వేస్తున్నారు. పదేళ్ళు గడిచాయి. ఒక పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుకున్నాం. రెండవ ప్రణాళికను రచించుకున్నాం. అమలు జరిపించుకుంటున్నాం.

ఈ ప్రణాళికలు ఎంతవరకు విజయం పొందాయి — అనే విషయాన్ని అలా వుంచితే — దీన్ని జయప్రదమొనరించుకొనేందుకు దేశస్థుల సహకారం ఆశించినదానికంటె హెచ్చుగా లభించిందని ఘంటాపథంగా చెప్పవచ్చు. వాస్తవానికి ప్రభుత్వ సిబ్బంది సహకారంకంటే ప్రజా సహకారమే ఘనంగా లభించింది. ఇందుకు ప్రధానకారణం — ప్రజలకు జాతీయ నాయకత్వంపై గల ప్రగాఢ విశ్వాసం అంటే అతిశయోక్తి కాదు.

ముఖ్యంగా గ్రామీణ ప్రజల అభివృద్ధిని ఆశించి రచింపబడిన ప్రథమ పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుకునేందుకు భారత రైతాంగం ప్రదర్శించిన పట్టుదల, ఉత్సాహం గమనార్హమైనది. జాతీయ విప్లవంలో భారత రైతాంగం నిర్వహించిన వీరోచిత పాత్ర, స్వాతంత్ర్య

భారతదేశంలో - దేశంయొక్క సర్వతోముఖాభివృద్ధికి రైతుజనాలు ప్రదర్శించిన, ప్రదర్శిస్తున్న దీక్షా, పటుత్వాలు మన ఉజ్జ్వల భవితవ్యానికి స్వర్ణ సోపానాలు. "రైతులు విప్లవకారులు - నిర్మాణశక్తులు, అభ్యుదయ గాములు" అని కర్షకోద్యమ సంధానకర్త ఆచార్య రంగా ఎనాలిసిస్ అక్షరాలా నిజం అని పై ఘట్టాలు రుజువు చేస్తున్నాయి గదా!

అసలు రైతు ఉద్యమ పునాదులు పటుత్వం గలవి. పరాయిప్రభుత్వం పెత్తనం చెలాయిస్తున్న రోజుల్లో జాతీయ ఉద్యమంలో విలీనమై జాతీయ విప్లవ పరిధుల్ని పెంచుతూనే మరోవైపున తమ అభివృద్ధికి బ్రిటిషుప్రభుత్వంతో పోరు సల్పుతూ వచ్చారు. రైతులు జమీందారీ విధానంపై-ఈనాం దారీ విధానంపై - ఆనాటినుండే పోరాటం సాగిస్తూ వచ్చారు. తమ శక్తిని పెంచుకునేందుకు-సమైక్యతను సాధించేందుకు- మన మంతా ఏకం కావా లన్నారు. "ప్రపంచ కర్షకులారా ఏకంకండి'' అనే నినాదం ఆనాటిదే. మొట్టమొదటిసారిగా ఇచ్ఛాపురంనుండి - చెన్నపట్టణంవరకూ సాగిన చరిత్రాత్మక మైన రైతుయాత్ర - రైతాంగం, గ్రామీణప్రజల సమైక్యతకు పునాది. ఆనాటినుండి రైతురక్షణ యాత్రలు దేశంలో విచ్చలవిడిగా సాగాయి. రంగాజీ నాయకత్వాన రైతు యాత్రలు దేశవ్యాప్త మయ్యాయి.

ఒకనాడు హిందూమత పునరుద్ధరణకు శంకరా చార్యులు తీర్థయాత్రల్ని ప్రోత్సహించారు. కాశీనుండి రామేశ్వరానికి కాలినడకన యాత్రలు సాగించారు. హిందూ

మతంలోని గొప్పతనంకంటే శంకరాచార్యుని యాత్రలలోని పటుత్వమే - అప్పట్లో తమ స్వర్ణ కాంతుల్ని విరజిమ్ముతున్న బౌద్ధమతానికి పతనహేతువైంది. శంకరాచార్యులు ఆధ్యాత్మిక తత్వాన్ని మూసగట్టి, ఆ మూసలో దాన్ని పోసి ఔషధంగా మింగించారు. ఆ యాపధం నరనరానికి ప్రాకి విద్యుత్తులా పనిజేసింది. మూఢవిశ్వాసాలకు తావులేని సిద్ధార్థుని ప్రబోధాలు శంకరాచార్యుని "గరళం" లో కలసి కనపడకుండా పోయాయి. అవి ఆధ్యాత్మిక యాత్రలు; తీర్థయాత్రలు. అందులో మానవుని ముక్తి వున్నదనే విశ్వాసం ప్రజల్లో స్థిరపడింది. అందులో హేతువాద ప్రసక్తి లేదు. యాత్రలోని ఆశయం ఏదైనా - యాత్ర ఎందునిమిత్తమైనా - యాత్ర మహత్తరమైనది. ఆంగ్లో శాగ్జనులు సముద్రపు చాపలు. అందుచేతనే మంచినీళ్ళ ప్రాయంగా భూగోళాన్ని చుట్టివేయగలిగారు. కొన్ని శతాబ్దాలపాటు రవి అస్తమించని సామ్రాజ్యానికి అధిపతులై - విశ్వ ఇతిహాసంలో చెరిగిపోని చరిత్రను సృష్టించుకున్నారు.

రైతు ఉద్యమ ఆధ్వర్యాన సాగిన రైతుయాత్రల ఆశయం విశిష్టమైనది. ఆదర్శం బలమైనది. ప్రజాస్వామ్య రైతుకూలీ ప్రజారాజ్య ఆశయ సాధనకు రైతాంగాన్ని, గ్రామీణ ప్రజానీకాన్ని సమాయత్తం చేయడం ఈ యాత్రల యొక్క మహత్తర లక్ష్యం.

1936 నుండి 1944 వరకు సాగిన రైతుయాత్రల ద్వారా మనం సమైక్యతను సాధించుకొన్నాం. బానిస ప్రభుత్వంలోని స్థానికోద్యోగుల నిరంకుశత్వంపై విజయం

సాధించాము. జమీందార్లను తొలిగించుకొనుటద్వారా రైతు ఉద్యమం అజేయ మైనదని నిరూపించుకొన్నాం.

దేశం దాస్యవిముక్తి పొందిన తర్వాతగూడా దేశాభివృద్ధి కార్యక్రమాలలో, సమాజాభివృద్ధి పథకాల నిర్వాహణలో - రైతుఉద్యమం శరవేగాన పురోగమిస్తున్నది. జాతీయ ప్రణాళికల నిర్వాహణకు దోహద మిస్తున్నది. సమాజ వికాస కార్యక్రమంలో సహాకరిస్తున్నది. భారత సేవక్ సమాజ కార్ర్యక్రమంలో ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నది.

జాతీయ విప్లవంలో, గ్రామీణ ప్రజానీకంలో జాగృతి కలిగించి స్వాతంత్ర్య సంగ్రామంలో సమాయత్త పరుచుటకు, సమైక్యతను సాధించుటకు బ్రహ్మాస్త్రం వలె పనిచేసిన రైతు యాత్రలు ఈనాడు నూత్న స్వరూపాన్ని ధరించాయి. "దేశం నాది - దేశాభ్యుదయం నాకొరకు" - అనే ఒక నిత్యనూతనమైన, అభ్యుదయకరమైన సమష్టిభావం - సమతా స్వభావం ప్రతి పౌరునిలో అంకురించిననాడు - సమాజ మహాత్మ్యత్తులో అధికభాగం సాధించబడినట్లే.

కాశీ మొదలు రామేశ్వరం వరకు గల పుణ్యతీర్థాలను సేవిస్తే ముక్తి, మోక్షం కలుగుతుందని, ఎన్ని తీర్థాలను సేవించినా ఏకోనారాయణు డొక్కడే ననే ఒక మహత్తరమైన ఆధ్యాత్మిక సంవిధాన మున్నట్లే "కాశ్మీర్ మొదలు కన్యాకుమారివరకు గల భారత భూఖండంలో ప్రతి ప్రాంతంలో - ప్రతిమాగాణంలో- ప్రతి అంగుళంలో జరిగే

అభివృద్ధి మనకొరకే ననే విశాల దృక్పథం, సమష్టి తత్వం, సాభ్రాతృత్వభావం దేశాటనంలో నిండి ఉన్నది.

కృతయుగంలో, త్రేతాయుగంలో, ద్వాపరయుగంలో- నిన్న నేడు - కలియుగంలో - ఏమి జరిగింది ? ఆనాటి మన పెద్దల - యుగపురుషుల మహిమాన్విత శక్తు లేమి ? వారి సందేశా లేమి, మన తాత-తండ్రుల శక్తి యుక్తు లేమి, వాటికి ఆధారా లెక్కడ-అనే దగ్గరనుండి ప్రారంభమై - ఈనాడు మన హయాంలో-మన బుద్ధిబలాన్ని ప్రయోగించి సాధించు కుంటున్న ఘన కార్యా లేమిటో-చూచేందుకు, గ్రహిం చేందుకు తద్వారా ఒక నూతన ఉత్తేజాన్ని, ఉద్వేగాన్ని - ఉత్సాహాన్ని కలిగించుకొనేందుకు దేశాటనం ప్రధానం కదా ?

"నా దేశం ఇంత సువిశాలమైనది - నా దేశంలో ఇన్ని రాష్ట్రా లున్నాయి - ఇన్నిరకాల ప్రజ లున్నారు - ఇన్నిరకాల ఆచారాలు-వ్యవహారాలు ఉన్నవి - నా దేశంలో సస్యశ్యామలమైన ఇంత పంటభూమి ఉన్నది - ఆ పవిత్ర భూములపై జలజల-గలగల ప్రవహించే ఇన్ని నదులున్నాయి- నదాలున్నాయి-సరస్సు లున్నాయి; మేఘుణ్ణి సహితం పట్టి- బంధించి - వర్షింప జేయగలిగిన మహాపర్వతాలు - కొండలు - భయంకరమైన సహజ సౌందర్యమైన అరణ్యాలు - సుందర ఉద్యానవనాలున్నాయి-నా దేశం సహజసంపదలకు పుట్టినిల్లు; "విభిన్నంలో ఏకత్వం" నా దేశంయొక్క ప్రత్యేకత-అలాంటి నదులు, వనాలు - సహజసంపదలు - నా అధీనంలో ఉంచు కొని - నా మంచికి, నా సర్వతోముఖాభివృద్ధికి వినియోగిం

చుకో గలుగుతున్నాను" అనే ఒక మహోన్నతమైన, మహో త్కృష్టమైన భావన ప్రతి భారతీయునిలో అంకురింప జేయు టకు ఈ యాత్రలు ఎంతగా ఉపయోగపడుతాయో ప్రత్యే కించి చెప్పవలసిన పని లేదుగదా!

ఒకప్పుడు దేశాటనం సన్యాసులు - సాధువులు - మత ప్రవక్తలు చేసేవాళ్లు. ఇవి మతాల పేరిట జరిగినటువంటివి. ప్రస్తుతం దేశం పేరిట, దేశాభివృద్ధి పేరిట జరగాలి. ప్రతి ఒక్కళ్లూ ఎప్పుడో ఒకప్పుడు దేశాన్ని తిరిగి చూడాలి. ఈ మహత్తర కార్యక్రమంలో రైతులు ముందంజ వేశారు. రైతు ఉద్యమం నాయకత్వం వహించింది. ఆంధ్ర రైతులది ఇందులో అగ్రతాంబూలం. అదే ఆచార్య రంగా నాయకత్వం లోని విశిష్టత. రంగాజీ ప్రోత్సాహం, సహకారంతో గత సంవత్సరం - మన రైతు ఉద్యమంలోని ఒక ప్రముఖుడైన పార్లమెంటు సభ్యుడు శ్రీ వి. వి. రమణ నాయకత్వాన ఉత్త రాదిన గల వ్యవసాయక, పారిశ్రామిక కేంద్రాలను-పుణ్య క్షేత్రాలను-మహానగరాలను 350 మంది రైతులు దర్శించారు. ఆ యాత్రనే ఆదర్శంగా పెట్టుకొని రంగాజీ నాయకత్వంలో ప్రగాఢ విశ్వాసం గల మేము కొందరు యువకులము "శ్రీ రంగా కిసాన్ యాత్ర" పేరుతో, మధ్యాంధ్ర రైతులతో ఉత్తరాదితోబాటు కాశ్మీరు - ఆ తదుపరి కొన్నాళ్ళు దక్షిణా పథాన్ని పర్యటించాలని ఆలోచించితిమి.

మా ఆలోచన సరియైన దేనని మా పెద్దలు ప్రోత్సహిం చారు. రైతులు సహకరించారు. రంగాజీ ఆశీర్వదించారు. "మీది సర్వసాధారణమైన యాత్ర మాత్రమే కాదు. మన

సందేశాన్ని - మన రైతాంగంద్వారా యావద్భారతావనికి వినిపించబోతున్నారు సుమా! మీ ఉత్సాహాన్ని కొంత ఉత్తరాదివారికి పంచి యివ్వబోతున్నారు. మీ అనుభవాలు నవభారతావనిలోని రైతాంగపు అభివృద్ధికి సోపానాలు కాగలిగితే - మన మహోన్నత సిద్ధాంతానికి మెరుగులు దిద్దగలిగితే - మన ఉజ్వల భవిష్యత్తుకు హంగులు తీర్చ గలిగితే - మన మహత్తర కార్యక్రమానికి రాపిడి పెట్ట గలిగితే అప్పుడే మీ పర్యటన విజయయాత్ర అనుపించు కొంటుంది" అని రంగాజీ ఆదిలోనే మమ్మల్ని హెచ్చ రించారు. మాలో ఒక నూతనమైన ఉత్తేజాన్ని కలిగిం చారు. నిజమే! మే మొక నవసందేశాన్ని మోసుక పోతున్నా మనిపించింది.

ఇది కిసాన్ యాత్ర. ఈ యాత్రకు అన్నివైపులనుండి సహకార - సానుభూతులు వచ్చాయి. చిన్న చిన్న అవాంత రాలవలన నాలుగువందలమంది యాత్రీకులు భర్తీకాకపోయి నను మూడువందలమంది రైతులతోనే యాత్ర సాగించేందుకు నిర్ణయించాము. ఈ యాత్రలో - లాభనష్టాలతో ప్రసక్తి లేదు. మహోన్నత ఆశయంతో యాత్ర సాగించడం మా ప్రధాన లక్ష్యం. అందుకే మా రైతుల నాయకుడు-రైతు ఉద్యమంలో ఒక మూలవిరాట్టు - రైతుల మంత్రి అయిన శ్రీ కందుల ఓబులరెడ్డిగారు ఒంగోలులో బయలుదేరిన మా యాత్రా స్పెషల్‌ను ఆశీర్వదించారు : రైతులకు తమ శుభసందేశాన్ని అందజేశారు. నిడుబ్రోలు స్టేషన్‌లో

రైతుమాత శ్రీమతి భారతీదేవి రంగాగారు వీడ్కోలు సందేశ మిచ్చారు.

ఒంగోలు మొదలు బెజవాడవరకూ ఆగిన చీరాల, నిడుబ్రోలు - తెనాలి స్టేషన్లలో - పౌరులు, పెద్దలు, రైతులు, ఘనమైన వీడ్కోలు నొసంగారు. ఇది ఉన్నతాశయాలతో సాగిన యాత్ర కాబట్టి దీని వెనుక ఒక బలీయమైన ఉద్యమం - నాయకత్వం - సిద్ధాంతం ఉన్నది కాబట్టి - ఇది ప్రజాదృష్టిని ఆకర్షించ గలిగింది.

చక్కని, అందమైన ఆరు కొత్తపెట్టెలు - రెండు వాగెన్ పెట్టెలు గల రైతుల రైలుబండి మే 15 న తమ సందేశాన్ని దేశంపై విరజిమ్ముతున్నదా అన్నట్లు - పొగలు చిమ్ముతూ, ఆవిరులు విసరుతూ - గుప్పు గుప్పున యాత్ర సాగించింది. జగన్నాథ రథచక్రాలు కదిలినట్లుగా ఆంధ్ర రైతుల శుభసందేశం - దేశంలో విజయ యాత్రకు పయన మైంది.

స్త్రీలు - పురుషులు, వృద్ధులు - పిల్లలు మందహాసంతో, వికసించిన ముఖారవిందపు చిరుకాంతుల్ని విరజిమ్ముతూ-45 రోజులపాటు ఆంధ్రమాతవద్ద శెలవు గైకొన్నారు. ఆ నాటి దృశ్యం వర్ణనాతీతం. మా సిద్ధాంతబలం అమోఘమనిపించింది. జయజయ ధ్వానాలతో ఆంధ్ర దేశపు సరిహద్దుల్ని దాటాము.

# యాత్ర ప్రారంభం

ఖాజీపేటలో ఫైర్‌మన్ల సమ్మె. రైతుయాత్రీకులబండి బెజవాడ స్టేషన్‌లోనే 24 గంటలు నిలిపివేయబడింది. బండి యింతలో కదిలే సూచనలు కనుపించలేదు. ఖాజీపేట దగ్గఱ దౌర్జన్యాలు జరుగుతున్నాయట. బెజవాడనుండి కదిల్తే మధ్యలో ఎక్కడైనా ఆగిపోవచ్చు. ఇంతసేపు ఆగినా రైతులు ఎంత ఓర్పును ప్రదర్శించారు! మేమే ఓర్చుకోలేక పోయాము. బండిని మద్రాసుమీదుగా మరలించేందుకు డి. టి. యస్. నుండి అనుమతి పొందాము. 15 వ తేదీ 11 గంటలకు ఒంగోలులో బయలుదేరి రాత్రి 9 గంటలకు బెజవాడ చేరిన బండి – ఆ రాత్రి మరునాడంతా (16 వ తేదీ పగలు) అక్కడే పడిగాపులు కాచి రాత్రి 11 గంట లకు మద్రాసు ముఖంగా ప్రయాణం సాగించింది. ఆ కారణంగా హైద్రాబాద్ కార్యక్రమాన్ని రద్దుచేసుకోవలసి వచ్చింది. భూగోళం చుట్టూ ప్రదక్షిణం చేసినట్లుగా ప్రయాణం సాగించి ప్రయాసమీద నాల్గవనాటికి మా రెండవ మజిలీ అయిన పండరీపూర్ చేరుకున్నాం. అది 19వ తేదీ. ఉదయం 8 గంటలకు కురుద్వాడీ చేరాము. కురుద్వాడీలో మాకొరకు పండరీపూర్ పోవడానికి "నారోగేజ్" స్పెషల్ రేక్ సిద్ధంగా ఉన్నది. మీటర్ గేజ్ కంటే చిన్నదైన ఆ బండిలో ప్రయాణం చేస్తూవుంటే ఎంతో హుషారనిపించింది. ఆ బండి చకచక పరుగులు తీస్తూ వుంటే – సరిగ్గా "విఠల్ – విఠల్ – పాండురంగా – విఠల్ – విఠల్ –

పాండురంగా" అనే శబ్దమే ప్రతిధ్వనించింది. భక్తిపరులు ఆ మనోహరధ్వనిలో శ్రుతి కలిపారు.

# పండరీపురం

ఆంధ్రదేశపు సరిహద్దుల్ని దాటింతర్వాత మొట్ట మొదటగా మేము అడుగిడింది మహారాష్ట్ర ప్రాంతం. శివాజీ వంటి వీరులు - తుకారాం లాంటి భక్తిపరులు, గోదావరి లాంటి మహానదులకు జన్మస్థానమైన పుణ్యభూమిని ఓంప్రథం లోనే దర్శించగలగడం మా భాగ్యం. మహారాష్ట్రుల సహజ సౌందర్యం, అన్నింటినీ మించిన సహృదయం మమ్మల్ని ముగ్ధుల్ని చేసింది. మహారాష్ట్ర స్త్రీలు, ముఖ్యంగా రైతువనితల బిగువైన కట్టు - ఆ విశాలమైన ఫాలభాగంపై వెడల్పైన బొట్టు - నడకలోని హుందా ముచ్చట గొలిపాయి. పురుషులకు మోకాళ్ళక్రిందికి పంచె కట్టు - పొట్టి చొక్కాలు - మనిషికి మించిన తలపాగాలు - వారిని చూస్తుంటే వారి పల్లెటూరి జీవితం కళ్ళకు కట్టిన ట్టుంది. దుస్తులు మురికిగా వున్నా శ్రమజీవులని వారి ముఖాలు చెప్పక చెప్తున్నాయి. మహారాష్ట్ర ప్రాంతంలో నాలుగు ప్రదేశాలు దర్శించాము. ఒకటి పండరీపూర్, రెండు బొంబాయి, మూడు నాసిక్, నాలుగు ఔరంగాబాద్. నాలుగు ప్రదేశాలలోనూ ఆ ప్రాంతీయులు - ఉద్యోగులు - ఉన్నతోద్యోగులు - పౌరులు మాపట్ల, మా సౌకర్యాలపట్ల అమిత ఆప్యాయతను, అతి శ్రద్ధను ప్రదర్శించారు. మాలాగే

మహారాష్ట్ర రైతులు గూడా ఇటీవలనే దేశాటనం చేసి వచ్చారు. ఆ రైతులు కష్టజీవులు. రైతులే కాదు, అందరూ శ్రమజీవులే.

మహారాష్ట్రులు మహావీరులు. ఒకనాడు మహారాష్ట్ర పీష్వాలు మొగలాయీలను పారద్రోలి ఢిల్లీని ఆక్రమించుకొన్నారు. ఢిల్లీసల్తనత్‌కు చక్రవర్తులయ్యారు. పీష్వాలు ఢిల్లీసల్తనత్‌తోనే సంతృప్తి చెందలేదు. యావత్తు భారత దేశాన్ని ఏకం చేయుటకు ప్రయత్నించారు. సమయంకాని సమయంలో చేయగూడని యుద్ధాలు చేశారు. పంజాబు, సింధు, గాంధార (అఫ్ఘనిస్థాన్) రాజ్యాలను గూడా సామ్రాజ్యంలో కలుపుకొనేందుకు ప్రయత్నించి పరాజయ మొందారు. అంతటితో మహారాష్ట్ర సామ్రాజ్యం బుద్బుద ప్రాయ మైంది.

వీర శివాజీ పరిపాలించిన ఆరురాష్ట్రాలను పునరాక్రమణ జేసి, స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవడంతో తృప్తి జెందని పీష్వాలు- ఔరంగజేబు అనంతరం చితికిపోయిన మొగల్‌సామ్రాజ్య పీఠమైన ఢిల్లీని ఆక్రమించుకోవడంతో ఆగక కృష్ణానది నుండి సింధునది వరకూ మహారాష్ట్ర ఝెండా రెప రెప లాడవలెనని పీష్వా బాజీరావు చాటించాడు. "మొగల్ సల్తనత్"కు మారుగా హిందూ- పద్-పద్‌షాహీ" ని పునఃస్థాపితం చేయాలని శాసించాడు.

అదే పట్టుదల - అదే దీక్షతో మహారాష్ట్ర విమోచన సైన్యాలు కదిలాయి. 1723 లో చంబల్ నదిని దాటాయి. మాళ్వా, బుందేల్‌ఖండ్‌ను ఆక్రమించు

కొన్నాయి. గుజరాత్‌ను దాడిచేశాయి. పోర్చుగీసులను తరిమి కొట్టాయి. 1737 లో ఢిల్లీవైపు సైన్యాలు పురోగమించాయి. నగర ప్రాంగణంలో తిష్ట వేశాయి.

అదే సమయంలో నాదిర్షా సైన్యాలు ఢిల్లీలో జొరబడి మొగల్ సామ్రాజ్యావశేషాలు లేకుండా తుదముట్టించాయి.

1740 లో శివాజీ అంతటి వీరుడైన పీష్వా బాజీరావు చనిపోవడంతో మహారాష్ట్రసామ్రాజ్య విస్తరణ తాత్కాలికంగా స్థంభించిపోయింది. అప్పట్లో సామ్రాజ్యానికి కేంద్రం పూనానగరం.

తిరిగి 1760 లో భాహోసాహెబ్ సైన్యాధిపత్యాన మరాఠాసైన్యాలు ఢిల్లీని ఆక్రమించుకొన్నాయి. 'హిదూ-పద్-పదపాహీ'గా పీష్వా విశ్వాసరావు పదవీస్వీకారం చేశాడు.

పానిపట్టుయుద్ధం మహారాష్ట్రసామ్రాజ్యానికి శాశ్వత సమాధి అయింది. బాహోసాహెబ్, విశ్వాసరావుతో బాటు 25 మంది మహారాష్ట్ర నాయకులు పానిపట్టు రణరంగానికి ఆహుతి అయ్యారు. వీరశివాజీ ప్రతిష్ఠించిన నాటినుండి ఎదురులేకుండా సముజ్జ్వల స్వాతంత్ర్య రణదుంధుభులమధ్య అరుణకిరణాంచితజ్యోతులతో దేదీప్యమానంగా వెలుగొందుతూ పురోగమిస్తూన్న "భగవా-ఝెండా" పానిపట్టు యుద్ధరంగంలో తలవ్రాల్చింది. పీష్వాల తెలివితక్కువ ఫలితంగా ఆ జాతీయపతాకం నేలకొరిగింది. మరాఠా

సైనికుల శవాలు రాసులు పడ్డాయి. భారత స్వాతంత్ర్య చరిత్రలో సువర్ణాక్షరలిఖితులైన మహారాష్ట్ర మహామంత్రులు నానాఫర్నివీస్, మల్హారావ్ హోల్కార్‌లు మాత్రమే మృత్యుగహ్వారాలనుండి బయటపడి మరికొంత కాలం మహారాష్ట్రరాజ్యం ఈ గడ్డన నిలద్రొక్కుకొనుటకు కారణభూతు లయ్యారు.

ఏమైనా పరపాలనకు ప్రతీఘాతంగా జాతీయ భావాలు మొట్టమొదటగా మోసులెత్తినది మహారాష్ట్ర జాతిలోనే. 17 వ శతాబ్దంలో వీర శివాజీతో ప్రారంభమైన ఈ జాతీయ యుద్ధం – 20 వ శతాబ్దంలో తిలక్ మహాశయుని వరకు సాగింది. ఛత్రపతి శివాజీ అనంతరం శంభాజీ హత్యతో చెలరేగిన పీష్వాలశక్తి ఢిల్లీని ఆక్రమించుకొనేంత వరకూ ఆగలేదు. తెలుగునాడు కాకతీయుల దేశమైనట్లే మరాఠా మాగాణం శివాజీల దేశం. ఈ కాకతీయుల దేశం – ఆ శివాజీల దేశం ఒకనాడు ఆంధ్రరాజులక్రింద ఏకఛత్రాధిపత్యంక్రింద విలసిల్లాయి. నాశిక్‌ను రాజధానిగా జేసికొని ఆంధ్రరాజులు ఆంధ్ర, మహారాష్ట్ర, ఘూర్జర, కోంకణ, ఆదిగాగల ప్రాంతాలను పరిపాలించారు.

ఆనాటి వారి పరిపాలనాపద్ధతులు – ఈనాటి మన నవరాజ్యాంగాన్ని పలు విషయాలలో పోలి ఉన్నాయి. సామ్రాజ్యం రాష్ట్రాలుగా విభజింపబడింది. మహాభోజులు ఉత్తరకోంకణకు సామంతులు. మహారాష్ట్రులు ఇప్పటి మరాఠా ప్రాంతానికి సామంతులు. అలాగే భోజులు, పుళిందలు, రస్తికులు. పాలకవర్గంలో అమాత్యులు, మహా

మంత్రులు, భాండాగారికులు ఉండేవారు. క్రీస్తుకుపూర్వం 230 మొదలు క్రీస్తుశకం 225 వరకూ నాశిక్ రాజధానిగా సంయుక్తంగా రాజ్యపరిపాలన చేసిన ఆంధ్ర - మహారాష్ట్రుల సంస్కృతీ సంబంధాలు బహు పురాతనమైనవి. పురాతన పుణ్యక్షేత్రమైన పండరీపురంలో మాకు ఆనాటి సహజీవన సంస్కృతీ అవశేషాలు కనుపించాయి.

ఆనాడు మాకు ఆ మహాక్షేత్రంలో * హేమద్ పంత్ "మోడీ" వినిపించింది. గీత జ్ఞానేశ్వర్ ప్రబోధ గేయం మా కర్ణరంధ్రాలలో మార్మోగింది. ♦ నామదేవుని పండరి కీర్తనలకు మేము తన్మయుల మయ్యాము.

మూడువందలమంది ఆంధ్ర రైతులు పండరీపూర్ నడి వీధులలోగుండా చంద్రభాగ నదికి నడిచిపోతూవుంటే - అచ్చటి తీర్థప్రజలలో అదేదో ఉత్సాహం, భక్తి పర వశత్వం ముప్పిరిగొన్నాయి. పండరినాధుని స్తోత్ర గీతాల ధ్వనితో ఆ ప్రదేశమంతా మార్మోగిపోయింది. చంద్రభాగా నదిలో జలకమాడి నావలపై ప్రయాణము సాగించి పాండు రంగని భక్తుల, భక్తురాండ్ర మందిరాలను దర్శించారు. మా యాత్ర మొట్టమొదటి మజిలీలో వేంచేసియున్న పాండురంగని, మా యాత్రను జయప్రదం చేయమని మనసారా వేడుకొన్నాము.

20 తేదీ తెల్లవారుఝామునకు మా స్పెషల్ పూనా స్టేషన్ దాటింది. మేము వేరే ప్రపంచంలో పడినట్టు

---

* యాదవరాజుల నాటి మహారాష్ట్ర కవి.

♦ అలందీ మహాకవి మరాఠీ గేయం.

మాకనిపించింది. ఆ రైల్వే లైనులు - ఆ కరెంటు రైళ్ళు గాలికంటె వేగంగా పరుగిడుతున్నాయి. వచ్చేవి వస్తున్నాయి - పోయేవి పోతున్నాయి. అన్నింటిని మించి మా బండి ఆకాశంలో పోతున్నదా అనిపించింది. పూనా నుండి కరెంటు యింజను వేయడంతో మా బండి స్వరూపమే మారిపోయింది. నిద్రలోనే మరోబండి ఎక్కామా అనిపించింది. బండి శరవేగంగా ముందుకు పరుగిడుతూవుంటే - పూనా, బొంబాయి మధ్యవున్న సహజసౌందర్యమైన ప్రకృతి మా పైకి దూకినట్లుగా ఉంది. వచ్చి, వచ్చి బండి ఒక అంధకార బంధురమైన పెద్ద సొరంగంలో దూరింది. శబ్దం భయంకరంగా ఉంది. మానవ ప్రపంచాన్ని వదలిపెట్టి మరో ప్రపంచంలో పడినట్లనిపించింది. సొరంగం దాటాము. ఒక రమణీయమైన మహానగరంలో - ఇండియాలోకల్లా పెద్దదైన ధూమశకట నిలయంలో మాబండి ఆగింది. అదే విక్టోరియా టెర్మినస్. బండి దిగాము. ఎక్కడున్నామని అన్నారు కొందరు అయోమయంగా. బొంబాయిలో అని కొందరు నవ్వారు.

## ఒక మహానగరం

బ్రిటిషు మహాయుగంలో బొంబాయిది పెద్దచరిత్ర. భారతస్వాతంత్ర్యపోరాటంలో బొంబాయిది చెరిగిపోని చరిత్ర. పరిశ్రమల్లో వాణిజ్యంలో బొంబాయి మణిపూస. ఈ నాడు నవసమాజాన్ని ఉర్రూతలూగిస్తున్న చలన చిత్రరంగంలో బొంబాయిదే నాయకత్వం. వివిధ రకాల

మనుష్యులకు, వ్యాపన్లకు, సంపదకు, సౌఖ్యానికి, మంచికి – చెడుకు, శ్రమకు, సోమరితనానికి, సహాయానికి – మోసానికి బొంబాయిది అగ్రతాంబూలం. అలాంటి మహానగరంలో రెండురోజులు గడిపాం.

అరేబియా సముద్రంలో ఒక ద్వీపకల్పాన్ని అల్లుకొని యున్న బొంబాయినగరం ఒకప్పుడు ఒక చిన్న జాలరుల పల్లె. ఆదిలో పోర్చుగీసువారు చక్కని ఓడరేవును నిర్మించుకొన్నారు. ఒక ఫ్యాక్టరీనికూడా స్థాపించి వ్యాపారం సాగిస్తూ ఉండేవారు. 17 వ శతాబ్దంలో ఇండియాలో పోర్చుగీసుబలం క్షీణదశ పట్టింది. 1661 లో బొంబాయి రేవును సాలుకు 10 పౌనులు చెల్లించే ఏర్పాటుతో ఈస్టిండియా కంపెనీవారికి ఇచ్చివేశారు. ఇంతలోనే పోర్చుగీసువారు పతనమయ్యారు. ఈస్టిండియాకంపెనీ శక్తి ద్విగుణీకృతంగా విస్తరిల్లింది. బొంబాయితో బాటు చెన్నపట్టణం, కలకత్తాలను కూడా వశపరచుకొన్నారు. అంతకుముందు సూరత్ నుండి సాగుతున్న వారి వ్యాపారం అప్పటినుండి బొంబాయినుండి సాగింది.

చేపలకంపుతో మురికికూపంగా ఉండే ఆ కుగ్రామం కొలదికాలానికే ఒక సుందర నగరమైంది. మురికి అంతా తీసివేయబడింది. సముద్రజలంలో మునిగిపోయిన కొంత భూమి నివాసయోగ్యం చేయబడింది. పారశీక, హిందూ వాణిజ్యవర్గాలకు కూడా నగరంలో వ్యాపారాభివృద్ధి చేసికొనేందుకు ఆంగ్లేయులు అనుమతి నీయడంతో పట్టణం దినదినాభివృద్ధి జెందుతూ వచ్చింది.

నాలుగువందల సంవత్సరాల పారిశ్రామిక, వాణిజ్య, రాజకీయ జీవితం గలిగినటువంటి బొంబాయి నగరం ఈనాడు వివిధ జాతులకు, భాషలకు, సంస్కృతులకు, సమ్మేళనా కేంద్రమై భారతావని భాగ్యోదయాన్ని ప్రపంచానికి చాటుతున్నది. ఆ సుందర నగరంలో మహారాష్ట్ర, గుజరాత్, కొంకోణ (గోవనులు), కర్నాటకులే గాక, దేశ విదేశ ప్రజా సముదాయముతో - విభిన్న నాగరికతలతో, భిన్నత్వంలో ఏకత్వాన్ని చాటుతున్నది. భారతావని పరిపూర్ణత్వాన్ని చాటుతున్న ఈ నగరాన్ని స్వతంత్ర భారతరాష్ట్రాల పునర్నిర్మాణంలో - ద్విభాషా బృహత్తర బొంబాయిరాష్ట్రానికి రాజధానీ నగరంగా చేసికో గలగడం ముదావహం.

# గుజరాతీయులు

అరవలు ఉద్యోగాలకొరకు, హోటళ్ళ నిర్మాణానికి ఆసేతుహిమాచలపర్యంతరం విస్తరించారు. అలాగే గుజరాతీయులు వ్యాపారనిమిత్తార్థం దేశవ్యాప్తంగా పాదుకొన్నారు.

గుజరాతీయులు శ్వేతహూణుల సంతతివారని చరిత్ర చెప్తున్నది. మధ్య ఆసియా స్టెప్పీలనుండి బయలుదేరిన హూణులు ఓల్గానదీలోయకు ఒక తెగ - పశ్చిమోత్తర కనుమలగుండా ఇండియాకు ఒక తెగ 5 వ శతాబ్దంలో వలస వచ్చారు. ఓల్గాకుపోయిన తెగ రోమన్ సామ్రాజ్యాన్ని, ఇండియాకు వచ్చిన శ్వేతహూణులు గుప్త సామ్రా

జ్యాన్ని విచ్ఛిన్నం చేశారు. మాళ్వాపై విరుచుకపడి కాశ్మీరును ఆక్రమించుకున్నారు. అంతకుముందే గాంధారను స్వాధీనపరచుకొన్నారు. కాని ఆర్యావర్తంలో హూణుల సర్దారు మిహిరాసుల - యశోధర్మునిచే పరాభూతుడైనాడు. శ్వేతహూణులలోని గుజారాలు అనే ఒక తెగ రాజపుత్ర స్థానంలో భీన్‌మాల్ లోనూ, కనోజ్‌లోను చిన్న చిన్న రాజ్యాలను స్థాపించుకొన్నారు. కొందరు ప్రస్తుత గుజరాత్ ప్రాంతంలో ప్రవేశించి స్థిరనివాసా లేర్పరచుకొని హిందూ మతాన్ని స్వీకరించి హిందూదేశీయు లయ్యారు. గుజారీల రాష్ట్రం కాబట్టి - దానికి గుజరాత్ నామధేయం సార్థక మయింది.

అలాంటి గుజరాత్ జాతినుండే మహాత్మాగాంధీవంటి విశ్వశాంతి ప్రవక్తలు - సర్దార్ వల్లభాయ్‌పటేల్ వంటి ధీరోదాత్తులు ఉద్భవించారు. రైతుఉద్యమం వ్రేళ్లు పాతుకొని ఉన్నది. మొట్టమొదటగా కార్మికోద్యమం ప్రారంభమైందీ అక్కడనే. ఐదవశతాబ్దంలో మధ్యఆసియాలో బయలుదేరిన హూణులు అక్కడ రోమన్ సామ్రాజ్యాన్ని ఇక్కడ గుప్తసామ్రాజ్యాన్ని ఎదుర్కొని ప్రపంచ చరిత్ర గతిని మార్చివేసినట్లే 20-వ శతాబ్దంలో మహాత్మాగాంధీ "శాంతి, సత్యం, అహింసా" సిద్ధాంతాలకు నూతన నిర్వచ నాలనిచ్చి నూతన శకానికి శంఖారావం పూరించారు.

బొంబాయి నగరంలో వీర మహారాష్ట్రులను, శాక్య గుజరాతీయులను, కళాసంపన్నులు కర్నాటకులను చూశాము.

"ముంబాదేవి" పేరుమీద వెలసిన బొంబాయి అందంలో అద్వితీయం. ఎత్తైన భవనాలు, విశాలమైన వీధులు బొంబాయి ప్రత్యేకత. మలబారు కొండలమీది నుండి నిశీథ సమయంలో విద్యుత్కాంతులను విరజిమ్ముతున్న బొంబాయినగర దృశ్యాన్ని చూచిన ఒక భావుకుడు "ఇది నగరంకాదు మహారాణి మణిహారం!" అని వర్ణించాడట. "మెరీన్ డ్రైవ్" బొంబాయిలో ఒక ప్రత్యేకాకర్షణ. ఆ భూభాగం సాగరగర్భంనుండి వెలుపలకువచ్చి 25 సంవత్సరాలే నంటే ఎవరైనా నమ్మగలరా? అచ్చటి సముద్రజలం-బంగాళాఖాతంలాగా బొంబాయినగరంలోనికి చొచ్చుకపోయిన అఘాతంవలె ఉంటుంది. అక్కడే ప్రపంచ ప్రఖ్యాతమైన "చౌపతీబీచ్." సాయం సమయంలోనూ, సంధ్యవేళల్లోనూ, ఆ తీరపుశోభ అద్వితీయము. అనంత ప్రకృతితో - ప్రమదల సౌందర్యం పోటీ పడుతుంది. అనంతవిశ్వం - అందులో రమణీయ ప్రకృతికన్య - దానిలో ఒకభాగమే ప్రమదల సౌందర్యం. అదే చౌపతీ బీచ్‌లో మాకు ప్రత్యక్షమైంది.

రమణీయమైన, గేట్ వే ఆఫ్ ఇండియా (ఇండియా ముఖద్వారం) మా రైతులకు ఒక రసానుభూతిని కలిగించింది. "బొంబాయినగరం భారతావని ముఖద్వారం" అనే సత్యాన్ని అరేబియా సముద్రపు అంచున నిర్మించబడిన ఆ ప్రసిద్ధ కట్టడం ప్రస్ఫుటం చేస్తున్నది. ఈ ద్వారపు సోపానాలమీద నిలబడినప్పుడు బొంబాయి హార్బరు, కనుచూపుమేరలో సముద్రమధ్యంలోని ఎలిఫెంటా గుహాలు కనిపిస్తున్నాయి. 1911లో

పంచమజార్జి చక్రవర్తి, మేరీరాణి భారతదేశాన్ని సందర్శిం చారు. వారు భారత భూభాగంపై అడుగిడిన స్థలంలోనే "గేట్ వే ఆఫ్ ఇండియా" కట్టడం వెలిసింది. అదే పోర్ బందర్ – అక్కడే తాజ్‌మహల్ హోటల్.

నగరమధ్యంలోని 'విక్టోరియా గార్డెన్సు'నుగూడా మా రైతులు సందర్శించారు. అది ఒక చిత్రమైన జంతు ప్రదర్శన శాల.

"ఫ్లోరాఫౌంటెన్" నగరానికి గుండెకాయ. బొంబాయిలో ప్రధాన రహదారులు మహాత్మాగాంధీ రోడ్డు, హారన్‌బైరోడ్డు, చర్చిగేటు వీధియొక్క కూడలి – ఫ్లోరా ఫౌంటెన్‌కు రెండుమైళ్ళ పరిధిలో నగరంలోని ప్రసిద్ధ నిర్మాణాలు, సంస్థలు అయిన విశ్వవిద్యాలయం, సచివాలయం, గేట్–వే–ఆఫ్–ఇండియా, హైకోర్టు, ఇంకా అనేక ప్రసిద్ధ కట్టడాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి. విశ్వవిద్యాలయాన్ని ఆనుకొని 15–వ శతాబ్దపు గోథిక్, ఫ్రెంచి కళాకౌశలాన్ని ప్రస్ఫుటంజేసే ఎత్తైన "రాజబాయ్ టవర్" కనుపిస్తుంది. ఈ టవరుమీదనుండి బొంబాయి సుందరనగరాన్ని పక్షి దృష్టితో చూడవచ్చు. ఆ సమీపంలోనే ప్రిన్సు ఆఫ్ వేల్సు మ్యూజియం. ఇది నగరంలో ఒకప్రధాన ఆకర్షణ.

# ఎలిఫెంటా

అరేబియా సముద్రంలో - బొంబాయి రేవుకు ఆరు మైళ్ళ దూరంలో ఒక లంక. ఆ లంకలో రెండు పొడవుపాటి కొండగుట్టలు. ఆ రెండింటి మధ్యలో ఒక లోయ. అందులో కొండగుట్టల అంచుల్లో అందమైన గుహలు. లోయ ముఖ ద్వారంలోనే పెద్ద ఏనుగ విగ్రహం ఉండేది. ఆ విగ్రహం విక్టోరియా గార్డెన్సుకు చేర్చబడింది. ఆ విగ్రహాన్నిబట్టే ఈ గుహలకు "ఎలిఫెంటా గుహలు" అనే పేరు సార్థకమయింది. ఈ గుహలు ఇప్పటివి కాదు. 12 వందల సంవత్సరాల నాటివి. వైదిక మత ప్రాభవానికి చిహ్నాలు. బౌద్ధమతం క్షీణిస్తున్న రోజుల్లో 8-వ శతాబ్దంలో డక్కను సామ్రాజ్యం చాళుక్యుల పాలనలో ఉన్నప్పుడు నిర్మించబడినవి. రాతిని చెక్కి నిర్మించిన అందు లోని ఆలయం 130 అడుగుల పొడవు, 120 అడుగుల వెడల్పు ఉన్నది. ఆలయానికి ఇరువైపులా అర్థనారీశ్వరుడు, శివ పార్వతి విగ్రహాలు మనోహరంగా ఉన్నాయి. ఆలయంలో భారీయైన త్రిమూర్తి విగ్రహ మున్నది. ఈ విగ్రహమే ఈ గుహలలో ప్రాధాన్యత వహిస్తున్నది. శివపార్వతి పరిణయ దృశ్యం, శివతాండవ నృత్యం, భైరవుడు, కైలాసగిరి రావణా సురుడు పెకలించుట, మొదలగు శిల్పాలు చాళుక్య శిల్ప కళాచాతుర్యాన్ని చాటుతున్నాయి.



త్రిమూర్తి

"గేట్ వే ఆఫ్ ఇండియా" దగ్గరనుండి స్టీమ్‌లాంచీలలో ఎలిఫెంటా గుహాలకు ప్రయాణం చేస్తూ ఉంటే అతి వుల్లాసంగా ఉంటుంది.

నగరానికి మకుటమైన మలబార్ హిల్సులో- కమలా నెహ్రూ గార్డెన్సులో రెండు గంటలు కాలక్షేపం చేశాం. మత్స్య ప్రదర్శనాలయంలో మహాత్తరమైన జలమృగాలను చూశాం. అందులో ఉన్నంతసేపు సముద్ర గర్భంలో సాహసయాత్ర చేస్తున్నట్టుగానే వుంది. బొంబాయి హార్బరులో అడుగు పెట్టడంతోనే - భారతదేశానికి స్వతంత్ర ప్రదానం చేయుటకు ఒక ప్రధాన కారణమైన 1944 నావికుల తిరుగుబాటు రోజులు స్మృతికొచ్చాయి.

చుక్కల్ని చూస్తున్న భవనాల గంభీరత్వం - కన్నులు మిరుమిట్లు గొలుపుతున్న షాపులు - విధివిరామం లేకుండా చీమల బారులా పరుగులుతీసే కారులూ. సంపదనంతా ఒకేచోట కుప్పబోశారు - పల్లెటూళ్ళలోని దౌర్భాగ్య జీవితానికి బస్తీలలో ఈ విధంగా సంపదను కేంద్రీకృతం చేయడమే కారణమై తీరుతుందని ప్రత్యక్షంగా కనుపిస్తుంది. ఔను మరి! ప్రత్తిని పండిస్తున్న కర్షకుడు ప్రత్యక్ష దారిద్ర్యాన్ననుభవిస్తున్నాడు - ఆ ప్రత్తిని బట్టలుగా తయారుచేస్తున్న కార్మికుడు కూటికి, గుడ్డకు యమయాతన లనుభవిస్తున్నాడు. దాన్ని అమ్ముకుంటున్న మిల్లు యజమాని పైజెప్పిన విధంగా సంపద నంతా కేంద్రీకరింప జేసికొని - ఆకాశ హార్మ్యాలను నిర్మించుకొని, మెత్తని కారుల్లో విహరిస్తున్నారు. అందుకే బస్తీలలో ఒక్కొక్కరి దగ్గర మూల్గుతున్న సంపదరాసుల్ని

కదిలించకుండా పాడుపడిన పల్లెప్రాంతాలలోని దారిద్ర్యాన్ని పంపిణీ చేసేందుకు మనవారు చురుకైన ప్రయత్నాలు సాగిస్తున్నారని తెలిసికొన్న మా రైతు యాత్రీకులు నిట్టూర్పు విడిచారు. అది తప్పు అని మన రైతు ఉద్యమం చెప్తున్నది. సంపదను వదలిపెట్టి దారిద్ర్యాన్ని పంపిణీ చేయబూనడం అవివేకమనీ, బస్తీలు – పల్లెల మధ్య సమత్వాన్ని సాధించడమే సరైన సంస్కరణ ఔతుందనీ మన నాయకుడు ఆచార్య రంగా అటు పార్లమెంటులోనూ – ఇటు ప్రజలలోనూ ఉద్ఘాటిస్తున్నారు. ఈ పరిస్థితుల్నే మా రైతుయాత్రికులు ప్రత్యక్షంగా చూచారు. తాజ్ మహాల్ హోటల్లో కాఫీ త్రాగి – ఒక్క కాఫీకి 0–14–0 బిల్లు చెల్లించినవారికి, కడుపునిండని తిను బండారానికి 9–8–0 చెల్లించినవారు ఈ విషయాన్ని ఇంకా చక్కగా ఆఘ్రాణించుకున్నారు. బస్తీలో ఒక కప్పు కాఫీ విలువ పల్లెటూరివాళ్ళ రెండురోజుల భత్యం ఖరీదన్నమాట. ఈ వ్యత్యాసం యిలాగే వుండాలని పథక నిర్వాహకులు – పథకాలు సృజిస్తున్నారు. అంటే పల్లెటూళ్ళో రైతునోరు కొట్టి రెండణాలకు తీసుకపోయిన వస్తువు విలువ బస్తీ పారిశ్రామికవేత్త చేయి తగిలేటప్పటికి ఆ వస్తువు ఖరీదు యిరవైరూపాయలౌతున్నది. ఈ వ్యత్యాస మెందుకని ప్రశ్నిస్తే – ఔను – ఇది బస్తీవాని జీవితపు విలువ అంటున్నారు.

మొత్తంమీద మా రైతులు బొంబాయి మహానగరంలోని ఉన్నతోన్నతాలను పరిశీలించగలిగారు.

# నాశిక్

ఒక మహాసుందర నగరం మనస్సులో చేరి సుడులు తిరుగుతూనే వుంది. మరునాడు ఉదయానికే "నాశిక" చేరుకొన్నాం. నాశిక ఒకనాడు ఆంధ్ర సామ్రాజ్యానికి ముఖ్యపట్టణం. శాతవాహనుల కాలంలో ఆంధ్రసామ్రాజ్యం నాశికవరకు విస్తరించింది. క్రీ.శ. 120 ప్రాంతంలో శ్రీ శాతకర్ణి ఆంధ్ర, మహారాష్ట్ర, గుజరాత్, కొంకణ దేశాలను ఏక ఛత్రాధిపత్యం క్రిందకు తేగలిగాడు. పవిత్ర గోదావరీ పుట్టుకస్థానంలోని నాశిక్ రాజధానిగా ఆంధ్రసామ్రాజ్యం - ఆంధ్ర, మహారాష్ట్ర సంస్కృతుల సామీప్యానికి కారణ భూతమైంది. కళాసంపదలతో తులతూగిన ఆనాటి ఆంధ్ర సామ్రాజ్యపు శోభ ఇప్పటికీ అజంతా-ఎల్లోరా గుహాలలో ప్రస్ఫుటమౌతుంది. మన పవిత్ర గోదావరీ నదీమతల్లి జన్మ స్థానం నాశికదగ్గర 'త్ర్యంబకంలో' నే. మన భూముల్ని సస్యశ్యామలంగా, సుందర నందనవనాలుగా మార్చుతున్న గోదావరి జన్మస్థానం పడమటికనుమల్లో. అక్కడ పుట్టిన ఆ పిల్లకాల్వ పడమటికే దొర్లి ప్రవహించినట్లయితే - అది ఇంతటి మహానది అయి ఉండేదికాదు. ఆంధ్ర, మహారాష్ట్ర మాగాణములలోని యింత పెద్ద భూభాగాన్ని పావనంచేసి వుండేదికాదు. ఇంతటి సస్యసంపదలకు కారణభూతమయ్యేది కాదు. గోదావరి ఒక కొండకాల్వగా అరేబియాసముద్రంలో అంతరించి ఉండేది. అందుకే ఒక కవి అన్నాడు "పురిటి లోనే సందేకొట్టక-జరిగినది యీ నెలవంకకు పరుగులెత్తే

నపారశక్తికి నిరవుగా నెగడింది తోయం" గోదావరికి పురిటి సంధి కొట్టలేదు. ఆగ్నేయముఖంగా దారి చేసికొన్నది. అంతమయ్యేవరకూ ఆగ్నేయంగానే యాత్ర సాగించింది.

త్ర్యంబకంవద్ద గోదావరి సన్నని ధారగా పడుతూంది. ఆచోటునకు 'నాశిక' 16 మైళ్ళు. నాశికలోని పుష్కర జలంలో మా రైతులు స్నాన మాచరించి, తర్పణ లొసంగారు.

ఈ ప్రాంత మొకప్పుడు దండకారణ్యమట. శ్రీరామ చంద్రుడు లక్ష్మణ, సీతా సమేతంగా అరణ్యవాసం చేస్తున్నప్పుడు ఈ ప్రాంతంలోనే పర్ణశాలను నిర్మించుకొని – తమ పాదధూళితో ఈ భూముల్ని పవిత్ర మొనరించినాడట. ఇచ్చటనే రాముని ఆజ్ఞమేరకు లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు ఖండించిన విచిత్రగాథ లెన్నో చెప్పబడుతున్నాయి.

ఏమైనా గోదావరీ మహాతల్లికి జన్మ నొసంగిన 'త్ర్యంబకం' – దారికల్పించిన 'నాశిక' ముమ్మాటికీ పుణ్యభూములే. అక్కడ గోదావరి ముక్కుపచ్చలారని పసిపాప. చిరుగజ్జెలతో ఘల్లు ఘల్లున తప్పటడుగులతో పరువులు తీస్తున్న ఆ పాపనుచూచి మా రైతు లెంత ముచ్చటపడ్డారు! ఆ పాప దోగాడుతూ – పెరిగి పెద్దదై – పరుగులతో వచ్చి పాపికొండలలో పడి – పాప మెలికలు తిరిగి – చిక్కి శల్యామై ఎలాగో ఆపాపిష్టి కొండల్ని అధిగమించి – బయటపడి బట్టగట్టి – పోలవరంవద్ద మరల విజృంభించి మనకు కన్నుల పండువ చేస్తున్నదిగదా!

# ఔరంగాబాద్

పౌరాణిక ప్రాధాన్యత జెందిన నాశిక పుణ్యభూము ల్నుండి ఆ మరునాడే (23-5-56) చరిత్ర ప్రాముఖ్యత జెందిన ఔరంగాబాద్ చేరుకొన్నాము.

వేల సంవత్సరాల భారతీయ నాగరికతకు, సంస్కృతికి, ఇతిహాసానికి ఉనికిపట్టు అజంతా ఎల్లోరా గుహాలు. మన్మాడులో మా బండిని ఆపి మీటర్ గేజ్ ప్రత్యేక రైలు బండిలో తిరిగి తెలుగునాడు సరిహద్దుల్లోకి చేరుకున్నాము. అబ్బ! తెలుగుగడ్డ ఎంత సువిశాలమైనది. ఆంధ్ర మాగాణం నుండి - అరవభూమిలో ప్రవేశించి - కన్నడమాతను దాటు కుంటూ - మహారాష్ట్ర భూముల్లో సంచారం సలుపుతూ - తిరిగి తెలుగుతల్లి పొలిమేరల్లోకి వస్తిమిగదా! అది ఔరంగాబాద్. అది తెలంగాణా పొలిమేర. భారత భూమండలాన్ని ఏకచత్రాధిపత్యం క్రిందకు తెచ్చేందుకు ఔరంగజేబు నడపిన సామ్రాజ్య యుద్ధాలకు అది కేంద్రస్థానం. ఆ నాడచ్చట నిలసిల్లిన మహమ్మదీయ సంస్కృతి - మొగలు శిల్పకళ మొక్కవోలేదు. "బీబీకాముఖ్ బరా" (ఔరంగజేబు భార్య సమాధి) అందుకు చక్కని నిదర్శనం. ఆగ్రాలోని తాజ్ మహల్ నిర్మాణానికి అనుగుణంగా నిర్మించిన యీ కట్టడం - ఔరంగజేబు కళాభిమానానికి ఒక నిదర్శనం. ఔరంగజేబు మూర్ఖుడు - సామ్రాజ్య కాంక్షాపరుడు - మతోన్మాది కావచ్చు. కాని ఆతని కళాభిమానం కొని యాడదగినది. మొగల్ పరిపాలనలోని యింజనీరుల

ప్రతిభకు నిదర్శనం "పంచక్కీ వాటర్ ఫాల్". ఎత్తయిన ప్రదేశమునుండి ఒక కొలనులో నీరు పడుతున్నది. ఆ కొలనునుండి నీరు ఒక కాలువగా ప్రవహించి బయటికి పోతున్నది. ఆ కాలవక్రిందనే భూగర్భ గృహనిర్మాణం. అది "ఎయిర్ కండిషన్" గదిలాగా ఉన్నది. ఈ నీరు ఎక్కడనుండి వచ్చి పడుతున్నదని ప్రశ్నిస్తే — అజంతా గుహలనుండి అని సమాధాన మిచ్చాడు ఫకీర్. ఆశ్చర్యం! అరువదియైదు మైళ్ళనుండి వచ్చి ఎత్తయిన గోడమీదనుండి కొలనులో పడిపోతున్న స్ఫటికమువంటి ఆ శీతల పానీయాన్ని చూచిన ఎవరు అచ్చెరువొందరు? అది ఔరంగజేబు పాదుషా గురువు సమాధి.

ఔరంగాబాద్ నుండి ఎల్లోరా గుహలకు వెళ్ళేదారిలో చెక్కుచెదరని దౌలతాబాద్ కోట ఉంది. కొండమీద, కొండచుట్టూ పెద్దకోట. కొండక్రింద కోటలో ఎత్తయిన చాంద్ మీనార్. (స్తంభం) దౌలతాబాద్ ఒకనాడు దక్కను పరిపాలకులైన యాదవరాజుల రాజధానీ నగరం. ఈ నగరాన్ని 1318 లో ముబారక్ షా ఆక్రమించుకున్నాడు. ఢిల్లీ ప్రాంతం కరువురాక్షసికి గురియైనందున పాదుషా తుగ్లక్ ఢిల్లీనుండి రాజధానిని దౌలతాబాద్ కు బదిలీచేశాడు. పశ్చిమోత్తర ప్రాంతాలనుండి దాడులు బయలుదేరే ప్రమాదం వాటిల్లేప్పటికి తిరిగి రాజధానిని - దౌలతాబాద్ నుండి–ఢిల్లీకి మార్చవలసి వచ్చింది. దౌలతాబాద్ కోట అలాగే మిగిలిపోయింది. ఔను మరి! రాజులసొమ్ము రాళ్ళపాలు. ఒకనాడు ఆ ప్రాంతంలో–ఆ కొండకోనల మధ్య

ఒక మహానగరం విలసిల్లినట్లు ఆధారాలు కనుపిస్తున్నాయి. పాడుపడిన మహమ్మదీయుల గోరీలు, మశీదులు - చదురు చదురుగా కనుపిస్తున్నాయి. దారిలో బలమైన మొగల్ చక్రవర్తుల్లో చిట్టచివరివాడు, మొగల్ సామ్రాజ్య పతన కారకుడు ఔరంగజేబు సమాధిని చూచాము. తాను టోపీలు కుట్టుకొని-కురానులు అమ్ముకొని కూడబెట్టుకున్న సొమ్ముతోటే ఆ సమాధిని కట్టించినట్లు చెప్పబడుతూంది.

"కారే రాజులు రాజ్యముల్ గల్గరే గర్వోన్నతిన్ జెందరే-వారేరీ సిరి మూటగట్టుకొని పోవన్ జాలిరే..." అనే పద్యచరణం - మొగల్ చక్రవర్తి ఔరంగజేబు సమాధి చూస్తుండగనే నాకు జ్ఞాపక మొచ్చింది. ఔరంగజేబు సామ్రాజ్యవాద యుద్ధాలే మొగల్ సామ్రాజ్య పతనానికి గీటురాళ్ళయ్యాయి. దేశంలో క్రౌర్యం పెరిగింది. శివాజీ లాంటి మహావీరు లుద్భవించారు. మొగలాయి సామ్రాజ్యపు కంచుకోటలనుండి ఒక్కొక్క రాయి విరిగి పడిపోవడం ప్రారంభమైంది. ఆ నాడు దౌలతాబాద్ కోటలో శివాజీ ప్రతిష్ఠించిన భారతమాత విగ్రహం ఈ నాటికీ దేదీప్య మానంగా వెలుగుతుంది. ఆ యఖండజ్యోతి నాటికి - నేటికి అలాగే ఉంది. అది ఆరని జ్యోతి. అది జాతీయ స్వాతంత్ర్య జ్యోతి. శివాజీలాంటి స్వాతంత్ర్య యోధులు వెలిగించిన మహాజ్యోతి. అప్పటికీ ఇప్పటికీ 'మనం స్వాతంత్ర్య పిపాసులం- యుద్ధ వ్యతిరేకులం'' అని ఆ జ్యోతి సందేశ మిస్తున్నది.

పాపం మొగల్ సామ్రాట్ ఔరంగజేబు తన అంతిమ ఘడియలు ఆసన్నంకాగానే 'నే నెవరినో - నే నెక్కడికి

పోతున్నానో - ఈ పాపి జేసిన మహాపాపాలకు ప్రాయశ్చిత్త మేమిటో నాకూ తెలియదు. లోకంలోని అందరివద్ద వినయ పూర్వకంగా సెలవు తీసుకోవడమే నాకిప్పుడు మిగిలింది. అందర్నీ భగవంతుని బాధ్యతకు వదలిపెట్టి పోతున్నా. నా కొడుకులు తమలో తాము కీచులాడుకొనుటద్వారా దేవుని సంతానమైన ప్రజల పీడన, రక్తపాతం జరగరాదని నా అంతిమ ఆకాంక్ష. నా కాలమంతా ప్రయోజనా రహితంగా గడచిపోయినది...నా ఆత్మకు శాంతి లేదు-"... అన్న వాక్యాలు యింకా ఆ దౌలతాబాద్ చలవరాతి సమాధిలో గింగురుమని వినిపిస్తూనే ఉన్నాయి.

# ఎల్లోరా

ఔరంగాబాద్‌కు 19 మైళ్లలో వున్న ఎల్లోరా గుహాలకు ఉదయం 9 గంటలకు చేరుకున్నాము. కొండల్ని తొలిచి గుహాలు నిర్మించారు. గుహాలు బౌద్ధకాలపు శిల్పసంపదతో అలరారుతున్నాయి. మొదటి 13 గుహాలు బౌద్ధశిల్పాలు- 14, 16 గుహాలు శైవమత శిల్పము. 16 నుండి వైష్ణవ-జైన మత సాంప్రదాయ శిల్పము.

ఈ గుహాల నిర్మాణం క్రీస్తుశకం 8 వ శతాబ్దం వరకు సాగినట్లు చెప్పబడుతూంది.

మన శిల్పసంపద అత్యుత్తమమైంది. భారతీయ శిల్పంలో భారతీయ సంస్కృతీ, సాంప్రదాయాలు ఉట్టిపడు

తున్నాయి. మన శిల్పంలో - ఒక్క సౌందర్యమే కాదు - మహత్తరమైన సందేశ మున్నది. వివిధ ధర్మాల సామనస్య మున్నది. అందుకు అజంతా ఎల్లోరా గుహాల శిల్ప చిత్ర లేఖనమే నిదర్శనం !

ఆ మహత్తర సందేశ మేమి ? వివిధ ధర్మాలలోని మంచిని స్వీకరించమని !

ఒకనాడు వైష్ణవుల - శైవుల మధ్య యుద్ధాలు జరిగాయి. రక్తపాతం జరిగింది. మారణహోమం సాగింది. కొన్నాళ్ళకు బౌద్ధధర్మం - ఉపదేశంతోనే ఈ రెంటినీ జయించింది. ఒక వెయ్యేళ్లు ఆ ధర్మం ఈ దేశంలోనే కాకుండా ప్రాక్ దేశాలలో సయితం తన స్వర్ణ కాంతుల్ని వెదజల్లింది. ఆతర్వాత మరల వైదికమతం - బౌద్ధధర్మాన్ని జయించింది. బౌద్ధధర్మాన్ని రూపుమాపుటకు వైదకమత ప్రవక్తలు శిష్య బృందాన్ని దౌర్జన్యాలకు పురికొల్పారు. అమాయకుల్ని రెచ్చగొట్టారు. అమూల్యమైన బౌద్ధ శిల్పసంపదను నాశన మొనర్చేందుకు సయితం మూర్ఖులు వెనుదీయలేదు. ఈవిధంగా ధర్మాల మధ్య ఎన్నెన్నో అసందర్భాలు జరిగాయి.

కానీ భారతీయ కళావేత్తలు - మహాశిల్పులు - చిత్రకారులు ఏ ఒక్క ధర్మంయొక్క పక్షపాతులు కాదని అజంతా ఎల్లోరా అమూల్య కళా సంపత్తి దాని సృష్టికర్తల చిత్తశుద్ధిని నిరూపిస్తున్నది. ఆ కళాసంపద సమస్త ధర్మాల సమన్వయమైన ఒక మహోన్నత సృష్టి.

ఒక్క పవిత్ర భారతదేశంలోనే మనం చూశాము: - తథాగతుని పవిత్ర సందేశ చిత్రం - నటరాజ నృత్యం - శివ

తాండవం - ఉమా శంకరుల పరిణయం - కైలాసం, గ్రిష్ణేశ్వర ఆలయం-పరబ్రహ్మ స్వరూపం-రావణసంహారం. ఇది వైష్ణవ, శైవ, బౌద్ధ ధర్మాల సమన్వయం కదా! "ధర్మం ఒక్కటే - తేడా స్వరూపాలలోనే - నిర్వచనాల లోనే" అని కళా స్రష్టలు రుజువుచేయడంలేదా!

ధర్మాన్ని నిర్వచించేటప్పుడు కొందరిలో స్వార్థం సుడులుతిరిగి - పరకాష్ట చెందుతుంది. అప్పుడు ఆ స్వార్థ పరుల జిహ్వలపై "ధర్మం" వివిధరకాలైన విషస్వరూపాలను ధరిస్తుంది. ఘోరపరిణామాలకు దారి తీస్తుంది. మానవ పీడకు అదే హేతుభూత మాతుంది.

కానీ, నిస్వార్థమైన శిల్పికి, నిష్కామిమైన కళాకారు నకు స్వార్థంతో పని ఉండదు. అతడి ధర్మం ఒక్కటే - అది ఏ రూపంలో వున్నా సరే. అదే శాంతిసందేశం. అదే అనేక శతాబ్దాలనాటి అజంతా ఎల్లోరాలు మనకిస్తున్న అమరసందేశం.

అసలు గుహాలయాల నిర్మాణం అశోకసామ్రాట్టు కాలంలోనే క్రీస్తుకు పూర్వం 3వ శతాబ్దంలో ప్రారంభ మయింది. అశోకుడు, ఆయన మనుమడు దశరథుడు నిర్మింపజేసిన గుహాలయాలు బీహార్ రాష్ట్రం గయ జిల్లాలో ఇప్పటికీ ఉన్నాయి. ఆ తదనంతరం కొండలను తొలిచి ఆలయాలను నిర్మించడం దేశమంతటా విస్తరిల్లినది. భారతావని మొత్తంలో ఆ విధంగా దాదాపు 1200 గుహాలు నిర్మించబడ్డాయి. క్రీస్తుకు పూర్వం 2వ శతాబ్దం మొదట క్రీస్తుశకం 10వ శతాబ్దం వరకు పడమటికనుమల్లో విచ్చల

విడిగా కళావిలసితమైన గుహాలు నిర్మించబడినాయి. ఆదిలో నిర్మించిన గుహాలన్నీ బౌద్ధధర్మానికి సంబంధించినటువంటివే. బొంబాయిరాష్ట్రంలో, కర్లా, కణేహేరీ, నాశిక్, భాజ, బెడ్సా, ఎల్లోరా, అజంతా ఇందుకు నిదర్శనాలు.

ఏనాటి గుహాలో – ఈనాటికి చెక్కుచెదర లేదు. గుహాల నిర్మాణం ప్రశాంతమయ ప్రదేశంలో జరిగింది. ఈ గుహాలనుండి పశ్చిమవాలున దృష్టి ప్రసారమయ్యేంత వరకూ గోచరమయ్యే ప్రకృతిరామణీయకతకు పరవశత్వం జెందనివా రుండరు. ఆ గుహాలలోని సౌందర్యము – చల్లదనము – ప్రశాంతత – ధర్మచింతనాసక్తి – ఒకటేమిటి – మనసులోని చీకుచింతలు మటుమాయమై పోవలసిందే. ముఖ్యంగా 13 వ గుహాలోని మూడవ అంతస్తులో తిండి, తిప్పలు లేకపోయినా అలాగే ఉండవలె ననిపిస్తుంది. తత్కారణంగానే భిక్షువులు తదేకదీక్షతో తథాగతుని పరినిర్వాణ సూత్రాలను ఉపాసించగలిగారు.

అన్నిటినీ మించినది గుహాల నిర్మాణం. గుహాలలోని అత్యద్భుత కళాసృష్టి. అవి బౌద్ధభిక్షువుల విశాలమైన విహార గృహాలు, సమావేశ మందిరాలు. ఇరువైపుల కొండను తొలచి చెక్కిన రాతిస్తంభాలు – మధ్యలో చైత్యము. బుద్ధుని పవిత్రధాతువులు గలిగిన స్థూపము. చుట్టూ బౌద్ధభిక్షువులు నివసించే చల్లని గదులు – మధ్య మధ్య తథాగతుని జీవిత విశేషాలను ప్రస్ఫుటంజేసే మహాద్భుతమైన శిల్పకళ – ఇవి 2200 సంవత్సరాలకు పూర్వం ఆంధ్రరాజుల ఆదరణతో జరిగిన మహత్తర నిర్మాణాలు.

16 వ గుహాలోని కైలాసమందిరం ఒక అద్భుత సృష్టి. కొండను తొలిచి నిర్మించిన శిల్పకళాభరితమైన ఆ గొప్ప మందిరాన్ని క్రీ. శ. 760 లో ఆంధ్రచక్రవర్తుల తెగకు చెందిన రాష్ట్రకూట రాజులలో మొదటివాడైన కృష్ణుడు నిర్మింపజేశాడు.

రావణాసురుడు కైలాసాన్ని కదిలిస్తున్నాడు. అదొక మహత్తర శిల్పఖండం. ఆ మహత్తర శిల్పంద్వారా ఆ మహా శిల్పి మనకొక సందేశాన్నిస్తున్నాడు. రావణుడు కైలాసాన్ని పెకలించాడు. ఎందుకు ? మహత్తరమైన, మహిమాన్వితమైన ఒక మహాశక్తి ఆస్వాదనకు. అతడు రాక్షసుడన్నారు. కానీ ఆ శిల్ప నిర్మాణాన్ని పరకాయించి చూచినప్పుడు మన హృదయాలలో ఒక సృజనాత్మక భావన సుడులు తిరిగింది. రావణుడు దుర్మార్గుడని కాదు - దుష్టుడని కాదు - దేవతలను బెదిరించాడని కాదు - దైవశక్తులను ఎదిరించాడని కాదు - అష్ట దిక్పాలకులను బానిసల్ని చేసికొన్నాడని కాదు - పరమశివుని లొంగదీసుకొన్నాడని కాదు - ఇంద్రుని పదభ్రష్టుని జేసి కానలపాలు జేశాడని కాదు - మాయామానుష విగ్రహుడు శ్రీరామునిపై కయ్యానికి కాలుదువ్వాడని కాదు. అతని కార్యదీక్ష మనల్ని ఉత్తేజుల్ని చేసింది. కైలాసాన్ని కదిలించే శక్తి, ఆత్మవిశ్వాసం, బలపరాక్రమాలు అతనిలో ఉన్నాయి. ఆ మహత్తర శిల్పఖండాన్ని చూచినప్పుడు మనలో జనించిన సృజనాత్మకభావన అదే.

ఒక గుహాలో దశావతారాలు చూశాము. మానవ సమాజంలో చెలరేగిన విప్లవాలను పరిష్కరించేందుకు

మహానాయకులు పదిమంది ఉద్భవించారు. విప్లవాలను అణచివేశారో-లేక విప్లవ ఆశయాలను ఫలింపజేశారో-అది హేతువాదానికి సంబంధించిన సమస్య. కాని ఆ శిల్ప ఖండాలను చూచినప్పుడు దైవశక్తిని సవాలుచేసే మానవ శక్తి ఆనాడు ఉన్నదనే ఒక ఉత్తేజకరభావన మా హృదయాంతరాళాలలో పరవళ్లు త్రొక్కింది. ఆ విధంగా ఉత్తేజాన్ని కలిగించుటకు కారణభూతులు ఆనాటి హిరణ్యాక్ష, హిరణ్యకశిప, బలి, రావణబ్రహ్మ వగైరా మానవయోధులే కాదు - ఎల్లోరాలో కళాఖండాలను నిర్మించి అమరులైన ఆ మహాశిల్పులుగూడా.

క్రీస్తుశకం 6-వ శతాబ్దం మొదలు 12-వ శతాబ్దం వరకు ఆంధ్రసామ్రాజ్యాన్ని విస్తరింపజేసిన చాళుక్యులు, రాష్ట్రకూటులు ఎల్లోరా-అజంతా గుహాలను అభివృద్ధి జేసినట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి. అజంతాగుహాలు కేవలం బౌద్ధానికి చెందినటువంటివి. క్రీస్తుకు పూర్వం 200 మొదలు క్రీస్తుశకం 650 వరకు ఈ గుహాలు నిర్మించబడినాయి. ఈ గుహాలలోని కళాఖండాలను చైనా బౌద్ధయాత్రీకులు హుయాన్ త్సాంగ్, పాహియాన్ ప్రభృతులు ఘనంగా వర్ణించారు. ఇవి మొత్తం 29 గుహాలు. ఇందు 4 బహువిధాలంకృతమైన ఆలయాలు. మిగిలినవి బౌద్ధబిక్షువుల విహారాలు. హీనయాన, మహాయాన బౌద్ధధర్మానికి చెందిన చైత్యాలను, విహారాలను - వాటి వాటి ధర్మాల ననుసరించి సులువుగా గుర్తించనగును. ఇందులోని కళాఖండాలు మూడు విభాగాలు. భవంతులు, చిత్రలేఖనం, శిల్పం.

చిత్ర లేఖనం ఒక అద్భుతం. అందుకు ఉపయోగించిన పరికరాలు, రంగులు ఎలాంటివో - ఎక్కడివో పరిశోధించడం అసాధ్యం. ఆ లేఖనం నిన్న నేటిదని భ్రమపడటం అత్యుక్తి కాదు. గౌతమబుద్ధుని నీతికథలకు సంబంధించినవే



అజంతా చిత్రలేఖనం

ఈ చిత్ర లేఖనం. సిద్ధార్థుని జన్మ మొదలు, పరి నిర్యాణం వరకూ మన కండ్లకు కట్టేట్లు చిత్రింపబడిన ఆ కళాకారు లెవరో - వారి కుంచెలే బౌద్ధధర్మాన్ని జీర్ణించుకొని వాటంతట అవే బొమ్మలు గీచినవా ? లేక బౌద్ధులే బౌద్ధ

ధర్మ ఉత్తేజంలో చిత్రలేఖకులై, శిల్పులై, మత శిల్పులై ఈ మహత్తర కళాఖండాలను నిర్మించారా? అనిపిస్తుంది. ఈ గుహాలు "గుఱ్ఱపునాడా ఆకారంగా ఉన్న ఒకే ఒక కొండలో తొలచబడినాయి. లలిత కళలకు అగ్ర స్థానం – ప్రథమస్థానం వహించిన గ్రీకుల పురాతన నగరం 'ఏథెన్సు'లో ఇంతటి అద్భుత కళాసృష్టి వున్నదో – లేదో – తెలియదుగాని వేల వత్సరాలనాటి ఈ భారతీయ కళాసృష్టి – "అద్వితీయం – అమరం – అఖండము" అని చెప్పకుండా ఎలా ఉండగలం. రెండువేల సంవత్సరాలనాడు 'ఏథెన్సు'లో చిత్రలేఖనానికి పునాది ఏర్పడిందనీ – అదే ప్రపంచలో కల్లా ప్రప్రథమ చిత్రమనీ చెప్తున్నారు. ఆ చిత్రం ముద్దగా అస్పష్టమైన అంగనిర్మాణంతో ఉన్నది. కానీ వేల సంవత్సరాలనాడే భారతీయ చిత్రకళ పరాకాష్ట నందు కొన్నట్లు, పరిపక్వదశకు వచ్చినట్లు అజంతా – ఎల్లోరా గుహాలలోని అపురూప కళాసృష్టి ఋజువు చేస్తున్నది.

"ఇదంతా మానవ నిర్మితమేనా! అని మా రైతులు అచ్చెరు వందారు. ఇది మన పూర్వుల కళానైపుణ్యానికి – మన ఆంధ్ర రాజుల కళాభిమానానికి – మన ఆంధ్రమాత సామరస్య విధానానికి నిదర్శనమే'' నని తెలిసికొన్న మా రైతుయాత్రికుల హృదయాలు ఎంతగా నిండిపోయాయో! భారతీయ ఇతిహాసంలో ఆంధ్రులకు ఇంతటి ప్రతిష్ట ఉన్నదా అని ఉబ్బి తబ్బిబ్బుకాని రైతు లేడు.

నిండు హృదయంతో — అలవిగాని వుల్లాసంతో పూర్వపు ఆంధ్రసామ్రాజ్యపు కీర్తి కాంతను చూసిన

గర్వంతో ఔరంగాబాద్ స్టేషన్‌లో యాత్రికులు బండి ఎక్కారు.

## సాంచీ - బుద్ధ జయంతి

ఈ యాత్రలో బౌద్ధక్షేత్రాలు ఒక ప్రత్యేకస్థాన మాక్రమించాయి. అశోకునకు పూర్వమే ఆంధ్రులు బౌద్ధ ధర్మాన్ని స్వీకరించారు. అశోకుని అనంతరం మగధరాజును జయించి క్రీ. పూ. 28 సంవత్సరంలో ఆంధ్రులు నాశిక్ వరకూ స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించుకున్నారు. ఆ విధంగా కీ. శ. 225 సంవత్సరంవరకు దక్కను, మహారాష్ట్ర, గుజరాత్, కోంకణ దేశాలలో ఆంధ్రసామ్రాజ్యం విలసిల్లింది. అప్పట్లో ఆంధ్రరాజులు వైదిక మతావలంబికు లైనప్పటికీ బౌద్ధధర్మాన్ని గూడా పోషించారు. ఆ నాటికీ ఈనాటికీ గూడా ఆంధ్రులలో మతమౌఢ్యం తక్కువ. అందుకు నిదర్శనం–ఆంధ్రరాజులచే నిర్మింపబడిన కార్లీ, పూనా, నాశిక్, కన్హరీ, అజంతా, ఎల్లోరా మొదలగు గుహాలలోని సర్వధర్మ సమ్మిళితమైన కళాఖండాలే. ఎల్లోరాలో మా రైతులకు సాక్షాత్కరించిన కళావిలసితమైన బుద్ధవిగ్రహాలు, ప్రశాంతమైన బౌద్ధవిహారాలు, జైన, శైవ, వైష్ణవ ధర్మ సాంప్రదాయ శిల్పసంపద ఒకనాటి ఆంధ్రుల కళావైభవానికి, మతసామరస్యానికి ప్రత్యక్ష నిదర్శనాలు.

ఆ రోజు బుద్ధజయంతి, తథాగతుడు – లుంబినిలో జన్మించి అప్పటికి సరిగ్గా 2,500 సంవత్సరాలు.

మే 24–వ తేదీ – తథాగతుని ధాతువులు భద్రపరచబడిన 'సాంచీ' బౌద్ధక్షేత్రానికి చేరుకున్నాము. వడగాల్పులు





సాంచీ బౌద్ధస్తూపం

నిప్పులు చెరుగుతున్నాయి. వేసవి ఎండలు పొగలు చిమ్ముతున్నాయి. ఉదయం 9 గంటలైంది ఆ పవిత్ర ప్రదేశానికి చేరుకొనేటప్పటికి. తథాగతుని పవిత్రధాతువుల్ని అశోక సామ్రాట్టుచే ప్రతిష్ఠింపబడిన పావన ప్రదేశంలో కన్నుమూసిన ఒక 80 ఏండ్ల వృద్ధరైతు ఎంతటి ధన్యాత్ముడో! ఒంగోలు తాలూకా చంద్రపాలెంనుండి భార్యాసమేతుడై జరామరణావస్థలో యాత్ర సాగిస్తున్న ఆ రైతు కాశీలో కన్నుమూయాలని ఎంతగానో ఆకాంక్షించాడట. ఆ రైతు

తండ్రిగూడా కాశీనుండే స్వర్గయాత్ర సాగించాడట. కానీ కాశీవంటి పవిత్రస్థానమైన సాంచీనుండే ఆయన కైలాస యాత్ర సాగించడమూ - పైగా బుద్ధజయంతి పుణ్యదినాన కన్నుమూయడమూ ఆయన అదృష్టమే.

సాంచీ భూపాల రాష్ట్రములోనిది. భూపాలనగరానికి 28 మైళ్ళలో ఉన్నది. ప్రసిద్ధమైన బౌద్ధ స్థూపాలకు అది నిలయం.

సామ్రాట్ అశోకుని బౌద్ధ ధర్మసంస్థాపనకు ప్రధాన చిహ్నాలలో సాంచీ ఒకటి.

ధర్మసంస్థాపనార్థం అశోకచక్రవర్తి సలిపిన అవిరళ కృషికి - ఆంధ్రుల ఇతిహాసానికి అత్యంత సన్నిహిత సంబంధాలున్నాయి.

ఆదిలో అశోకుడు సమరప్రియుడని, సామ్రాజ్యాకాంక్షాపరుడనీ, రక్తపిపాసి అనీ - అందరికీ తెలుసు. అతడు సలిపిన సామ్రాజ్య యుద్ధాలలో జరిగిన మారణహోమం అంతకుముందెన్నడూ జరిగి యుండలేదు. ఉత్తరాది మొదలు వింధ్యపర్వతశ్రేణుల నధిగమించేంతవరకూ అతని కత్తికి ఎదురు లేకపోయింది. కానీ దక్షిణాదిన-అంటే ఉత్తరాంధ్రలో (ఇప్పటి శ్రీకాకుళంజిల్లా, ఒరిస్సారాష్ట్రం) కళింగరాజ్యం అతడికి కొరకరాని కొయ్య అయింది. ఎన్నిసార్లు దండెత్తినా ఆ సామ్రాట్టుకు కళింగులు లొంగలేదు. చివరకు ఆ యుద్ధంలో చిందిన వేలాది మానవుల వేడినెత్తురు అశోకుని సామ్రాజ్య గర్వాన్ని అణచివేసింది. లక్షలాదిమంది ఆకలికి అలమటించి,

నిరసించి అశ్రువులు బాశారు. ఆ ఘోరమైన దృశ్యం ఆ చక్రవర్తి అధికార పిపాసను హతమార్చింది. సామ్రాట్టు బౌద్ధుడయ్యాడు. ఇది ప్రపంచచరిత్రలోనే ఒక అపూర్వమైన సంఘటన. ఈ సంఘటన కారణంగానే విశ్వంలో ఒక నూతన ధర్మం ఉద్భవించింది. ప్రపంచ చరిత్రలో మొట్ట మొదటిసారిగా ఒక మహత్తర ఆశయాన్ని, ఒక మహోత్కృష్ట ధర్మాన్ని విశ్వవ్యాపితం చేయగలిగింది ఈ సంఘటనయే. బౌద్ధధర్మం ప్రపంచధర్మంగా, చెలామణీ కాగలిగిన ఒక అత్యద్భుత సంఘటనకు ఆంధ్రులు కారణభూతులు కాగలిగారన్న సత్యాన్ని తెలిసికొన్న మా రైతుల ఆనందానికి ఆనకట్టలు లేకపోయాయి. అది క్రీస్తుకు పూర్వం మూడవ శతాబ్దం. కళింగ యుద్ధానంతరం అశోకుడు బౌద్ధధర్మాన్ని స్వీకరించి సాంచీలో అన్నిటికంటే పెద్దదైన బౌద్ధస్థూపాన్ని నిర్మించాడు. ఆ పవిత్రస్థలంనుండే తన పుత్రికను, తన పుత్రుడు మహిందను (అతడు అశోకుని సోదరుడని కూడా చెప్పబడుతున్నాడు.) బౌద్ధధర్మ ప్రాపకానికి సిలోన్ మొదలైన దేశాలు పంపించాడు. మహిందుడు తన జీవితాంతం వరకూ లంకలోనే గడిపాడు. ఆయన కృషివల్లనే బర్మా, సయాం, సిలోన్ దేశాలలో ఈనాటికీ బౌద్ధధర్మం మొక్కవోకుండా నిలిచి ఉన్నది – చిన్న కొండమీద తథాగతుని పవిత్ర ధాతువులు ప్రతిష్ఠింపబడిన సాంచీ బౌద్ధస్థూపం చెక్కుచదరకుండా నిలచి ఉన్నట్టుగా. ఆ రోజు గౌతమ బుద్ధుని 2,500 వ జయంతి అవడంవలన సాంచీకి ప్రత్యేక రైళ్ళు నడిపించ బడ్డాయి. సాంచీలో జరుగు బుద్ధజయంతి ఉత్సవాలను

తిలకించుటకు పరిసర ప్రాంతాలనుండి – సుదూర ప్రదేశాల నుండి వేలాది ప్రజలు ఆ పవిత్రస్థానంలో వచ్చి చేరుకున్నారు. శ్రీ కైలాసనాథ కట్జూ, భోపాల్ స్టేటు రాజప్రముఖ్, ముఖ్యమంత్రి ప్రభృతు లెందరో హాజరయ్యారు. సాంచీ కోలాహలంగా ఉన్నది. బౌద్ధస్థూప, చైత్యాల నిలయమైన సాంచీ కొండ యావత్తూ జనంతో నిండిపోయింది. అంత మంది భోపాల్ రాష్ట్ర ప్రజా సముదాయంలోనూ మూడు వందల మంది ఆంధ్ర రైతులు ప్రత్యేకంగా కనుపిస్తున్నారు. ఎందుకో మరి ఆ ప్రాంతపు రైతులు – మన రైతుల మధ్య ఏదో ఒక తేడా కనుపిస్తున్నది. ఆ రైతుల దుస్తుల్లో, ముఖకవళి కలలో – మాటల్లో పేదరికం తొంగిచూస్తున్నది. మన రైతుల లోని నాగరికత ఆ రైతుల్లో లోపిస్తున్నది. కారణం అడిగి తెలిసికొన్నాము. మన రైతులు వ్యవసాయంలో ఆరితేరిన వారు. అది అక్కడివారిలో కనుపించడం లేదు. మన రైతుల్లోని జాగృతి, విజ్ఞానం కూడా వారిలో కొరతగానే ఉంది. అందరూ కలిసిమెలిసే ఆ పవిత్ర బౌద్ధక్షేత్రంలో విహారం సల్పారు. మేము రైతులమంటే వారు కాసేపు నమ్మలేదు. మేము మేడిపట్టి కొంద్ర దున్నుతామంటే వారికి ఆశ్చర్యమేసింది. మా మాగాణంలోనే "రైతుబాంధవుడు ఆచార్య రంగాగారు జన్మించారు" అంటే వారి ముఖాలు విప్పారినవి. మిమ్మల్ని చూచేందుకు మేము వచ్చాము – ఈ పవిత్ర బౌద్ధక్షేత్రంలో కలిసికొంటున్నాము" అంటే వారి ఆనందానికి అంతులేకపోయింది." బెస్–బేట్వానదుల సంగమ ప్రాంతంలో అశోకుని కాలంలో ఒక బౌద్ధుల తెగ ఉండేదట.

"ఆ తెగకు మీకు ఏమైనా సంబంధ మున్నదా ?" అని అడిగితే మాకు తెలియదన్నారు. ఔను మరి. అశోకుని అనంతరం పుష్యమిత్రుడనే ఒక బ్రాహ్మణ సైన్యాధిపతి చిట్టచివరి మౌర్యరాజైన బృహద్రథుని హతమార్చి "సుంగ" రాజ్యాన్ని స్థాపించి – తిరిగి యజ్ఞయాగాదులు ప్రారంభించి నిర్హేతుకంగా – కరుణా రహితంగా బౌద్ధులను నాశనం చేశాడు కదా! అది చరిత్ర పుటల్లోనే అణగిపోయింది. ఈ అమాయక రైతుల కెలా తెలుస్తుంది ?

తథాగతుని ధాతువులను ప్రతిష్ఠించిన స్థూపానికి నాలుగువైపులా అత్యద్భుత శిల్పకళావిలసితమైన తోరణాలు (ద్వారాలు) చూచి మా రైతులు అచ్చెరు వొందారు. ఈ తోరణాలు నిర్మించినది ఎవరో కాదు, మౌర్య సామ్రాజ్య పతనానంతరం – క్రీ. శ. ఒకటవ శతాబ్దంలో ఆంధ్ర రాజులు నిర్మింపజేశారు. అంటే ఆంధ్ర సామ్రాజ్యపు దీప్తి – శిల్ప కళా విశిష్టత, బౌద్ధధర్మంపట్లగల విశ్వాసం సాంచీలోని అశోకుని బౌద్ధ స్థూపపు తోరణాలలో విరాజమాన మౌతున్నది. ఈ అద్భుతమైన తోరణాలపై గౌతమ బుద్ధుని, ఆయన శిష్యుల జీవితాలలోని ప్రధాన ఘట్టాలు ? జాతకకథలు, బౌద్ధధర్మంయొక్క చరిత్ర విశిష్టత ప్రస్ఫుట మౌతున్నది.

బుద్ధుని ప్రధాన శిష్యులైన సారిపుత్ర, మహా మొగ్గ ల్లాల జీవితం ఈ ప్రాంతాలలోనే గడచినట్లు చెప్పబడు తున్నది. వీరే బౌద్ధధర్మంలో అవసరమైన కొన్ని మార్పులు చేయుటకు కారణభూతు లని కూడా చెప్పబడుతున్నది.

ఇచ్చటనే వీరిద్దరి ధాతువులు 1831 లో జెనరల్ కానింగ్ హామ్‌చే కనుకొనబడి (అప్పటి భారత ప్రభుత్వ పురావస్తు శాఖ కమిషనర్) లండన్‌లోని 'విక్టోరియా ఆల్బర్ట్ మ్యూజి యంకు పంపబడినవి. భారత దేశ స్వాతంత్ర్యానంతరం 1949లో తిరిగి ఆ ధాతువులు సాంచీకి పంపబడి పునఃప్రతిష్ఠ గావింప బడినవి. ఇచ్చట యింకా అనేక చిన్నచిన్న స్థూపాలు నిర్మించబడి ఉన్నాయి. ఇవన్నీ బౌద్ధభిక్షువుల పవిత్ర ధాతువులచే ప్రతిష్ఠింపబడినటువంటివి. వీటి నిర్మాణం క్రీ॥ పూ॥ 3 వ శతాబ్దం వరకూ జరిగింది.

సాంచీకొండపై ఇంకా ఎన్నో భిక్షుక పీఠాలు - ఆశ్రమాలు, విహారాలకు సంబంధించిన శిథిలాలు కనిపిస్తు న్నాయి. ఒక విహారంలో దేదీప్యమానంగా వెలిగే బుద్ధ విగ్రహం మాకు ప్రత్యక్షమైంది. ఇచ్చట ఎన్నో ప్రపంచ ప్రసిద్ధమైన భిక్షువుల సమావేశాలు జరిగేవట. హిందూ దేవాలయం మాదిరి నిర్మింపబడిన ఒక మందిరంలో బుద్ధ విగ్రహం గోచరించింది. ఇది హిందూ - బౌద్ధ ధర్మాల సమన్వయమని చెప్పుకోవచ్చు. ఇది మధ్యకాలంలో - హిందూమతం పుంజుకునే రోజుల్లో - హిందువుల - బౌద్ధుల మధ్య సామరస్య సాధనోద్దేశంతో ఆంధ్రరాజుల సంతతి వారు నిర్మించినట్లు ఊహించబడుతున్నది.

పోతే ఇటీవల నవీన ధోరణిలో నిర్మించిన మరో ఆలయం వున్నది. ఇది సార్‌నాథ్‌లోని బౌద్ధ ఆలయాన్ని పోలి ఉన్నది.

సాంచీలో ఆంధ్ర రైతులను కదిలించినది – తోరణాల మీది ఆంధ్రుల శిల్పనైపుణ్యం. ఉద్రేకపరచినది – బౌద్ధ ధర్మాన్ని విశ్వవ్యాపితం జేసిన అశోకుని బౌద్ధధర్మనిష్ఠ.

సాయంత్రం 7 గంటలకు జయంతి ఉత్సవాలు ముగిశాయి. అందరితోబాటు, ఆంధ్రరైతులు సాంచీకొండ దిగారు.

## ఆగ్ర - తాజ్

ఆంధ్ర రైతుల బుద్ధజయంతి కార్యక్రమం జయప్రదంగా ముగిసింది. 24 వ తేదీ రాత్రి 9 గంటలకు సాంచీ స్టేషన్‌లో బండి బయలుదేరింది. తెల్లవారి 9 గంటలకు మొగలాయి చక్రవర్తుల ముఖ్య నగరం "ఆగ్రా" చేరుకున్నాము.

ఒక్కరాత్రిలో బౌద్ధ ప్రపంచంనుండి మహమ్మదీయ ప్రంచంలోని కురికాం. ఈ రెండు ధర్మాలనూ రాజులు పోషించారు. అయితే ఈ రెంటికీ ఒకటే తేడా. ఒకటి యుద్ధాలను ఆపివేసింది; ఒకటి యుద్ధాలకు దారితీసింది; ఒకటి ప్రపంచానికి శాంతి సందేశాన్ని అందజేసింది. ఒకటి "జీహాద్" కైపుతో మారణహోమం చేసింది. భారత దేశంలో మొట్టమొదటి మొగల్ పాదుషా బాబర్ తన సైనికులను "జీహాద్" (మతయుద్ధం) కైపు నెక్కించి 1526 సంవత్సరం ఏప్రిల్ 27–వ తేదీన ఆగ్రాను, ఢిల్లీని ఆక్రమించుకున్నాడు. "విజయమో – వీరస్వర్గమో" అనే పిలుపుతో

తన సైనికుల్ని ఉద్రేకపరచాడు. క్రమశిక్షణ గలిగిన కొద్ది మొగల్ సైన్యంతో భారతదేశంపై సర్వాధిపత్యాన్ని



తాజ్ మహల్

సాధించి – మరి రెండు శతాబ్దాలవరకూ సుస్థాపితం చేయ గలిగాడు. ఈ రెండు శతాబ్దాల కాలంలో ఆగ్రా మొగల్ పాదుషాలకు విహారవాటికగా ప్రసిద్ధికెక్కింది.

ఆగ్రానుగురించి తెలియని భారతీయుడు లేడు. అంతే కాదు, ప్రపంచ ప్రసిద్ధిపొందినది ఆగ్రా. ఈ ఘనతకు కారణం మొగల్ పాదుషాల కళాభిజ్ఞత కావచ్చు, తమ స్వంత సౌకర్యాలపట్ల – తమ స్వంత మనుష్యులపట్ల గల ప్రత్యేక శ్రద్ధ కావచ్చు. ఏమైనా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన "తాజ్ మహల్" ఆగ్రా ప్రశస్తికి కారణమైంది. తాజ్ మహల్‌ను గురించి మనం కావలసినంత విన్నాం. కవులు

కవన మల్లారు. చరిత్రకారులు ప్రశంసల వర్షం కురిపించారు. విదేశీయులు భారతీయ ప్రశస్తికి అది ప్రధాన తార్కాణ మన్నారు. నిస్సందేహంగా "తాజ్" విశ్వ ఇతిహాసంలో ఒక ప్రధాన అంకం. తాజ్ మహల్ కీర్తి మనల్ని ఉర్రూతలూగిస్తుంది. ఒక్క తాజ్ మహల్ మాత్రమే కాదు, ఆగ్రా కోట - అక్బర్ నిర్మించిన క్రొత్తరాజధాని "ఫతేపూర్ సిక్రి" కూడా - వీటన్నింటికీ 'తాజ్' మకుటం. అందుకే ఒక విదేశీ బాటసారి అన్నాడు. "భారతి దేశం చూడనివాళ్ళకు నేను చెప్పదలచుకున్న దొక్కటే - ఇండియాకు వెళ్ళండి. 'తాజ్' ఒక్కటే చాలు, మీ హృదయాలు నిండిపోతాయి."

ఫతేపూర్ సిక్రి అద్భుతమైన రాజధాని. ఆగ్రాలో అక్బరు చక్రవర్తికి బిడ్డలు బ్రతకలేదట. తనగురువు షేక్ సలీమ్ సలహాప్రకారం తన మకాం 25 మైళ్ళలో వున్న సిక్రీకి మార్చాడు. సిక్రీని ఇంద్రలోకంగా రూపొందించాడు. వజ్ర వైఢూర్యాలతో పొదిగిన మసీదు - చలవరాతి గదులు - శాలలు - విహారాలు; 7 చదరపుమైళ్ళ విస్తీర్ణం; నిర్మాణం - మొగల్ - హిందూ కళాసమన్వయం; అది అక్బరు "విజయ నగరం." కానీ అందులో 15 సంవత్సరాలు మాత్రమే నివశించాడు. ఆతని గురువు షేక్ సలీమ్ అందులోనే కన్ను మూశాడు. తెలుపు - నలుపు చలవరాతితో నిర్మించిన ఆ యోగి సమాధి అందులో ప్రకాశిస్తున్నది. తరువాత అక్బరు తన దర్బారును లాహోరుకు మార్చాడు. ఆనాటి నుండి ఈనాటివరకూ సిక్రీ అలాగే ఉన్నది.

అప్పుడు నిర్మించిన ఆగ్రకోటలో దర్బారు - ఖాస్ కమరా కన్నులపండువగా ఉన్నాయి. యమునానది ఈవలి ఒడ్డున కోట - ఆవలివొడ్డున తాజ్ - ఆ చోటు ఎంత శోభాయమానంగా వున్నదో వర్ణించగలమా!

మొగలు పాదుషాలు దేశానికి మేలు జేకూర్చక పోయినా వారి స్వంత సౌకర్యాలకొరకు నిర్మించుకొన్న అపూర్వ కళాకౌశలంతో గూడిన నిర్మాణాలు భారతావనికి వన్నె-చిన్నెలు చేకూర్చాయి.

ఆ రోజు పున్నమ మరుసటిరోజు. తెల్లని వెన్నెలలో నిర్మలమైన నీటిలో తాజ్ ప్రతిబింబిస్తూ వుంటే మా రైతుల ఆనందానికి అంతులేకుండా పోయింది. తాజ్ నిర్మాణం అసామాన్యమైంది. నాలుగువందలకోట్ల రూపాయల వ్యయంతో ఇరవై వేలమంది కూలీలు-ఇరవై సంవత్సరాలపాటు నిర్మించారు. ఈ నిర్మాణం మహత్తరమైనదైనా - నిర్మాణ సమయంలో ప్రజలు విపరీతమైన బాధలకు లోనైనారు. ప్రభుత్వం - ప్రభుత్వ సిబ్బంది యావత్తూ తాజ్ నిర్మాణంలోనే నిమగ్నమైంది. దేశంలో అరాజకం ప్రజ్వరిల్లింది. దారి దోపిళ్ళు పెచ్చరిల్లాయి. ఉద్యోగుల్లో నిరంకుశత్వం, లంచగొండితనం హద్దుమీరిపోయింది. ఖజానాలోని సొమ్మంతా కోటలకు, గోరీలకు కావలసిన రాళ్ళక్రింద ఖర్చయిపోయింది. రైతుల ఎద్దులు-బండ్లు రాజుగారి కట్టడాలకు రాళ్ళు మోసేందుకే వినియోగించ బడ్డాయి. నాగళ్ళు మూలబడ్డాయి. కూలి స్వల్పం - పన్నులు జాస్తి. ఒక్కొక్క కూలీకి, లేక కళాకారునకు నెలకు 3, 4 రూపాయలకంటే హెచ్చు కూలీ

లభించడం దుర్లభమైంది. ఫ్రెంచి యాత్రికుడు టెవిర్నియర్ మహాశయు డిలా వ్రాశాడు. " ఈ సమయంలో తాలుల వ్యవసాయం మూలపడింది. కడుపు కక్కుర్తికి రైతాంగం సర్దారులవద్ద బంట్లుగా చేరిపోయారు. తత్కారణంగా నీటి వనరులు పాడుపడ్డాయి. గ్రామాలు - పొలాలు ఊసర క్షేత్రాలయ్యాయి. కరువురక్కసి కోరలుచాచి విజృంభించింది. ప్రజలలో సహనం నశించింది. అక్కడక్కడ తిరుగుబాట్లు కూడా బయలుదేరాయి."

ఈ కథనం విన్న మా రైతులు 'తాజ్ మహల్' చూస్తున్న సంతోషంలోనే భారంగా ఒక్క నిట్టూర్పు విడిచారు. "తాజ్ మహల్ లాంటి కట్టడాలు ఒక్క మొగల్ పాహజాదాలకు మాత్రమే సమాధులు కాదు - సామాన్య ప్రజానీకానికి కూడా" అనే భావన కూడా కలుగకపోలేదు.

ప్రథమ మొగల్ పాదుషా బాబర్ భారతదేశాన్ని, భారతీయులను ఈసడించుకున్నాడు. " భారతదేశం తన "సమర్ ఖండ్ లాగా లేదట. మనుష్యులు వికారంగా వున్నారట. నాజూకు లేదట. దేశంలో మంచి గుర్రాలు లేవట. మంచి మాంసం దొరకదట. ద్రాక్ష, ద్రాక్షరసం - చల్లని పానీయాలు లేవట. దేశం వేడిగా ఉంటుందట. అందుకే చలవరాతి స్నానాల గదులు - చలవరాతి విహారాలను ఏర్పాటు చేసికొన్నారు. కాని మా రైతులు మాత్రం బాబర్ చక్రవర్తిలాగా మొగల్ సమాధులను - కట్టడాలను ఈసడించుకోలేదు - సరికదా - మన పూర్వీకులు చమటోడ్చి,

తిండికి మాడి - రక్తాన్ని ధారవోసి వీటిని నిర్మించినా - ఇది మా పెద్దల - మా రైతుల - మా కూలీల - మా కళాకారుల కష్టానికి, కళానైపుణ్యానికి స్మృతిచిహ్నాలనే భక్తి విశ్వాసాలను, సంతోషాతిశయాలనే ప్రదర్శించారు. దయాల్బాగ్ మొదలైన వస్తు ప్రదర్శనశాలలో చలవరాతి వస్తువులను - ఆగ్ర - కళాకారుల జ్ఞాపకార్థం కొనుక్కొని రాత్రి 9 గంటలకు ఆ మొగల్ పాదుషాల పట్టణంనుండి సెలవు తీసుకొన్నాం.

## మధురానగరం

గోపీకృష్ణుని బాల్య క్రీడలు ప్రతి హైందవుని హృదయాన్ని గిలిగింత పెట్టిస్తాయి. మరులు గొలిపిస్తాయి. ఆ క్రీడలలో అపురూపమైన ఆధ్యాత్మిక తత్వం ఉన్నదని మన శాస్త్రాలు ఉగ్గడిస్తున్నాయి. చిన్నికృష్ణుని బాల్యం యమునా నదివొడ్డున మధుర, బృందావనం, గోకులంలో గడిచిందనీ - అందుకు సంబంధించిన, ఆ మహిమాన్వితుని అత్యద్భుతమైన లీలలకు సంబంధించిన కథల్ని మనం ప్రతిదినమూ కోకొల్లలుగా వింటున్నాం.

మొగలాయిల యుగంనుండి ఒక్క రాత్రిలో ద్వాపర యుగం దాకా వెనక్కు నడిచి - మా రైతులు మే 26 తేదీకి నందగోపాలుని సుందర నగరం మధుర చేరుకున్నారు.

యమునానదిలో కృష్ణుడు జలకమాడాడట. కాళీయ మర్దనం చేశాడట. గోపికలు యమునానదిలో జలకమాడు

తుంటే కొంటెకృష్ణుడు చీరెలు చెట్టుపై కెక్కించేవాడట. ప్రతిరోజు మథురానగరిలో చల్లలమ్మబోయే రాధను యమునాతటిలో నందకృష్ణుడు కలసికొనేవాడట. గోకులంలో గొల్లపిల్లలతో గోవులు కాచేవాడట. దారినపోయే గొల్ల భామల చల్లకుండల్ని చిల్లులు పెట్టేవాడట. గోపికాస్త్రీలను కన్నుగీటేవాడట. అల్లరిచేసేవాడట. గోవర్ధనగిరిపర్వతాన్ని వ్రేలిమీద నిలిపాడట. ఆ ప్రాంతాల నన్నింటినీ మా రైతులు వీక్షించారు. విశ్రామ్‌ఘాట్‌లో యమునానదిలో జలక మాడారు. అయితే వస్త్రాలను చెట్టుమీద కెక్కించేందుకు కొంటెకృష్ణుడు రాలేదుకాని, నదిలోని పెద్దపెద్ద తాబేళ్ళను చూచి ఉలిక్కిపడ్డారు. ఔను మరి! తాబేళ్ళా భగవంతుని అవతారమేగదా! శ్రీకృష్ణుని అవతారం మాదిరిగా! యమునానది ఏనాటిది! ఎంత పవిత్రమైనది! కృష్ణుని క్రీడలు – లీలలు – యమునానదికి బహుదగ్గరి సంబంధం. ఆ నీలమేఘశ్యామునికొరకు, ఆ కళామయ జీవి కటాక్ష వీక్ష ణాలకొరకు పదహారువేలమంది గోపికలు రోజూ యమునా నదీ తీరంలో హరిణ వీక్షణాలతో పడిగాపులు గాచేవారట. ఆహా! ఆనాటి కృష్ణావతారం – రసిక చక్రవర్తి ద్వితీయ స్వరూపమేగదా! ఆ రసికుని రసికత్వంలో ఆధ్యాత్మిక ఆనందంతప్ప – మరోభావనకు ఆస్కారము లేదుగదా! ఆనాటి యాదవసంతతి ఈనాటికీ ఆ యమునానదీ ప్రాంతంలో ఉన్నట్లు చెప్పినారుగాని – యాదవుల విషయ మలావుంచి – పూజారుల సంతతి ప్రబలంగా ఉన్నట్లు తోచింది. ఒక చిన్న తమాషా – మేము కాళింగమర్దనం జరిగిన ప్రదేశానికి

పోతున్నాం, మమ్మల్ని చూచి అచ్చటి ఒకపూజారి తలుపుల ప్రక్కనవున్న ఒక పెద్దబండ మోసుకవచ్చి - ఒక తిప్పమీద పెట్టి-" ఇదే గోవర్ధనగిరి- కానుకలు వెయ్యండి" అన్నాడు. ఏంజేస్తాం! వెయ్యక తప్పలేదుగూడా.

మథురలో ద్వారకాధీశ్, విజయగోవింద్, రాధాకృష్ణ అనే ప్రసిద్ధ ఆలయాలున్నాయి. బృందావనంలో - రాంజీ, బంకీబిహారీ, బిహారీషా, గోవిందదేవ, మాన్‌సింగ్ - మొదలగు మహాపురుషులు నిర్మించిన దేవాలయాలున్నాయి. 1018 లో మహమ్మద్ ఘజనీ మథురపై దాడిచేసి దేవాలయాలను కొల్లగొట్టాడు. ఈ ఆలయాలలోని ఒక్కొక్కటి 5 గజాలు ఎత్తుగల 5 బంగారు విగ్రహాలను దోచుకొన్నాడు. ఆ విగ్రహాల నేత్రాలు అమూల్యమైన వైఢూర్యాలతో చేయబడినవి.

మథురలోని పురావస్తుప్రదర్శనశాల ఇండియాలోని అగ్రగణ్యమైన చిత్రవస్తుప్రదర్శనశాలలలో ఒకటిగా పేర్కొనదగినది. ఈ పురావస్తుప్రదర్శనశాల 1874 లో స్థాపించబడింది. శిలావిగ్రహాలు, పూజలు, చెక్కడాలు, జేగురు మట్టిపాత్రలు, కాంస్య వస్తువులు, ఇత్యాది అసంఖ్యాకమైన పురాకళాఖండ సముదాయం ప్రేక్షకులకు నయనపర్వంగా యిక్కడ ప్రదర్శించబడి ఉంది. క్రీస్తుకు పూర్వం 400-వ సంవత్సరం, క్రీస్తుశకం 1200-వ సంవత్సరం మధ్యకాలంలో రూపొందించబడిన ఈ వివిధ కళాఖండాలు వాటి వాటి నిర్మాణ కాలాన్నిబట్టి కొన్ని వరుసలలో అమర్చబడి ఉన్నాయి. ఏవో కొన్ని వస్తువులు తప్పితే

ఈ చిత్రవస్తు ప్రదర్శనాలయంలోని కళాఖండాలు యించుమించు అన్నీ మథురజిల్లాలలో నిర్మించబడినవే. వీటిలో అనేకం మథురజిల్లా చుట్టుపట్ల ఉన్న దిబ్బలనుండి త్రవ్వి తీయబడినవి. పూర్వకాలంలో ఈ నగర పరిసరాలలో బౌద్ధ జైన స్థూపాలు, విహారాలు, హిందూ దేవాలయాలు అసంఖ్యాకంగా నిర్మించబడ్డాయి. కాలక్రమేణ అవి కూలిపోయి దిబ్బలుగా ఏర్పడ్డాయి. ఇండియా సాంస్కృతిక చరిత్రలో మథురకు విశేషమైన ప్రాముఖ్య మున్నదనడానికి సారస్వత రీత్యా, పురావస్తుశాస్త్రరీత్యా ఎన్నో ఆధారాలు ఉన్నాయి. ఒకప్పుడు మథుర "సూరసేన" అనే రాజ్యానికి రాజధానిగా ఉండేది. దేశానికి ఉత్తర సరిహద్దున కురురాజ్యం, తూర్పు సరిహద్దున పాంచాల, పశ్చిమ సరిహద్దున మత్స్య రాజ్యం ఉండేవి. ఈ నాలుగురాజ్యాలకూడలియే "బ్రహ్మర్షి దేశం" గా ప్రణుతి కెక్కింది. బ్రహ్మర్షి దేశం సంస్కృతి - ప్రజల ఉదారస్వభావానికి ఎంతో ప్రసిద్ధి చెందింది. మహాభారత యుద్ధానంతరం సూరసేనరాజ్యం ఉత్తర భారత దేశంలోని ప్రముఖ రాజ్యాలలో ఒకటిగా గణుతి కెక్కింది. గౌతమ బుద్ధునికి పూర్వకాలంలో భారతావనిలో ఉన్న 16 మహాజన పథాలలో సూరసేన రాజ్యం చేరివుంది. బుద్ధుని కాలంలో అవంతీపుత్రుడు మథురకు అధినేత అయ్యాడు.

క్రీస్తుకు పూర్వము 400 వ సంవత్సరం నుండి మథుర మగధసామ్రాజ్యంలో అంతర్భాగమైంది. నంద, మౌర్య, శుంగ, శక, కుశాన వంశీయులు ఈ రాజ్యాన్ని ఒకరి తర్వాత ఒకరు పరిపాలించారు. మౌర్య, శుంగ వంశీయుల

హాయాముల్లో బ్రహ్మాండమైన అనేక యక్ష విగ్రహాలు, పూజలు చెక్కిన స్థంభాలు, ద్వారబంధాలు వెలిశాయి. ఈ కాలంలో జేగురుమట్టితో తయారుచేసిన వస్తువులు తత్కాల కళారీతులకే కాక పూర్వకళా వైభవానికికూడా చిహ్నాలు. ఆనాటి జానపద సంస్కృతికి ఇవి సాక్ష్యాలు.

శక, కుశాన యుగంలో అనగా క్రీ. పూ. 100 – క్రీ. శ. 200 మధ్యకాలంలో మథురానగరం భారతదేశ మంతటా ప్రముఖమైన కళాసంస్కృతీ క్షేత్రంగా వాసి కెక్కింది. జైన, బౌద్ధ, వైదిక మతాలకు సంబంధించిన వేలాది విగ్రహాలు శిల్పసౌందర్యం ఉట్టిపడే చిరస్థాయి గల భవంతులు, కట్టడాలు అవతరించాయి.

భారతదేశంలోని తక్షకశిల్ప చరిత్రలో – మథురలోని పురాతన స్థంభాలకు ఎంతో ప్రాముఖ్యత ఉంది. ఈ స్థంభాలు మథురానగరం పరిసరాలలో అసంఖ్యాకంగా దొరికాయి. ఈ స్తంభాలపై స్త్రీ–పురుషుల ఆనందమయ లైంగిక జీవితాన్ని చిత్రించే చెక్కడాలే కాక కుశానశకంనాటి సాంఘిక మత వాతావరణాన్ని ద్యోతకంచేసే చిత్తరువులుకూడా ఉన్నాయి. నృత్యం, సంగీతం, ప్రసాదన, జలక్రీడ, పుష్పావచయం, కందుకక్రీడ, మొదలైన కార్యకలాపాలలో నిమగ్నులై ఉన్న స్త్రీ విగ్రహాలను మథుర కళాకారులు అతిలోక రమణీయంగా చిత్రించారు.

క్రీ. శ. 3 వ శతాబ్ది ప్రారంభంలో, కుశానుల అనంతరం నాగమనీయులు అధికారంలోకి వచ్చారు. క్రీ. శ. 350 వ సంవత్సరంనుండి మథురను గుప్తరాజులు పరిపాలించడం

ప్రారంభించారు. ప్రసిద్ధ గుప్తచక్రవర్తి అయిన చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలంలో, శ్రీకృష్ణ భగవానుని జన్మ స్థానంలో ఒక బ్రహ్మాండమైన దేవాలయం నిర్మించబడింది.

చైనా యాత్రీకులు ఫాహియాన్, హుయాన్ త్సాంగ్ ల కథనాన్ని బట్టి, 4 వ శతాబ్దిలోను, 7 వ శతాబ్దిలోను భారతదేశాన్ని వారు సందర్శించిన కాలంలో మధుర ఒక గొప్ప మతక్షేత్రంగా కూడా విరాజిల్లుతూ ఉండేదని వ్యక్త మౌతున్నది.

బౌద్ధ, జైన, హిందూమత పీఠాలు ఒక దాని సరసన ఒకటి ప్రతిష్ఠింపబడి ఉండేవి. గుప్తయుగంలో స్థానిక కళా కారులు సాధించిన విజయాలకు ఆనాటి చెక్కడాలు, జేగురు మట్టిపాత్రలు, ముఖ్యంగా మధురలో దొరికిన బుద్ధ విగ్రహాలు మనోజ్ఞమైన నిదర్శనాలు.

క్రీ. శ. 6 వ శతాబ్ది అనంతరం మధుర రాజ్యం కనౌజ్ సామ్రాట్టుల అధీనంలోకి వచ్చింది. మధురానగర కళాకారుల కళావ్యాసంగం మధ్యయుగాలలో కూడా అవ్యాహతంగా సాగిపోయింది. హర్షవర్ధనుని అనంతరం ఘూర్జర, ప్రతీహార రాజులు మధుర పై ఏలుబడి సాగించారు. వారి తర్వాత గహర్వాల రాజులు పరిపాలించారు. క్రీ. శ. 1017 లో ఘజ్నీ మహమ్మద్ మధురను కొల్లగొట్టి కృష్ణ భగవానుని జన్మస్థానంలో నిర్మించిన కేశవ దేవాలయాన్ని, నగరంలోని ఇతర పెద్ద ఆలయాలనూ ధ్వంసం చేశాడు. ఈ దాడి జరిగిన తర్వాతనుంచి మధురలో కళాసంపద క్షీణ దశ పట్టింది.

ప్రాచీన కళాఖండాలకు కాణాచి అయిన ఈ ప్రదర్శ నాలయం 16 శతాబ్దాల కళోపాసనకు సముజ్జ్వల చిహ్నం.

కృష్ణపరమాత్ముని బాల్యక్రీడలను తలచుకొంటూ ఆ రాత్రికి మథురానగరాన్ని వీడి ఢిల్లీ వైపు ప్రయాణం సాగించాము. (ఈ వ్యాసంలోని కొన్ని వాంశాలు సమాచారశాఖ సౌజన్యంతో —)

# ఢిల్లీ

"ఢిల్లీపట్నం చూడర బాబూ - గంగా యమునలు చూడర బాబూ" అని మనం రోజూ వింటూన్న పదాలు. ఆ యమునానది ఒడ్డున నిలిచియున్న యుగాలనాటి పురాతన నగరం - ఎందరో రాజులకు, ఎన్నో సామ్రాజ్యాలకు ప్రధాన నగరంగా విలసిల్లిన ఢిల్లీ పట్టణం - ఈ నాటి సర్వసత్తాక - ప్రజాతంత్ర భారత రిపబ్లిక్ రాజధానీ నగరం చేరుకుంటున్నామనగానే మా రైతులు పులకితులయ్యారు. ఢిల్లీ కీర్తి ప్రతిష్ఠలు, ఢిల్లీ శోభ, ఢిల్లీ అధికారం, ఢిల్లీ దర్పం, ఢిల్లీ గాంభీర్యం, ఏనాడూ ఏ యుగంలోనూ, ఏ తరంలోనూ మొక్కవోలేదు. చెక్కు చెదరలేదు. ఆ నాటికీ - ఈ నాటికీ దాని ప్రతిభ దేదీప్యమానంగా ప్రకాశిస్తూనే ఉంది.

ఢిల్లీ చరిత్ర ఈనాటిదికాదు. ద్వాపరయుగంలో - మహాభారత చరిత్రలో - "హస్తినాపురి"గా ప్రసిద్ధికెక్కి పాండవుల రాజధానిగా విలసిల్లింది. అది పురాణగాథ. ఆ తర్వాత "అనంగపాలుని రాజధానిగా ప్రణుతికెక్కింది. ఈ నగరం పృథ్వీరాజు రాజధానిగా విస్తృతం చేయబడింది.

తర్వాత మహమ్మదీయ-మొగల్ పాదుషాలు కుతుబుద్దీన్, అల్లావుద్దీన్, తుగ్లక్ చక్రవర్తులు, షెర్షా, షాజహాన్ మొదలైనవారంతా ఈ నగరాన్ని రాజధానిగా జేసికొని భారతసామ్రాజ్యాన్ని పరిపాలించారు. ఒక్కొక్క చక్రవర్తి ఒక్కొక్క విధంగా ఈ నగరాన్ని విస్తృతమొనర్చారు. ఒక్కొక్క సామ్రాట్టు ఎన్నెన్నో ప్రఖ్యాతిగాంచిన, శాశ్వతమైన, అభేద్యమైన, కళావిలసితమైన, అద్వితీయమైన కట్టడాలను, స్మృతి చిహ్నాలను, విజయస్థూపాలను నిర్మించారు. ఒక్కొక్క తరంలో ఒక్కొక్క విధంగా అభివృద్ధి చెందిన ఢిల్లీ ఈనాటికి వివిధకళా సంస్కృతులను సమన్వయించుకొని భిన్నత్వంలో గూడిన ఏకత్వంతో మేనెల 27-వ తేదీ తెల్లవారుఝామున మా రైతులముందు సాక్షాత్కరించింది.

తరతరాలుగా ఢిల్లీ యమునానది ఒడ్డున సగర్వంగా నిలబడి ఉంది. పవిత్ర యమున మమ్మల్ని దారిపొడుగునా వెన్నాడుతూనే వస్తున్నది. ఆగ్రాలో 'తాజ్' చలవరాతి గోడలను ప్రక్షాళనం జేస్తూ ప్రవహించింది. మధురలో తిరిగి మమ్మల్ని కలుసుకొన్నది. విశ్రామ్‌ఘాట్‌లో యమునతో మేము హెచ్చుగా పరిచయం చేసుకొన్నాం. తిరిగి ఢిల్లీలో లాల్ ఖిల్లాను ఆనుకొని పయనిస్తూ, ఖిల్లాలోని మమ్మల్ని చూచి మందహాసం చేసింది. అంతటితో ఆగలేదు. 'త్రివేణి' లో తిరిగి ఆఖరి ఆలింగనం చేసికొన్నాము. అంతటితో ఆ పవిత్ర నదీజలాలు మా నుండి ఈ విశాల ప్రకృతినుండి శెలవు తీసుకొని ఐచ్ఛికంగా గంగామతల్లి వడిలో అంతర్ధానమయ్యాయి.

అట్టి యమునాతీరాన ఎన్నెన్నో నగరాలు విలసిల్లాయి. ఎన్నో నాగరికతలు ప్రస్తుతి కెక్కాయి. ఎన్నో సామ్రాజ్యాలు అంతరించాయి. ఎన్నో యుద్ధాలు జరిగాయి. ఎందరో సామ్రాట్టులు కన్నుమూశారు. అయితే వాటి చిహ్నాలు ఈనాటికీ యమున ఒడ్డున గంభీరంగా నిలబడి ఉన్నాయి. గంగా, యమునా నదుల నాగరికత ఈ దేశంలో ఈనాటికీ, ఏనాటికైనా చిర స్థాయిగా వెలుగొందుతుంది. ఈ నాగరికతకు కేంద్రమే ఢిల్లీ.



ఎర్రకోట

ఆ స్థలంలో ఎందరెందరి రాజధానులు ప్రవర్థమానమయ్యాయో - పతనమయ్యాయో గాని-ఢిల్లీ పరిసర ప్రాంతమంతా పాడుపడిన సమాధులతో - భవనాలతో - శిథిలమైన కోటలతో - ఎన్నెన్ని కథలనో - ఎంతెంత చరిత్రనో జ్ఞాపకం చేస్తూంది. 10వ శతాబ్దానికి పూర్వం పరిహారులు పరిపాలించారు. 993-వ సంవత్సరంలో తోమరులు పరిహారులను పదభ్రష్టులను గావించి ఇప్పుడు "కుతుబ్ మినార్" ఉన్న చోట విశాలమైన రాజధానిని నిర్మించుకున్నారు. అచ్చటనే మనకు రాజపుత్రరాజు - అద్వితీయ బలసంపన్నుడు - అఖండ జాతీయవాది పృథ్వీరాజు రాజ్యమేలినాడు. ఆ మహావీరుని గురించి మన మెన్నో కథలు విన్నాం. జయచంద్రుని కుమార్తె రాణీ సంయుక్తను రాక్షసవివాహం చేసికొన్నది ఈ వీరుడే. జయచంద్రుడు మాతృద్రోహానికి వడిగట్టి

మహమ్మద్ ఘోరీతో కుమ్మక్కై పృథ్వీరాజును ఓడించాడు. ఘోరీ సైనికులచే పృథ్వీరాజు దారుణంగా చిత్రవధ గావించబడినాడు. ఆ తర్వాత దేశద్రోహి జయచంద్రునకు గూడా అదే శాస్తి జరిగింది. ఘోరీ సైనికులు 1191 లో పృథ్వీరాజును వధించిన తర్వాత మహమ్మద్ ఘోరీ ఢిల్లీ, బెనారస్, గ్వాలియర్ కోటలను ఆక్రమించుకున్నాడు. ఆనాటినుండే ఢిల్లీపై మహమ్మదీయుల పెత్తనం ఎన్నో శతాబ్దాలపాటు తిరుగులేకుండా సాగింది.

పిచ్చితుగ్లక్ తర్వాత సింహాసనానికి వచ్చిన ఫిరోజ్ షా తుగ్లక్ ఇంద్రప్రస్థపుర ప్రాంతంలో "ఫిరోజాబాద్" అనే నూతన నగరాన్ని నిర్మించాడు. ఫిరోజ్ షా తన బానిసల్ని భవన నిర్మాణాలకు కూలీలుగా నియోగించాడు. హిందూ ఆలయాలను పడగొట్టించి - వాటి సామానులతో మసీదులు నిర్మింపజేశాడు.

ఫిరోజ్ షా మరణానంతరం "తైమూర్" అనే 'తుర్కీయుడు' మధ్య ఆసియామీదుగా వచ్చి భారతదేశంపై దండెత్తి - ఢిల్లీపై విరుచుకుపడ్డాడు. ఐదురోజుల పర్యంతం ఢిల్లీని లూటీచేశాడు. 50 వేలమంది ప్రజల్ని చంపాడు. లక్షమందిని బానిసలుగా చేసికొన్నాడు. ఢిల్లీ సర్వనాశనమైంది. కరువురక్కసి విజృంభించింది. ఢిల్లీ స్మశానవాటిక అయింది. రెండు నెలలపాటు ఆ స్థలంలో పిట్టగూడా కనుపించలేదు. ఇంతటి ఘోరకలి కల్పించి ఆ స్మశాన భూమిని "ఖిజీర్ ఖాన్" అనే ఒక సైన్యాధిపతికి వొప్పగించి 'కుంటి తైమూరు' "సమర్ ఖండ్ కు" తిరిగి వెళ్ళాడు.

తర్వాత కొంతకాలం ''లోడీవంశం'' ఢిల్లీసుల్తనత్‌కు అధిపతు లయ్యారు. వీరిలో వీరికే అధికారకాంక్ష పెరిగి పోయింది. బాబర్ లోడీవంశాన్ని తుదముట్టించాడు. ఇండియాలో మొగల్ సామ్రాజ్యానికి పునాదులు వేశాడు. పరాయిదేశపు దండయాత్రలకు ముఖద్వారమైన పానిపట్టు యుద్ధంలో బాబర్ 1526 ఏప్రిల్ 27-న ఢిల్లీని ఆక్రమించుకున్నాడు. మొగలాయి పాదుషాల కాలంలో ఢిల్లీ అంతు లేకుండా అభివృద్ధి జెందింది. విలువైన మసీదులు-సమాధులతో ఆ స్థలమంతా నిండిపోయింది. బాబర్ పాదుషానుండి అభివృద్ధి జెందుతూవచ్చిన మొగల్ సామ్రాజ్యం ఔరంగజేబుతో అంతరించింది. నాదిర్ షా దండయాత్రలో మొగల్ రాజ్యం పూర్తిగా పతనమైంది. నాదిర్ షా మరొకపర్యాయం ఢిల్లీని స్మశానవాటిక జేశాడు. తొమ్మిదిగంటల మారణహోమంలో ఢిల్లీ భీభత్సమై పోయింది. ఆ తర్వాత కొన్నాళ్ళకు స్వరాజ్య యుద్ధమనే పేరుతో మహారాష్ట్ర పీష్వాలు ఢిల్లీని ఆక్రమించుకున్నారు. కాని కొన్నిరోజులు మాత్రమే నిలుపుకోగలిగారు.

ఇన్ని ఒడుదుడుకుల మధ్య ఢిల్లీ — చరిత్రలో మకుటాయమానమైవ స్థానాన్ని గడించుకున్నది.

బ్రిటిషువారి హయాంలో ఢిల్లీ ప్రపంచంలోని ప్రసిద్ధ నగరాల కోవకు రాగలిగింది. ఇప్పుడు స్వరాజ్యానంతరం అంతర్జాతీయ కీర్తిని గడించుకుంటున్నది. ఈ నాటి ప్రతిష్టకు కేంద్రము క్రొత్తఢిల్లీ.

క్రొత్తఢిల్లీ ఒక సుందరనగరం. ఈ నూతన నగర నిర్మాణం 1931 లో జరిగింది. ఆదిలో భారత దేశంలో బ్రిటిషు సామ్రాజ్య రాజధానీనగరం కలకత్తా. 1911 లో పంచమజార్జి చక్రవర్తి భారత దేశ యాత్ర జేసే సందర్భంలో రాజధానిని కలకత్తానుండి-పురాతన నగరం ఢిల్లీకి మార్చ బడింది. ఆనాటినుండీ ఇది నవీన పద్ధతుల్లో అభివృద్ధి జెందుతూ వచ్చింది. క్రొత్త ఢిల్లీ నిర్మాణకర్తలు - సర్ ఎడ్వర్డు లుటెన్స్, సర్ హెర్బర్ట్ బేకర్.

ప్రశాంతమయ వాతావరణం, విశాలమైన రాస్తాలు-రాస్తాల కూడలిలో వలయాగారపు ఉద్యానవనాలు, విశాలమైన భవంతులు - భవనాలచుట్టూ సుందరమైన పార్కులు-నిజంగా క్రొత్తఢిల్లీ పాశ్చాత్య నగరంలా కనుపిస్తుంది. ఒక వైపు పురాతన, చారిత్రక కట్టడాలు, మరోవైపున నవీన భవనాలు - ఢిల్లీ పాత-క్రొత్తల సమ్మేళనం. హిందువులు, ముస్లింలు, సిక్కులు, యూరోపియనులు, పారశీకులకు ఆలవాలమైన ఢిల్లీ విభిన్న నాగరికతల, వివిధజాతుల, వేరువేరు సంస్కృతుల, భిన్న ధృక్పథాల సమ్మేళనం.

## శ్రీ నెహ్రూతో గోష్ఠి

ఢిల్లీలో మా కార్యక్రమం రెండు రోజులు - ఊపిరాడని కార్యక్రమం. మన జాతీయ నాయకులు, నవభారత నిర్మాతలు, ప్రభుత్వాధినేతల నివాసం ఢిల్లీలోనే. మన పూర్వీకుల పరిపాలనా చిహ్నాలు - కుతుబ్ మినార్,

ఎర్రకోట, జుమ్మామసీదు, మొగల్ పాదుషాల సమాధులు, పూజ్య పిత బాపూజీ సమాధీ స్థానం ఢిల్లీయే. మా రైతాంగానికి అత్యవసరమైన "పూసా వ్యవసాయ పరిశోధనాలయం" సందర్శించాలి. మన దేశ పరిపాలనా విధానాన్ని రూపొందించే పార్లమెంటును సందర్శించాలి. ఇవన్నీ రెండు రోజుల్లోనే. వడివడిగా కార్యక్రమాని కుపక్రమించాము. ఉదయమే మా రైతులకు భారత భాగ్యవిధాత శ్రీ జవహర్‌లాల్ నెహ్రూతో - రిపబ్లిక్ ఉపాధ్యక్షులు శ్రీ రాధాకృష్ణన్‌తో గోష్టి ఏర్పాటు చేయబడింది.

మా రైతులు నెహ్రూను కలిసికొన్నారు. నెహ్రూ రైతుల్ని సాదరపూర్వకంగా ఆహ్వానించారు - ఆదరించారు - సత్కరించారు - పలకరించారు - ప్రశ్నలువేశారు - నవ్వారు - నవ్వించారు - "మీరంతా ఆంధ్రరైతులా? - రంగాగారి రైతులా?" అని నిండు హృదయంతో తమ సంతృప్తిని వెల్లడించారు. "మీ దేశాన్ని మీరు చూడ్డానికి వచ్చారా? మీ దేశాన్ని మీరు తెలిసికొంటున్నారు. మిమ్మల్ని మీరు అర్థం జేసికుంటున్నారు. ఈ దేశమంతా ఒకటే - ఇందులో విభిన్న ప్రవృత్తులు లేవు - విభిన్న దృక్పథాలు లేవు - మనమంతా ఒకటి - ఎక్కడున్నా - ఏంజేస్తున్నా - ఏ భాష మాట్లాడుతున్నా - అని మీరు దేశ పర్యటనద్వారా రుజువుచేస్తున్నారు" అంటూ మా రైతుల్ని ప్రస్తుతించారు.

"దేశాభివృద్ధి కార్యక్రమాలలో ఈ పర్యటన ఒక భాగమే" నన్నాము. "ఔను" అని మందహాసం చేశారు.

అభివృద్ధి కార్యక్రమాలకు మా రైతుల తరఫున రు. 116 లు కానుక సమర్పించాము. అంతేకాదు. మా రైతులే స్వయంగా-వ్యక్తిగతంగా కూడా కానుక లర్పించారు.

మా రైతుల్ని నెహ్రూ అభినందించారు. రైతుల ముఖాలు వికసించాయి. నిండు హృదయాలతో - పట్టరాని ఆనందంతో రైతులు ఆ మహానాయకునివద్ద సెలవు తీసుకొన్నారు.

ఆ తర్వాత రిపబ్లిక్ ఉపాధ్యక్షులు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణతో మా రైతులు దాదాపు గంటసేపు కాలక్షేపం చేశారు. రాధాకృష్ణ బౌద్ధ-వైదిక ధర్మాల సమన్వయాన్ని గురించి ప్రబోధించారు. ఆ తర్వాత నగరంలో పర్యటన ప్రారంభించాం.

# నగర సందర్శనం

ఆల్టమష్ నిర్మించిన కుత్‌బ్ మీనార్ ఢిల్లీకి శాశ్వత ఘనతను చేకూర్చింది. ఢిల్లీసుల్తాన్ కుతుబుద్దీన్ 1211 లో గుర్రంమీదనుండి పడి చనిపోయిన తర్వాత ఒక తుర్కీ సైన్యాధిపతి సుల్తానుగా ఎన్నుకోబడినాడు. కుతుబుద్దీన్ వలెనే ఇతడుకూడా బానిసజీవితాన్ని ప్రారంభించాడు. స్వశక్తిపై బీహారు గవర్నరయ్యాడు. అతడే ఆల్టమష్. ఈ సుల్తాను కట్టించిన విజయస్థంభమే కుతుబ్ మీనార్. దీని ఎత్తు 238 అడుగులు. క్రిందిభాగం వెడల్పుగానూ తెల్ల సున్నం రాతితో నిర్మించబడింది. పైకి పోనుపోను సన్ననై

తెల్ల చలవరాతితో నిర్మించబడింది. ఈ స్థంభం చివరిదాకా మాతో పాటు ఒక తొంభై సంవత్సరాల ప్రాయంగల నడుములు వంగిపోయిన మూడుకాళ్ళ ముసలమ్మ గూడా ఎక్కగలగడం విశేషం.

అవి ఫిరోషా తుగ్లక్ నిర్మించిన రాజధానీనగర శిధిలాలు. అక్కడే చంద్రగుప్తుని నాటి (క్రీ. శ. 413) ఎత్తైన ఇనుపస్థంభ మొకటి ప్రతిష్ఠింపబడి ఉన్నది.

ప్రాక్ దేశాలలో కల్లా పెద్దదైన, అద్భుతమైన, కళావిలసితమైన నిర్మాణం లాల్ ఖిల్లా. దీనిని 1639-1648 సంవత్సరాలలో షాజహాన్ చక్రవర్తి నిర్మించాడు. షాజహాన్ నిర్మించిన తాజ్ మహాల్ ప్రపంచ చిత్రాల్లో ఒకటని ప్రసిద్ధి గాంచింది. ఆ చక్రవర్తిచే నిర్మించబడిన ఢిల్లీలోని ఎర్రకోట ఆసియాలో కల్లా అద్భుతమైనదని ప్రశస్తి కెక్కినది. ఈ రెండు నిర్మాణాలు షాజహాన్ కీర్తిని దశదిశలు విస్తరింప జేశాయి. ఆ పాదుషా ప్రపంచ చరిత్రలో ఒక ధృవతారగా నిలచి పోయాడు. ఆతడి కీర్తి అమరమైంది. అద్వితీయమైంది. అతిథి సత్కారగృహం ఆ కోటకు మకుటం. అందులోనే సుమారు 16 కోట్ల రూపాయిలు విలువజేసే మయూరసింహాసన ముండేది. మొగల్ సామ్రాజ్యం పతనమయ్యే సమయంలో ఢిల్లీపై దాడిచేసి - ఢిల్లీని లూటీచేసిన 'నాదిర్షా' ఆ యద్భుత సింహాసనాన్ని దోచుకొని కాబూల్ తీసుక వెళ్ళాడు. ప్రస్తుతం ఆ సింహాసనం లండన్ లో ఉన్నది. చల్లని, ప్రశాంతమైన, అతిసుందరమైన, వజ్రాలు పొదిగిన ఆర్చీలు గల

హాలులో దాని అతిలోక వైభవాన్ని ప్రస్తుతించే చరణం ఒకటి పర్షియాభాషలో చెక్కబడి ఉన్నది.

" ఈ భువనలోకంలో స్వర్గమనేదే ఉంటే –

ఆ స్వర్గం – ఇదే ఇదే – ఇంతకంటె మరో స్వర్గం లేదు."

ఔను మరి! అది నిజంగా స్వర్గమే. దేవేంద్రలోకాన్ని మనం చూడలేదుగాని, ఒకవేళ చూడడమే సంభవిస్తే ఇంతకంటే వైభవంగా, మనోహరంగా కనులపండువుగా ఉంటుందా! అయితే ఒకటే బాధ. ఇది ప్రజల సౌఖ్యాన్ని కొల్లగొట్టి, సామాన్యప్రజల సమాధులపై నిర్మించిన అతిలోక రాజప్రాసాదాలు గదా యని! ఆ హర్మ్యాలకు యిటుకలు ప్రజల ఎముకలు, అడుసు మానవులరక్తం! ప్రజల సుఖ సౌఖ్యాలను పిండితే వచ్చే రసం చక్రవర్తులకు లభించింది! మిగిలిన పిప్పి ప్రజలకు దొరికింది!

లాల్ ఖిల్లాలోని మోతీ మసీదు, లాల్ ఖిల్లా దాపులోని జుమ్మామసీదు ఈనాటికీ మహమ్మద్ ప్రవక్త సందేశాన్ని ఆ నిశ్చలమైన వాతావరణంలో ప్రతిధ్వనింప జేస్తున్నాయి. ఔరంగజేబు తర్వాత మొగల్ సామ్రాజ్యాధినేత 'బహదర్షా' – ఆయన, బేగం, రాజదుస్తులు కోటలో భద్రపరచబడినాయి. ఆ దుస్తులకే ముత్యాలు – వజ్రవైఢూర్యాలు పొదగబడి ఉన్నాయి. కోటలోపల రాజప్రాసాదాల గోడలకుగూడా విలువైన రాళ్ళు పొదగబడిన చిహ్నాలు కనబడుతున్నాయి. ఔను మరి ఈ రాళ్ళకేగదా – ఖజానాలోని సొమ్మంతా ఖాళీ అయింది!

మొగల్ పాదుషాలలో బాబర్ తర్వాత రెండవవాడు హుమాయూన్. హుమాయూన్ తీవ్రమైన వ్యాధిగ్రస్తుడు కాగా - బాబర్ తన ప్రాణాన్ని పణంగావొడ్డి తనకుతానే మృత్యువును ఆహ్వానించుకొని - కొడుకును కాపాడుకున్నట్లు ఒక విచిత్రగాధ వున్నది. హుమాయూన్ చక్రవర్తి సమాధి మొగల్ భవన నైపుణ్యానికి ఒక గీటురాయి.

ఎర్రసున్నం - రాతితో నిర్మించిన ఈ బ్రహ్మాండమైన కట్టడానికి చుట్టూ 125 అడుగుల పొడవుగల పెద్ద ప్లాట్ ఫారం ఉన్నది. దీని శిఖరం చలవరాతి నిర్మాణం. ఇది ఒక్క హుమాయూన్‌కు మాత్రమే కాదు, అనేకమంది మొగల్ ప్రముఖులకు సమాధి. ఇందులో ఒకవైపు దారాషికో సమాధి ఉన్నది. ఈతడు షాజహాన్ చక్రవర్తి జ్యేష్ఠ పుత్రుడు. మొగల్ సింహాసనాధిపతి. ఈతడి తమ్ముడు ఔరంగజేబు అధికార కాంక్షతో సోదరుల సందర్నీ ఖూనీ చేయించాడు. తల్లిదండ్రులను బంధించాడు. మొగల్ అధినేతగా ప్రకటించుకొని - మొగల్ సామ్రాజ్య పతనానికి కారకుడయ్యాడు. ఔరంగజేబు తర్వాత మొగల్ సింహాసనాన్ని అధిష్ఠించిన మరియిద్దరు బలహీనులైన పాదుషాలు ఫరూఖ్ష్యార్, ఆలంజీరీ గోరీలు కూడా ఇందులోనే ఉన్నాయి. ఈ పాదుషా లిద్దరూ జ్ఞాతులచేత ఖూనీచేయబడి నారు. ఔరంగజేబు కుమారుడు బహదూర్షాకూడా ఇందులోనే సమాధి చేయబడినాడు. ఈతడు 1857 సిపాయి కలహంలో పారిపోయి బ్రిటిషువాళ్ళకు పట్టుపడ్డారు. హుమాయూన్ టూంబ్ మొగలాయి సామ్రాజ్య శాశ్వత

సమాధి. హుమాయూన్ గోరీలోనే మొగలాయి సామ్రాజ్యానికి – మొగలాయి పాదుషాలకు కూడా సమాధి చేయబడింది. అది గంభీరమైన కట్టడం – పాదుషాల దర్జా, దర్పం అందులో ఉట్టిపడుతున్నాయి. మొగల్ సల్తనత్ ఆఖరి గీతం – అందులో లీలగా ప్రతిధ్వనిస్తూనే ఉంది. "దాదాపు నాలుగు శతాబ్దాలపాటు మేము ఈ దేశానికి ఏకచ్ఛత్రాధిపతులం" అనే మూలుగు ఆ సమాధులనుండి వినిపిస్తూంది. ఆ మూలుగును శిఖరాలు ప్రతిధ్వనింప జేస్తున్నాయి.

ఆ మూలుగును, ఆ ప్రతిధ్వనిని వినేవాళ్లు మాలాంటి యాత్రికులే. నాశక్తికి ఎదురులేదని స్వైరవిహారం చేసిన మదాంధులకు అంతమున్నది. నాకత్తికి ఎదురులేదని నిరంకుశ పెత్తనం చెలాయించిన సామ్రాట్టులకు అంతమున్నది.. మతమౌఢ్యంతో పరమతస్థులను కొల్లగొట్టిన, పరధర్మాలను బుగ్గిపాలు జేసిన మతపిచ్చకు అంతమున్నది. స్వార్థంతో – ద్వేషంతో అధికార పిపాసతో దేశాలను కొల్లగొట్టి, రాజ్యాలను పాదాక్రాంతం జేసికొన్న గర్వాంధులకు, పదవీకాంక్షాపరులకు అంతమున్నది. కాని ఎల్లప్పుడూ కష్టించి సమాజాన్ని పోషించే శ్రమజీవులు అమరజీవులుగా అందరిచేత ఆరాధింపబడుతారు. వారి శక్తి అమరం, అఖండం, అనంతం. అదే సత్యం ఆ హుమాయూన్ సమాధిలో – ఆ ప్రజలను పీడించిన, పీనుగల సమాధిలో మాటమాటకు ప్రతిధ్వనిస్తూంది. నిరంకుశ పెత్తనానికి కట్టిన సమాధులను మా రైతులెంతో ఆశ్చర్యంతో సందర్శించారు.

పాతఢిల్లీలో "చాందినీచౌకు," క్రొత్తఢిల్లీలో "కన్నాట్ ప్లేస్" గొప్ప వ్యాపార స్థలాలు. చాందినీచౌక్‌కు చారిత్రక ప్రాధాన్యత ఉన్నది. ఎర్రకోటనుండి - ఫతేపురీ మశీదువరకూ ఈ బజారు మైలు పొడవున్నది. ఇదే మొగల్ పాదుషా షాజహాన్‌కు రాజమార్గం. అప్పట్లో యమునా నదినుండి ఒక కాల్వ బయలుదేరి చాందినీచౌక్ మధ్యగా ప్రవహిస్తూ వుండేది. 1910 లో అది పూడ్చివెయ్యబడింది.

ఔరంగజేబు - తండ్రి షాజహాన్‌ను ఖైదుచేసి, సింహాసనాధికారియైన సోదరుడు దారాశిఖోను ఓడించి, బంధించి సంకెళ్ళువేసి చాందినీచౌక్ గుండానే నడిపించి చిత్రవధ గావించాడు. మొగల్ సామ్రాజ్య పతనం ఆరంభమైన తర్వాత ఢిల్లీపై విరుచుకబడిన తురక సర్దార్ నాదిర్షా 9 గంటలపాటు మానవవధ జరిపి రక్తప్రవాహం చేసింది చాందినీ చౌక్‌లోనే. అహమ్మద్‌షా అబ్దాలీ, పీష్వా మాధవ రావ్, గులాం ఖాదిర్ ఢిల్లీపై తమ విజయాలను ప్రకటించు కొన్నదీ చాందినీచౌక్‌లోనే.

చాందినీచౌక్‌లో పూర్వం మణి మాణిక్యాలు, వజ్ర వైఢూర్యాలు రాసులుపోసి అమ్మేవారట. ఆనాటికీ ఈనాటికీ చాందినీచౌక్ ప్రతిభ మొక్కవోలేదు.

# క్రొత్తఢిల్లీ

న్యూఢిల్లీలో కెన్నాట్ ప్లేస్ వలయాకారంలో మూడు వరుసలుగా వుండే వర్తక, వాణిజ్య కేంద్రం. నవీన పద్ధతులతో నిర్మించిన ఈ బజారులవెంట పోతూంటే పద్మవ్యూహంలో పయనించినట్లే ఉంటుంది.

బిర్లామందిరం (లక్ష్మీనారాయణ ఆలయం) లో మాకు ప్రశాంతత చేకూరింది. రక్తపాతంతో గూడిన మొగలాయి పాదుషాల కథనాలు మా మనస్సులను కెలుకుతున్నాయి. ఆ భయంకర సన్నివేశాలకు కంపిస్తున్న మా హృదయాలు లక్ష్మీనారాయణ ఆలయములో ప్రక్షాళన మయ్యాయి. ఆ ప్రశాంత వాతావరణంలో ఆత్మకు శాంతి చేకూరింది. తెల్లని చలవరాతితో తయారుచేయబడిన ఆ సుందరమైన లక్ష్మీనారాయణ విగ్రహాలు ఎంత ప్రశాంతంగా ఉన్నాయి! అవి అహింసామూర్తులుగా మాయెదుట సాక్షాత్కరించాయి. అది కేవలం దేవాలయంమాత్రమే కాదు. పౌరుల విహారాలయం గూడా. ఉద్యానవనం, పెద్ద పెద్ద ఏనుగుల విగ్రహాలు, మనోహరమైన నీటి బుగ్గలు, జలకుండముల ప్రక్కన సజీవంగా ఉన్నవా అని భ్రమకొలిపే శిలతో చిత్రించబడిన మత్స్యములు, మండూకాలు, కూర్మాలు, సొగసైన కాలిబాటలు, బాటలకు మధ్యలో శిలానిర్మిత గుహాలు-ఇదంతా కృత్రిమమే అయినా సహజమైన ప్రకృతి సౌందర్యంతో పోటీచేస్తున్నట్లు ఉంది. కుడ్యాలపై మహానీయుల అమృతవాక్కులు, శిఖరాలపై సృజనాత్మక కళా,

సృష్టి - ఆ యద్భుత ఆలయానికి ప్రత్యేకత చేకూర్చాయి. ఢిల్లీలో బిర్లామందిరం నిక్కముగా ఒక ప్రత్యేక ఆకర్షణయే.



పార్లమెంటు భవనము

మొగలాయి పాదుషాల యుగం అంతరించింది. మరొక అడుగు ముందుకు వేద్దాం. బ్రిటిషుమహాయుగంలో ఆంగ్లేయులు నిర్మించిన అప్పటి వైస్రాయి భవనం - ఇప్పటి రాష్ట్రపతి భవనంలో మా రైతులు అడుగుపెట్టారు. ఆంగ్లేయులుగూడా భారతదేశంలో ప్రసిద్ధిజెందిన అనేక కట్టడాలను నిర్మించారు.

రాష్ట్రపతి భవనం - ఆ భవనంచుట్టూ వున్న ఉద్యాన వనం ప్రపంచంలోనే ఒక గొప్ప నిర్మాణమని చెప్పవలసి యుంటుంది. 1936 లో ఇండియా వైస్రాయి నివాసానికి

సర్ ఎడ్వర్డ్ ల్యుటియన్స్‌చే నిర్మించబడిన దీని వైశాల్యం 330 ఎకరాలు. ఈ భవనంయొక్క తోట మొగల్ నిర్మాణానికి సామీప్యంలో ఉన్నది. భవనంలో 340 గదులున్నాయి. భవనంయొక్క మొదటిభాగంలో జాతీయ కళాప్రదర్శన మున్నది. ఇందులో దేశంలోని వివిధ ప్రాంతపు కళాకారులు రాష్ట్రపతికి బహూకరించిన అత్యద్భుత కళాఖండాలు అమర్చబడి ఉన్నాయి. భవనంయొక్క శిఖరం అశోకుడు సాంచీలో నిర్మించిన బౌద్ధస్థూపాన్ని పోలి ఉన్నది. ఢిల్లీలో లాల్‌ఖిల్లా మొగలాయీ సామ్రాజ్య చిహ్నమైతే - ఇప్పటి రాష్ట్రపతి భవనం బ్రిటిషు సామ్రాజ్య చిహ్నం. తమ స్వంత వైభవాలకు మొగలాయిలు ఎంత ఖర్చుపెట్టారో - ఆంగ్లేయులు కూడా అంతకు తీసిపోలేదని ఈ భవనం రుజువుచేస్తున్నది. భారతదేశం సర్వస్వతంత్ర రిపబ్లిక్‌గా రూపొందినతర్వాత ఈ భవనం రాష్ట్రపతి భవనమైంది. ఇంత భవనంలోనూ మన రాష్ట్రపతి వినియోగించుకొనేది ఒక్క భాగం మాత్రమే. భవనంలోని హెచ్చు భాగం జాతీయ కళాప్రదర్శనంక్రిందనే ఉన్నది. ఒక భాగం విదేశీ రాయబారులను, అతిథులను ఆహ్వానించేందుకు కేటాయించబడి ఉంది.

రాష్ట్రపతి - సర్వసత్తాక సర్వస్వతంత్ర భారత రిపబ్లిక్ రాజ్యాంగ రక్షకుడు. పార్లమెంటులో-శాసనసభల్లో రూపొందించబడిన శాసనా లన్నీ రాష్ట్రపతి చేవ్రాలు పడనిదే, రాష్ట్రపతి అమోదముద్ర పడనిదే చట్టా లనిపించుకోవు. భారత ప్రధానమంత్రిని నియమించే అధికారం - పార్లమెం

టును సమావేశపరిచే అధికారం - పార్లమెంటును రద్దుచేసే అధికారం, రాష్ట్ర శాసనసభల్ని రద్దుపరచే అధికారం రాష్ట్రపతి చేతిలోనే వున్నది. అవసరమైతే రాజ్యాంగాన్ని రద్దుపరచి దేశంలోని శాసనాధికారాన్ని, పరిపాలనను తన చేతిలోనికే తీసుకోవచ్చు. దేశంలో అరాచకం బయలుదేరి నప్పుడు - యుద్ధాలు సంభవించినప్పుడు - రాజ్యాంగాన్ని అమలుజరపడం అసంభవమైనప్పుడు పై అధికారాలను రాష్ట్రపతి అమలుజరుపుతాడు. సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని కూడా రాష్ట్రపతియే నిర్ణయిస్తారు. కేంద్రమంత్రులనుగూడా ప్రధానమంత్రి శిఫార్సుపై రాష్ట్రపతియే నియమిస్తారు. రాష్ట్రాల గవర్నర్లను నియమించడం, తీసివేయడం రాష్ట్రపతి చేతిలోనిదే. ఇన్ని అధికారాలు చేతిలోపెట్టుకొని గూడా రాష్ట్రపతిని ఎన్నుకొనవలసింది పార్లమెంటు - రాష్ట్రాల శాసనసభలు. రాష్ట్రపతిని తొలగించే హక్కు గూడా (కట్టుదిట్టమైన నిబంధనలకు లోబడి) పార్లమెంటుకు ఉన్నది. ఇది ప్రజాసత్తాక రాజ్యాంగ విధానం కాబట్టి అటు రాష్ట్రపతిగానీ - యిటు మంత్రులు - గవర్నర్లుగానీ నిరంకుశంగా - స్వతంత్రంగా వ్యవహరించకుండా మన రాజ్యాంగంలో అనేకమైన కట్టుబాట్లు చేయబడి ఉన్నాయి. దీనిని బట్టి భారత రాజ్యాంగంలో రాష్ట్రాలుకానీ - కేంద్రంగానీ - కేంద్రమంత్రులు గానీ - రాష్ట్ర గవర్నర్లు గానీ - భారత ప్రధానమంత్రి గానీ - రిపబ్లిక్ అధ్యక్షులు గానీ - సర్వస్వతంత్రంగా వ్యవహరించేందుకు అధికారంగానీ, ఆస్కారం గానీ లేదు. మంత్రులు పార్లమెంటుకు సమష్టి బాధ్యులై

యుండాలి. పార్లమెంటు, మంత్రులు - ప్రజలకు బాధ్యులై యుండాలి. రాజ్యాంగ సూత్రాలను నిర్వచించేది-రాజ్యాంగ సూత్రాలకు ప్రతిఘాతం జరిగినప్పుడు రక్షించేది - ప్రధాన న్యాయస్థానాలు, సుప్రీంకోర్టు.

లోక్‌సభ, రాజ్యసభ, సుప్రీంకోర్టులకు స్థానమైన పార్లమెంటు భవనాన్ని గూడా మా రైతులు దర్శించారు. మంత్రివర్గ సమావేశాలు గూడా పార్లమెంటు భవనంలోని 'కాబినెట్ రూమ్'లో జరుగుతాయి. మంత్రివర్గం ముసాయిదా బిల్లును రూపొందించి పార్లమెంటు లోక్‌సభలో ప్రతిపా దిస్తుంది. ఈ బిల్లును పార్లమెంటు చర్చించి అవసరమైన సవరణలతో రాజ్యసభకు పంపిస్తుది. రాజ్యసభలో ఈ బిల్లు చర్చించబడి అవసరమైన సవరణలతో తిరిగి లోక్‌సభకు పంపిస్తుంది - లేదా సెలక్టు కమిటీకి పంపబడవచ్చు, సెలెక్టు కమిటీగూడా బిల్లులో అవసరమైన చేర్పులు, మార్పులు చేయవచ్చును. అనంతరం తిరిగి ఈ బిల్లు పార్లమెంటుకు పంపబడుతుంది. పార్లమెంటు దిగువసభ - ఎగువసభ చర్చించి - ఆమోదించినపిదప రాష్ట్రపతి ఆమోదానికి పంప బడుతుంది. రాష్ట్రపతి ఆమోదముద్ర పడిన తర్వాత బిల్లు శాసనమై అమలు జరుపబడుతుంది. ఒక్క ఆర్థిక సంబంధమైన బిల్లులను తప్ప - లోక్‌సభ ఆమోదించిన బిల్లులను రాజ్యసభ నిరాకరించవచ్చు.

లోక్‌సభ ప్రజలచేత ఎన్నుకొనబడిన పార్లమెంటు సభ్యులు, - రాజ్యసభ రాష్ట్రాలచేత ఎన్నుకోబడిన, రాష్ట్రపతిచే నామినేటు చేయబడిన పార్లమెంటు సభ్యులు. లోక్

సభ ఐదు సంవత్సరాల కొకతూరి రద్దవుతుంది. ఎన్నికలు జరుగుతాయి. రాజ్యసభ శాశ్వతంగా ఉంటుంది. సంవత్సరానికొక పర్యాయం రాజ్యసభలోని మూడింట ఒకవంతు సభ్యుల సభ్యత్వాలు రద్దవుతాయి. ఈ రద్దయిన ఖాళీలకు తిరిగి రాష్ట్రశాసనసభల ద్వారా క్రొత్త సభ్యులు ఎన్నుకోబడుతారు. పార్లమెంటులో లోక్ సభకు ఆ సభాసభ్యులచే ఐదు సంవత్సరాల కొక పర్యాయం ఎన్నుకోబడిన స్పీకరు అధ్యక్షత వహిస్తాడు. రాజ్యసభకు రిపబ్లిక్ ఉపాధ్యక్షుడు అధ్యక్షత వహించి కార్యక్రమాన్ని కొనసాగిస్తాడు. అధ్యక్ష, ఉపాధ్యక్షుల కాలపరిమితి ఐదు సంవత్సరాలు. రిపబ్లిక్ అధ్యక్షునకు వేతనం 44 వేల రూపాయలు. ఇంత పెద్ద వేతనంగల పదవి ప్రపంచంలో మరెక్కడా లేదు. మన రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ తన వేతనంలో కొంత భాగాన్ని ప్రజా సంక్షేమానికి వినియోగిస్తున్నారు.

రాష్ట్రపతి భవనం, పార్లమెంటు ఉభయసభలు - కాబినెట్ రూం - సుప్రీంకోర్టు చూచిన తర్వాత మా రైతులకు భారత రాజ్యాంగంలోని ప్రధానాంశాలు సుబోధకాలయ్యాయి. ఇప్పుడు మా రైతులు మూడు మాటల్లో భారత రాజ్యాంగాన్ని వల్లించగలరు.

వలయాకారంలో నున్న మన పార్లమెంటు భవనం ప్రపంచంలో అతి సుందరమైన నిర్మాణాలలో ఒకటి. ఈ భవనంలోనే మన ప్రజల జీవనానికి సంబంధించిన శాసనాలు రూపొందుతున్నాయి. అభివృద్ధికి సంబంధించిన కార్యక్రమాలు తయారౌతున్నాయి.

ఢిల్లీ శాంతికి నిలయం – శాంతి అహింసలను ప్రబోధించిన భారతజాతి పిత ఒక పాషండుని పిస్తోలుకు బలియై కన్నుమూసిన పవిత్రస్థలం ఢిల్లీలోనే. రాజ్ ఘాట్ లో ఆ శాంతిప్రియుడు – ఆ యహింసామూర్తి – ఆ దీన జన బాంధవుడు – ఆ దరిద్రనారాయణుడు – ఆ అవతారమూర్తి పవిత్ర సమాధిని దర్శించుకున్నాము. శ్రద్ధాంజలి ఘటించాము. కన్నీటి కానుకలు సమర్పించాము. బాపు హృదయం–బాపు అమృతవాక్కు – బాపు ముత్యాల చిరునవ్వు ఆ చలవరాతి సమాధిలో కనుపించాయి.

ఆ సమాధిని చూచిన తర్వాత మాలో ఒక బాధ జనించింది. మండుటెండలో బాపూ సమాధి మలమల మంటోంది. ఇంకా అక్కడ శాంతిప్రియులకు శిక్షణ శిబిరం నిర్మించబడలేదు. విశ్వశాంతి పథాన్ని చూపెట్టే – విశ్వ కళాపరిషత్తు వెల్వడలేదు. అమరావతి – నలంద – తక్షశిల లాంటి విశ్వవిద్యాలయానికి ఆ పవిత్రస్థలంలో ప్రారంభోత్సవం జరగలేదు. బుద్ధుని అనంతరం బౌద్ధ విశ్వవిద్యాలయాలు విచ్చలవిడిగా స్థాపించబడ్డాయి. ఆ విశ్వవిద్యాలయాలనుండి తథాగతుని అహింసావాణి – శాంతి సందేశం దేశదేశాలకు విస్తృతమైంది. బాపూజీ అనంతరం అలాంటి మహత్తర సంస్థ కనీసం రాజ్ ఘాట్ లో నయినా నిర్మాణం గాకపోవడం విచారకరం. అదే మాలో జనించిన బాధ.

ఢిల్లీలో మమ్మల్ని బాగా ఆకర్షించినది పూసా వ్యవసాయ పరిశోధనాలయం. అక్కడ యూనియన్ వ్యవసాయ మంత్రి శ్రీ పంజాబ్ రావ్ దేశ్ ముఖ్ మా రైతుల్ని కలిసి

కొని సాదరంగా గౌరవించారు. పూసా పరిశోధనాలయంలో జరుగుతున్న శాస్త్రీయ వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలను వివరించారు. అచ్చటి శిక్షితులు మా రైతులకు వివిధ పరిశోధనా శాలలను చూపెట్టారు. ఇక్కడ జరిగే అభివృద్ధి మేరకు మన పొలాల్లోకూడా ఎప్పుడు జరుగుతుందా అని రైతులు ఉవ్విళ్ళూరారు.

మా రైతులలో కలిగిన ఒక మధురానుభూతి – ఒక రసవత్తర సన్నివేశం–మా నాయకుడు ఆచార్య రంగాగారితో ఇష్టాగోష్ఠి సమావేశం. ఆయన మా పంక్తిలో, మా సరసన మా భోజనం ఆరగించారు. మా యోగక్షేమాలను ఒక్కొక్కరినే అడిగారు. తెలుసుకున్నారు. ఆయన ఢిల్లీ పార్లమెంటులో రైతులవాణిని ప్రతిధ్వనింప జేస్తున్నారు. గ్రామీణుల సమస్యలకు పార్లమెంటులో ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఆయన జాతీయనాయకుడు. అంతర్జాతీయ కర్షకోద్యమ సంధానకర్త. అంతటి గొప్పవ్యక్తి – మహాపురుషుడు – ఆ రోజు మాలో ఒకరై – అన్నింటా మాతోనే గడిపారు. ఆ నిరాడంబరుడైన మహానాయకుని తమతోపాటు మనసు దీరా చూచుకొనే భాగ్యం కలిగినందులకు మా రైతులు ఆనందాతిశయంతో ఉప్పొంగిపోయారు. అప్రయత్నంగానే ఎవరంతట వారే "ఆచార్య రంగాకు జై" అన్నారు. ఆనాడు రంగాజీ మా రైతులయెడల ప్రేమాభిమానాలను ప్రదర్శించిన ఘట్టం జన్మ జన్మాంతరాలకు మరుపురానిది. మా రైతుల్ని అభినందించారు. నిండు హృదయంతో ఆనందబాష్పాలతో

గూడిన సజల నేత్రాలతో మాకు వీడ్కోలు నిచ్చారు క్రొత్తఢిల్లీ స్టేషన్‌లో.

ప్రపంచ రాజకీయవేత్తల - ప్రపంచదేశాల దృష్టిని ఆకర్షించిన, విశ్వశాంతికి బలిష్ఠమైన పునాదుల్ని నిర్మిస్తున్న ఢిల్లీ పట్టణాన్ని వీడి మే నెల 29 వ తేదీ ఉదయానికి హిస్సార్ చేరుకున్నాము.

## హిస్సార్ పశుప్రదర్శనశాల

రైతులు మే 29 ఉదయానికి పంజాబు రాష్ట్రంలో హిస్సార్ చేరుకున్నారు. ఆసియాలోకల్లా పెద్దదైన పశుశాల హిస్సార్‌లో ఉన్నది. అది పంజాబులో వ్యవసాయానికి ప్రసిద్ధిజెందిన ముఖ్యప్రాంతం. ఆ ప్రాంతపు రైతులతో మాకు ఇష్టాగోష్ఠి జరిగింది. ఇంతవరకు మహానగరాలను, చారిత్రక ప్రదేశాలను సందర్శిస్తూ వచ్చాము. ఇప్పుడు రైతాంగ ప్రాంతానికి వచ్చాము. అందుకే ఇక్కడ మా రైతులకెంతో గౌరవం జరిగింది. పశుశాలను సందర్శించేందుకు ఒక దాత మాకు ఉచితంగా బస్సు సౌకర్యాలను కలిగించడం విశేషం. మా బండి హిస్సార్ చేరగానే శ్రీరాం నారాయణ్ మముల్ని కలిసికొన్నాడు. మా వివరాలు అడిగాడు; ఎందుకోనను కున్నాం. మనిషి సామాన్యంగా ఉన్నాడు. ఎవరో నను కున్నాం, "తూర్పు పంజాబు ప్రభుత్వం మీ ప్రయాణ సౌకర్యాలవిషయమై నాకు వ్రాసిందన్నాడు. 'మాకు ఐదు బస్సులు కావాలి' రేటు చెప్పమన్నాము. "మీరు రైతులు,

కష్టజీవులు, దూర దేశాన్నుండి వచ్చారు. మీ దగ్గర డబ్బు తీసుకోను" అన్నాడు. మాకు ఆశ్చర్యం వేసింది. బస్సుల్ని సిద్ధంచేయించాడు. రైతుల్ని స్టేషన్‌కు రెండుమైళ్ళ దూరంలో నున్న పశుశాలకు చేర్చాడు. శాలను సందర్శించిన అనంతరం తిరిగి స్టేషన్‌కు చేర్చాడు. మా కోర్కెపై మాతో రాం నారాయణ్ భోజనం చేశాడు. పైగా మమ్మల్ని అభినందించాడు. రాం నారాయణ్ పాకిస్తాన్ కాందిశీకుడు. ఆస్తిపాస్తుల్ని, బంధుమిత్రుల్ని మహమ్మదీయుల మతపిచ్చకు బలిచేసికొని కట్టుబట్టలతో హిస్సార్ జిల్లాకు చేరాడట. అదృష్టం కలిసివచ్చి ఇక్కడగూడా ఒక చిన్న బస్సు కంపెనీని స్థాపించగలిగాడు. సర్వస్వాన్ని పోగొట్టుకొని కట్టుబట్టలతో కాందిశీకుడుగా వచ్చి దైవికంగా వచ్చిన ఈపాటి అదృష్టానికి తనకు తానే ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు.

హిస్సార్ ఒక చిన్ననగరం. ఈ నగరాన్ని 14-వ శతాబ్దంలో ఢిల్లీసుల్తాన్ ఫిరోజిషా తుగ్లక్ నిర్మించాడు.

హిస్సార్ పశుశాల సూపరింటెండెంటు, మిగతా స్థానికాధికారులు రైతులకు స్వాగతమిచ్చి పశుశాలలో జరుగుతున్న వివిధ కార్యకలాపాలను విశదీకరించారు. ఆశాల 40,000 ఎకరాల విస్తీర్ణం కలిగినదై 9000 పశువులు కలిగి ఉన్నది. పశువులకు కావలసిన సహజమైన వాతావరణంలో వివిధ తరగతులకు చెందిన పశువులను శాస్త్రీయ పద్ధతుల మీద పెంచడం అచ్చటి గొప్ప విశేషము. ఆ విషయాలన్నిటిని శాల అధికారులు రైతు యాత్రికులకు తెలియజేయడమే కాకుండా రైతు యాత్రికులనుండి పశువుల

పెంపకంలో తమ తమ అనుభవాలను గురించి తెలిసి కొన్నారు.

ఆంధ్ర దేశం పశుసంతతికి అగ్రగామి. ఆ తర్వాత పంజాబు. ఆ దేశ పశుసంపదయే ఆ రాష్ట్రపు రైతాంగం - కష్టజీవులని రుజువుచేస్తూంది. పంజాబులో మా బండి ఆగిన ప్రతి స్టేషన్ లోనూ మాకు పంజాబు రైతులు దర్శనమిచ్చారు. అమాయకమైన చిరునవ్వుతో మాకు స్వాగత మిచ్చారు. మమ్మల్ని అభినందించారు. ప్రత్యేక రైలుబండిలో మా రైతులు దేశాటనం చేస్తున్నందుకు, వివిధ ప్రాంతాలలోని రైతుసోదరుల్ని చూస్తున్నందుకు తమ ఆనందోత్సాహాన్ని వెల్లడించారు. నిజంగా పంజాబు రైతులతో ఆంధ్ర రైతుల సమాగమం ఒక అపూర్వ సన్నివేశం. భూమిపై ఆ రైతులకు గల శ్రద్ధాసక్తులు - వ్యవసాయంపట్ల వారికిగల ఆసక్తి ప్రశంసాత్మకమైనది. కర్షకోద్యమం ఉగ్రరూపాతలూగుతూ - ఉధృతంగా సాగిన ఆ పుణ్యభూమిని దర్శించగలిగే మహాద్భాగ్యం, రైతు ఉద్యమాన్ని - రైతుల నాయకత్వాన్ని మనసారా పెంచుకొని బలపరచుకొన్న రైతాంగాన్ని దర్శించుకొనగలిగిన సదవకాశం లభించినందుకు మా రైతులెంతగానో పొంగిపోయారు.

30 వ తేదీ ఉదయానికి పంజాబు రాష్ట్రానికి మకుటంలో - భారత దేశపు నందనవనం కాశ్మీర్ గుమ్మంలోవున్న పటాన్ కోట చేరుకున్నాము.

ఆ భూలోక స్వర్గానికి ప్రత్యేక బస్సులో ప్రయాణం సాగించాము. మెత్తని పరుపులు, విశాలమైన సీట్లు గలిగిన

పదకొండు బస్సులు 30-వ తేదీ సాయంత్రం 6 గంటలకు పటాన్‌కోటలో బయలుదేరాయి. పటాన్‌కోట దాటగానే 'రావీ' నది నల్లని కెరటాలు, తెల్లని నురుగులు దిగ్భ్రమ కలిగించాయి. నదినుండి వీచే చల్లని పవనాలను ఆస్వాదించు కుంటూ దాదాపు పన్నెండుమైళ్ళ పర్యంతరం నదీతీరాన్నే ప్రయాణం సాగించాము. రావీనదీ జలాలకొరకు పాకిస్థాన్ భారతదేశాల మధ్య కొంత ఘర్షణ జరిగింది. ఇండియన్ యూనియన్‌లో పటాన్‌కోట సమీపంలోని నదీజలాలు పాకిస్థాన్‌లోనికి ప్రవహించకుండా భారతదేశపు పంట భూములవైపు మళ్ళించబడినాయి. నదిని దాటగానే కాశ్మీర్ పుణ్యభూమిలో ప్రవేశించాము.

ప్రపంచానికి కాశ్మీర్ నందనవనం. క్రీడామైదానం. వినోదయాత్రాస్థలం. వేసవికాలంలో దీనిశోభ మరింతగా విరాజిల్లుతూంది. ఈ దేవతాభూమికి మా రైతుల యాత్ర ఒక మహాద్భుత సహసకార్యమే ననిపించింది. మూడు వందలమంది రైతులు బస్సులలో పర్వతాలు ఎక్కుతూ వుంటే నిజంగా కైలాసగిరికి యాత్ర సాగించినట్లే ఉంది. ఆరాత్రి 10 గంటలకు జమ్ము చేరుకున్నాము. రాత్రి విశ్రాంతి తీసుకున్నాము. తెల్లవారుఝామున $4\frac{1}{2}$ గంటలకే ప్రయాణం సాగించాము. పర్వతాలమీదకు బస్సులు ఉరుకుతున్నాయి. చక్కని తారురోడ్డు పాముమెలికలు తిరుగుతూంది. ఉదయం 7 గంటలకు "కూద్" చేరుకున్నాము. కాశ్మీర్ మాజీ ప్రధాని షేక్ అబ్దుల్లా ఆదిలో పట్టుబడి బంధింపబడినది

ఇక్కడే. నాస్తా ముగించుకున్నాము. బస్సులు బయలు దేరాయి.

పటాన్‌కోటనుండి శ్రీనగరకు 267 మైళ్ళు. ఈ 267 మైళ్ళు ఎంతమంచి రాస్తా నిర్మించబడింది! పర్వతాలమధ్య నిర్మించబడిన ఆ రాస్తావెంట ప్రయాణం అతిభయంకరంగా ఉండటమే కాదు - హాయిగాకూడా ఉంటుంది. రాస్తావెంట పర్వతాలమీద, పాతాళంలో కనుపిస్తున్న లోయలలో ఆ దేవదారు వృక్షాలు - సహజంగా పెరిగినవా లేక మానవులచేత పెంచబడినవా అనిపిస్తుంది. వంకరటింకర బాటలో బస్సులు అతివేగంగా పరువులు తీస్తున్నాయి.

పర్వతాలమధ్య పాతాళంలో ఒకనది నురుగులు క్రక్కుతూ మా వెంట దౌడు తీస్తుంది. అబ్బ! ఏమానది ప్రతాపం! హుంకరిస్తూంది. మలుపు దగ్గర ఎగిరిపడుతూంది! అది సింధునదిశాఖ "చీనాబ్". ఎందుకో అంత ఉరవడి! ఉధృతం! త్వరత్వరగా ఈ మహాభీకర పర్వత పఙ్తుల నుండి బయటపడి పసిడిపొలాలపై ప్రవహించుదామనే కాబోలు! రాంబన్ దగ్గర సస్పెన్షన్ వంతెనమీదుగా "చీనాబ్"ను దాటాము. మరికొంతదూరం చీనాబ్ మాతోనే వచ్చింది. కానీ కన్నుమూసి కన్నుతెరచే టప్పటికి అదృశ్యమయింది. 11 గంటలకు బనిహాల్ గ్రామానికి చేరాము. ఆ గ్రామం సముద్రమట్టానికి సుమారు 7000 అడుగుల్లో ఉన్నది. ఒక గంట అక్కడ విశ్రాంతి. బనిహాల్ టన్నల్ (సొరంగం) 9000 అడుగుల ఎత్తు. ఐదుపర్వతాలు ఎక్కాము. మధ్యాహ్నం 1 గంటకు

బనిహాల్ టన్నల్ చేరుకున్నాము. అది సముద్రమట్టానికి సుమారు 10,000 అడుగుల ఎత్తున వుంది. అక్కడ బస్సులు మారాలి. చిన్నచిన్న ట్రక్కుల్లో 10 బస్సుల ప్రయాణీకు లను సొరంగం దాటవేశాము. సొరంగం ఆవలివైపుకు కాశ్మీర్ వ్యాలీ మనోహరదృశ్యం కనుచూపుమేరలో కనుపిస్తూంది.

కానీ 11 వ బస్సు జాడ కనిపించలేదు. టన్నల్ ఆవలి వైపున మా కొరకు వేచివున్న 9 బస్సులలో సైతులను శ్రీ నగర్ వైపుకు సాగనంపాము. నేను, రామకృష్ణ 11 వ బస్సుకోసరం టన్నల్ ఈవలివైపున కాచుక కూచున్నాము.

సాయంత్రం 6 గంటలు కావచ్చింది. బస్సుజాడమాత్రం కనుపించలేదు. ఆ శిఖరంమీాదనుంచి 25 మైళ్ళవరకు రాస్తా కనుపిస్తూనేవుంది గాని 11 వ బస్సు ఎక్కడా కనుపించదు. మాకు ఆందోళన జాస్తి అయింది అక్కడనుంచి టెలిఫోన్, టెలిగ్రాఫ్ సౌకర్యాలు లేవు. ఎదురు వెళ్లడానికి 6 గంటలకు వాహనంలేదు. అక్కడ ట్రాన్స్పోర్టు ఉద్యోగస్థులు మా కొరకై 6 గంటలకే రవాణా బంద్ చేయవలసిన టన్నల్‌ను మూయ లేదు. బస్సునుగురించిన ఆందోళన మనస్సును కెలుకుతున్నా – ఆ పర్వతశిఖరాలమధ్య సూర్యాస్తమయదృశ్యం అత్యంత మనో హరంగా వున్నది. తెల్లని మంచు శిఖరాలు ఎర్రని సూర్యకిర ణాలు పరావర్తనము చెందుతున్నాయి, ప్రతిబింబిస్తున్నాయి. ఇంతలో నల్లని మేఘాలు మా పైకి లంఘించాయి. మమ్మల్ని చుట్టుముట్టాయి. మేము ఉక్కిరిబిక్కిరైనాము. మేము ధరించిన సామాన్యమైన నూలు దుస్తులు చెమ్మకున్నాయి. కొరుక్కు తినే చలి – మా శరీరాలు ముద్దయ్యాయి. ఎముకలు

మూటగట్టుక పోయ్యాయి. టీ అంగడిలో ఒక మూలను పొట్టలో కాళ్లు అణచుకొని ముడుచుక కూచున్నాము. 6-30 గంటలు అయింది. నాలుగు పర్వతాల దిగువ భాగంలో నల్ల త్రాచులాగా సన్నగా కనిపిస్తున్న తారురోడ్డుపై మందంగా సాగివస్తున్న ఒక శకటం లీలగా కనుపించింది అదే మా బస్సు కావచ్చునని మా ఆశ. అదే అయితే బాగుండునని మా ఆకాంక్ష. కండ్లలో వొత్తులు పెట్టుకొని చలికి గడగడ వణుకుతూ-తాబేలులాగా వస్తున్న ఆ శకటాని కేసి చూస్తూ వుండిపోయాము. అది కొండలు చుట్టూ తిరుగుతూ వుంది. ఒక్క 1/2 గంటలో మూడు కొండల్ని చుట్టి వేసింది. ఇంకా రెండు కొండలున్నాయి ఒక అరగంటదాకా కనుపించలేదు. ఆశ అంతరిస్తూంది తుదకు ఆఖరి శిఖరానికి వచ్చింది.అది తప్పకుండా ప్రయాణీకుల బస్సు అని నిర్ణయించుకున్నాము. మాదే అయి వుండాలి.

మా ఆకాంక్ష యీడేరింది అది మా బస్సే సరిగ్గా 7 గంటలకు బనిహాల్ టన్నల్ చేరుకొన్నది. బస్సు వెనక పడింది - పైగా మధ్యలో ఇంజన్ ట్రబుల్ వలన ఆగిపోయింది. బస్సులోని ప్రయాణీకులు-మాకు - మేము ఒకరొకర్నొకరు చూచుకొనేటప్పటికి అంతకుముందు చిత్రవిచిత్రమైనసందేహాలతో - భయంతో కాసారంలా వుడికిపోతున్న మనస్సులు శాంతించాయి. పాపం టన్నల్ దగ్గర ట్రాన్సుపోర్టు ఆఫీసరు చాలామంచివాడు. ఒకే దఫా రెండు ట్రక్కుల్లో మమ్మల్ని అందర్నీ 10 నిమిషాల వ్యవధిలోనే సొరంగందాటించాడు. ఆవలివైపు మాకొరకు బస్సుసిద్ధంగా వున్నది. అక్కడినుండి

శ్రీనగర్‌కు 68 మైళ్ళు పోవాలి. 6000 అడుగులు దిగాలి. ఆ సంధ్య చీకటి వెలుగులో అన్ని వేల అడుగుల ఎత్తునుండి కాశ్మీరు వ్యాలీ కనుచూపుమేరలో వున్న కైలాసంలాగా, కనుపిస్తున్నది. పర్వతాల వాలులో మళ్లుమళ్లుగా వున్న నరిపైర్లు-పచ్చని మైదానాలు గవర గవరగా కనుపిస్తున్నాయి. సంధ్యా సమయం 8 గంటలకు బస్సు బయలుదేరింది, రాత్రి 11 గంటలకు శ్రీనగర్‌లో ప్రవేశించాము.

కాశ్మీరుయాత్ర సాహసమనిపించింది. కొందరకు భయంకరంగా గూడావున్నది. చీనాబ్ నదిపరవళ్ళు, పాతాళం లోకనుపిస్తున్న లోయలు, మిూదకు లంఘించినట్లు కనుపించే పర్వత శిఖరాలు మాలో కొందర్ని భయపెట్టిన మాటనిజం. కొండలవాలులోని పచ్చనిమైదానాలు - చక్కని దేవదారు వృక్షాలు- రమణీయమైన ప్రకృతిదృశ్యాలు హృదయానికి మితి మిూరిన ఆనందాన్ని, హాయిని కలిగించాయి. భయభ్రాంతులు- ఆశ్చర్య అనందడోలికల సమ్మిళిత హృదయాలతో కాశ్మీర్ లోయలో ప్రవేశించాము.

మానవుని ఆనందానికి, మనోవికాసానికి కొన్ని గీటు రాళ్ళున్నాయి. అవి "స్వచ్ఛోదకం - పచ్చికబయళ్ళు, అందమైన ఆడవాళ్ళ" అని ఒక కవి పుంగవుడంటున్నాడు. ఈ మూడింటిలో కాశ్మీర్ దేశంలో ఏదికొదువ ? కాశ్మీర్ భూములో పాదంపెట్టిన కవుల కలాలకు ఖాళీవుండదు. చిత్రలేఖకుల కుంచెలకు విరామముండదు. ఫోటోగ్రాఫర్ల కేమెరాలకు తీరని పని. విలాసవంతుల హృదయాలు ఏదో ఊహాలతో కాసారంలా ఊడికిపోతూ వుంటా వృక్ష శాస్త్ర, ఖగోళ, భూగోళ,

జంతుశాస్త్ర పండితులకు చేతినిండాపని - మెదడుకు కావలసి
నంత మేత.

మా హృదయం స్పందించింది - మా రైతులకు వసం
తోదయమైంది అది కాశ్మీరులో నవ వసంతం శీతాకాల సుషుప్తి
నుంచికన్నవలపులతో కాశ్మీరు మేల్కొంచింది. నవనవోన్మేషం,
నవకుసు మంజరి జృంభణంతో ఆ లోయ విప్పారింది. ఎక్కడ
చూచినా వెల్లివిరిసిన ఉత్సాహం- ఎక్కడకు వెళ్ళినా విప్పారిన
ఆనందం.

పక్షుల బృందగానంతో ఉషశ్శోభ వెల్లివిరిసింది. ఉష
కిరణాల హాయలు మధ్య చిగిర్చిన తరుసంతతి, విప్పారిన
పుష్పసంచయం! అది కాశ్మీరు వసంతశోభ! అవి పూలు
కాదు! అనంత ప్రకృతి సుందర నృత్య భంగిమలో పడిన
అడుగుజాడలు.

ఎప్పటిదో కాశ్మీరు? ఎంతకష్టపడి కనుగొన్నారో
ఆర్యులు ఆ ప్రకృతికన్యను? ఈ ఆర్యుల కన్నె కొన్నాళ్ళకు
మొగల్ పాదుషాలకు దక్కింది ఆ లావణ్యవతి కనుసైగలతో
మురిసి, భ్రమసి - మొగల్ సామ్రాట్టులు ఎంతధనాన్ని ధార
పోశారో! శాలీమార్, మొగల్ గార్డెన్సు, నిషాత్ బాగ్ -
ఇవన్నీ వారి సృష్టేకదా! అది మొగల్ పాదుషాలకు వేసవి
మకాం. వినోదకేంద్రం. క్రీడామైదానం. ఈనాటికీ విలాసవంతు
లకు అది వినోదకేంద్రమే. ఆటగాళ్ళకు క్రీడామైదానమే!
వృక్ష, జంతుశాస్త్రజ్ఞులకు పరిశోధనాలయమే! కాశ్మీరు
లోయలో పసిడిబుగ్గలతో - పాలుగారే హాయలుచిలికే,
అందాలుచిందే- చిరునగవును చిందించే వసంతకన్నియ ఎందరి

చేతుల్లో నలిగిపోయిందో ! డాల్ సరోవరంలో నౌకాయానం ఎంతహాయినిగొల్పింది. "మనం నిజంగా దేవతా భూమిలోనే ఉన్నాము. ఇది భూలోకంకాదు. ఇది చంద్రలోకం" అనే అనుభూతిని పొందకుండా ఎలాఉండగలం.

అడుగో రైతు – శీతాకాలపు అంధకారంనుండి బయట పడి – కొండవాలులో పార, పలుగు తీసుకొని ఉల్లాసంగా సాగిపోతున్నాడు. కొండ అంచులలో మళ్ళచేస్తున్నాడు. వరి నాటుతున్నాడు. పండిస్తున్నాడు. అదుగో నావికుడు– చిరునగ వ్వుతో చుక్కాణీ పట్టుకొన్నాడు. తెడ్డు వేస్తున్నాడు. వొయ్యా రంగా – నావ సాగిపోతుంది. ఆ తొంగిచూసేది ఎవరు ? ఎక్కడనుండి ? కాశ్మీరుకన్య. నావికాగృహంనుండి – విశాల ప్రకృతితో సరససల్లాపాలాడుతూంది. అదుగో ! ఏ దేశస్థులో– మాలాంటి యాత్రికులు – నావికా గృహాన్ని మరోప్రాంతానికి తరలించుకుంటున్నారు.

# కాశ్మీరులోయ పూర్వాపరాలు

కాశ్మీరు పురాణకాలం నాటిది. చరిత్ర బహు పురాతన మైంది. అందమైన ఆ లోయ ఆదినుండీ దండయాత్రల కాల పాలమైంది. ఒకప్పుడు ఆ లోయ లోతైన ఒక సరోవరము. ఈ సరస్సులో "జలోద్భవుడనే" ఒక రాక్షసు డుండేవాడు. ఈ రాక్షసుడు పొరుగు దేశాలకు పీడకలగా పరిణమించగా ఈతని మృత్యువు నపేక్షించి కాశ్యపముని పరమేశ్వరునిగురించి అఘోరతప మాచరించాడు. పరమశివుడు కరుణించి దేవతా సైన్యాలను సరోవరంపై

జలోద్భవునకు ఘోరసంగ్రామం జరిగింది. జలోద్భవుడు కాశ్మీర్ పర్వతాలలో "కాన్సర్ - నాగ్" దగ్గర హతమార్చ బడ్డాడు. ఆ సమయంలో శివుడు "శారాముల్లా" దగ్గర ప్రత్యక్షంకాగా ఆ సరోవరంలో ని నీరంతా ఇంకిపోయి మను ష్యనివాస యోగ్యమయినదట.

ఆదిలో మానవులు ఆ లోయలో ఆరు మాసాలు మాత్రమే నివశించేవారట. చలికాలంలో పిశాచాలు నివసం చేసెడివట. మిగిలిన ఆరు మాసాలు పిశాచాలకు భయపడి మానవులు ఆ లోయను విడిచిపెట్టేవారట. తర్వాత కొన్నా ళ్లకు పిశాచార్చనలు సలిపినచో - వాటిభయముండదనీ, అన్ని వేళలా ఆ లోయలో నివశించవచ్చునసే నీలనాగుడనే నాగ దేవత అభయంతో అర్చనలు ప్రారంభించారు. ఇప్పటికీ కాశ్మీర్‌లోని హిందువులు చలికాలంలో పిశాచార్చనలు సల్పుతూఉంటారు.

భౌగోళిక పరిశోధనల వలనగూడా ఒకప్పుడు కాశ్మీర్ లోయ ఒక పెద్ద సరోవరమై యుండవచ్చునని నిర్ధారించబడి వున్నది.

చరిత్ర పుట్టకపూర్వమే కాశ్మీర్‌లో రాచరికముండేది. క్రీస్తుకుపూర్వం 4249 లో అంటే ఇప్పటికి 62 వందల సంవత్స రాలనాడు కాశ్మీర్ లోయను "అడగోనంద" పరిపాలిస్తూ ఉండేవాడట. తర్వాత అడగోనంద కుమారుడు దామోదర్ రాజ్యాధికారంలోనికి వచ్చాడు. ఆతడు యాదవులచే వధింప బడినాడట.

క్రీస్తుకు పూర్వం 308 లో అశోకచక్రవర్తి కాశ్మీర్‌లో

బౌద్ధధర్మాన్ని విస్తరింపజేశాడు అశోకుని మనుమడు జాల కుడు బౌద్ధాన్ని మరింత పటిష్టం చేశాడు.

క్రీస్తు శకారంభంలో కాశ్మీరును "తార్తారులు" ముట్ట డించారు. ముగ్గురు తార్తార్ రాజులు కాశ్మీర్‌లోని మూడు భాగాలను ఒకేసారి పరిపాలించినట్లు చరిత్ర చెప్తున్నది.

6 వ శతాబ్దంలో మధ్య ఆశియానుండి ఇండియాకు తరలివచ్చిన శ్వేతహూణులు కాశ్మీర్‌ను వశపరచుకొని కొన్నాళ్ళు రాజ్యమేలారు. అదే సమయంలో అంగ్లో శాక్సనులు ఇంగ్లండును జయించుకొన్నారు.

8 వ శతాబ్దంలో శంకరాచార్యుని నూతన వైదిక సిద్ధాంత ప్రభావంవలన కాశ్మీర్‌లో గూడా బౌద్ధధర్మం క్షీణ దశ పట్టింది.

11 వ శతాబ్దం ప్రారంభంనుంచీ కాశ్మీర్‌పై మహమ్మ దీయుల దండయాత్రలు ప్రారంభ మయ్యాయి. 1015 లో ఖోసా మైదానం మీదుగా విరుచుకపడిన మహమ్మద్ ఘజినీ కాశ్మీర్ సైన్యాలచే పరాభూతుడై తిరోగమించాడు. తర్వాత విధి విరామంలేకుండా మహమ్మదీయుల, మంగోలుల దండయా త్రలు సాగాయి. కాశ్మీరును ఏలిన మొట్టమొదటి మహమ్మ దీయ సుల్తాను "రాంచన్‌షా" (1341) అతడు టిబెట్టు దేశ స్థుడు. బాల్యంలోనే కాశ్మీరువచ్చాడు. హిందూమతాన్ని స్వీకరించుటకు ప్రయత్నించి బ్రాహ్మణులు ప్రతిఘటించినందు వలన విఫలుడైనాడట. చివరకు విధిలేక బుల్‌బుల్‌షా అనే తురకఫకీర్ ప్రోత్సాహంతో ఇస్లాం ధర్మాన్ని స్వీకరించాడట. అంతటితో రాంచన్‌షా బ్రాహ్మణులపై పగబూని

అందర్నీ ఇస్లాం ధర్మాన్ని స్వీకరించవలసినదిగా బలవంత పెట్టినట్టుగూడా చరిత్ర చెప్తున్నది. రాంచన్‌షా మొదలు కుతుబుద్దీన్ వరకు కాశ్మీర్ భూమి శాంతియుతంగా ఉన్నదనే చెప్పవలసివస్తుంది.

పరిష్యానుంచి తలదాచుకొనేందుకు కాశ్మీర్ వచ్చిన సయద్ అలీ శాంతిమయ వాతావరణంలో అశాంతిజ్వాలలను రేపాడు షాహమ్‌దాన్ అని పిలువబడే ఈ సయద్ అలీహమ్ దానికి సంబంధించి ఒక తమాషా సంఘటన చెప్తారు యుగాలు తరబడిగా ఆర్యసంస్కృతి, ఆర్యధర్మం పాటించిన కాశ్మీర్ ఇస్లాం ధర్మానికి తల వొగ్గడానికి హేతువు "షాహమ్‌దాన్" అనే చెప్పవలసియుంటుంది.

"అది పరిష్యా తామర్లేన్ పరిపాలిస్తున్న రోజులు. తామర్లేన్ ప్రభువు వేగుల వేషంలో ప్రజల కష్టసుఖాలను ప్రత్యక్షంగా చూసేందుకు బయల్దేరాడు ఒక రాత్రి ఒక పేదవాని గృహం ముందు కూర్చుని ఉండగా ఒక దీనాలాపం విన్నాడు. ఆ గృహస్థుని పాపలు ఆకటి చిచ్చుకు తాళలేక మారాము చేస్తున్నారు. ఆ ఇల్లాలు పతిని వేడుకొంటున్నది - ఎక్కడైనా అంత రొట్టెముక్కను అడుక్కురమ్మని. బిచ్చాటనం ఇష్టంలేని ఆ గృహస్థుడు ససేమిరా అంటున్నాడు. ఆ కుటుంబపు దీనావస్థను కండ్లారా కాంచిన తామర్లేన్ హృదయం జాలితో నిండిపోయింది. బంగారు మొహరులసంచి నొకదానిని కిటికీ గుండా ఆ ఇంటిలో విసరి ప్రభువు రాజప్రాసాదానికి మరలి పోయాడు.

తెల్లవారగానే పట్టింటపడియున్న మొహరుల మూటను చూచిన ఇల్లాలు ఆనందాతిశయంతో భర్తకిచ్చింది. ఆ గృహస్థుడు ఆ సొమ్ముతో అంగడికి వెళ్ళి అవసరమైన భోజన పదార్థాలను తీసుకొనివచ్చాడు. ఇది చూచిన పొరుగువారు "ఈ గర్భదరిద్రునకు బంగారు నాణా లెక్కడివి? ఎక్కడో దొంగిలించి ఉంటాడు" అని అతనిపై న్యాయస్థానంలో చౌర్యాభియోగాన్ని దాఖలుచేశారు. దాఖలుచేసినవారు 'సయ్యదులు' (ప్రవక్త అల్లుడు అలీ సంతతివారు) అయినందున పాపమా చౌర్యాభియుక్తుడు శిక్షింపబడ్డాడు. ఈయుదంతం ప్రభువుకు తెలిసింది. అసలు రహస్యం తనకెరుకే కాబట్టి తిరిగి ఇరువాగులవారిని పిలువనంపాడు. ముద్దాయి అసలు విషయం విన్నవించాడు కానీ "సయ్యదులు" ముద్దాయి ప్రకటనను ఖండించారు. అది దొంగసొత్తేనని ప్రమాణం చేస్తామన్నారు. ప్రభువుకు ఆగ్రహం కలిగింది. సప్తలోహాలతో ఒక గుర్రాన్ని తయారు చేయించి-ఎర్రగా కాల్పించి దానిపై సవారిచేసి తమ నిజాయితీని నిరూపించుకోవని తాఖీదు జారీచేశాడు. అగ్ని "సయ్యదులు"కు హానిచేయదని మహమ్మదీయమతసిద్ధాంతం. ఆవిధంగా ప్రభువు ఆదేశాలను పాటించిన సయ్యదులు - మలమల మాడి చచ్చారు ఆదేశాలను పాటించని వారిని సైనికులు హతమార్చారు. అయితే సయ్యద్ అలీహమ్దాని ఎలాగో మృత్యుగహ్వరంనుండి బయటపడి - కాశ్మీరుకు పారిపోయాడు.

ఈ హమ్దానీ ప్రేరణ కాశ్మీర్‌లో కుతుబుద్దీన్ హిందువుల అసువులపై స్వారీ చేశాడు హమ్దానీ అనంతరం అతడి కొడుకు తండ్రి తల తన్నినవాడయ్యాడు. కుతుబుద్దీన్ అనంతరం

సింహాసనానికివచ్చిన సికందర్ హమ్‌దాని కొడుకు ప్రోత్సాహంతో హిందూ సమాజాన్ని విధ్వంసంచేశాడు. ఇస్లాంను స్వీకరించని హిందువులు చిత్రవధ చేయబడ్డారు. దేవాలయాలు నేలమట్టమయ్యాయి. దేవతా విగ్రహాలు రాజప్రాసాదాల సోపానాలయ్యాయి.

హమ్‌దానీని కాశ్మీర్‌లోని సున్నీ మహమ్మదీయులు గురువుగా ఆరాధిస్తారు. ఆఫకీర్ మందిరం ఇప్పటికీ శ్రీనగర్‌లో మూడవ బ్రిడ్జి దిగువన చూడవచ్చు ఈ ప్రసిద్ధ కట్టడాన్ని కుతుబుద్దీన్ స్వయంగా నిర్మింపజేశాడు.

1435 లో రాజ్యానికివచ్చిన సికందర్ కుమారుడు "అలీషా" తాత తండ్రులు మిగిల్చిన విధ్వంసన కార్యక్రమాన్ని పూర్తిజేశాడు. ఈతడి హింసకు తాళలేక వేలాది హిందూ కుటుంబాలు మూకుమ్మడిగా ఆత్మహత్యలకు పాల్పడ్డారు.

కాశ్మీర్‌లోని కాలువలు – సరోవరాలు హిందువుల శవాలతో పొంగిపోయాయి. తమ స్వంతగృహాలకు తామే నిప్పంటించుకొని అగ్నిలో దగ్ధమయ్యారు. కొందరు ప్రాణాలతో బయటపడి విదేశాలకు పారిపోయారు. అలాగే ఆ నికృష్ట హత్యలను భరిస్తూ ప్రాణాలతో బ్రతికిఉన్న కొలదిమంది మాత్రం – అలీషా కొడుకు జైన్ – ఉల్ – ఆబిద్దీన్ హయాంలో కొంతవరకు ఊపిరి సల్పుకోగలిగారు. అబిద్దీన్ మానవతను గుర్తించి పరిపాలించిన ధర్మప్రభువు వర్ణ్యాభావను అభ్యసించమని హిందువులను ప్రోత్సహించాడు. ప్రభుత్వోద్యోగాలలో చేరమని ప్రేరేపించాడు. కొందరు అందు కంగీకరించి ప్రభుత్వో

ద్యోగులయ్యారు. అంగీకరించనివారు పండితులు - పౌరోహితులుగా మిగిలిపోయారు. అతడే కాశ్మీర్‌లో ఉన్న శాలువల నేత ప్రవేశపెట్టాడు.

ఆ తర్వాత అక్బరు పాదుషా హిందువులను చల్లని చూపుచూశాడు. అక్బరు 1587 లో కాశ్మీరును జయించాడు. కాశ్మీర్ హిందువుల కదే చంద్రోదయం. స్వర్ణయుగం. పాదుషా హరిపర్బత్ కొండచుట్టూ ఒక కుడ్యాన్ని నిర్మింపజేశాడు. మొగల్ మహాయుగంలో కాశ్మీర్ హిందువులు అధికప్రయోజనాలను పొందారు. వాస్తవానికి ప్రభుత్వ యంత్రాన్ని నడిపించినది హిందువులే. వీరి ప్రతిభా సంపత్తులకు అచ్చెరువొందిన అక్బరు కాశ్మీర్ హిందూజాతికి "పండితు"లనే బిరుదాన్ని ప్రసాదించాడు.

జహాంగీర్ పరిపాలన కాశ్మీర్‌లో రసవత్తరంగాసాగింది. కాశ్మీరీయుల అందానికి, కాశ్మీర్ ప్రకృతి సౌందర్యానికి రసికుడైన ఆపాదుషా ముగ్ధుడయ్యాడు. రమణీయమైన ఉద్యాన వనాలను పెంచాడు. అక్బర్, జహాంగీర్, షాజాహాన్ - ఈ ముగ్గురు మొగల్ చక్రవర్తుల హయాంలో కాశ్మీర్‌లోయ నందనోద్యానవనంగా పరిమార్పు చెందింది. ఔరంగజేబు హయాంలో తిరిగి హిందువులకు కష్టపుదినాలుదాపురించాయి.

భారతావనిలో మొగల్ సామ్రాజ్య పతనానంతరం కాశ్మీర్‌కు గ్రహణం పట్టింది. 1751 లో అహ్మద్ షా దురానీ తన ప్రభువైన నాదిర్షాను సంహరించి కాశ్మీర్‌ను ఆక్రమించుకొని హిందువులను హింసించడం ప్రారంభించాడు. హిందూ శాస్త్రిలనుతగులబెట్టించాడు. ఒక్కొక్కరినే వధించడంకష్టసాధ్య

మని భావించాడు కాబోలు – గోనెసంచులలో బిగించి డాల్ సరస్సులో ద్రోర్లించారు. ఆనాడు హిందువులను వధించినచోటు "బత్తామజీర్" అనేపేరుతో ఈనాటికీ శ్రీనగర్‌లో చూడ వచ్చు. ఇండ్లు కాల్చివేయబడినాయి. హిందూ స్త్రీలు మాన భంగం చేయబడ్డారు. హిందువు తలపాగాతో వీధిలో కనబడ కూడదు. అలా కనపడితే ముస్లిం ఎవరైనాసరే పరుగెత్తుకొని వచ్చి – ఆ హిందువు వీపుపై ఎగిరి ఎక్కి మోయమనే వారట. మోయలేకపోతే చావవలసిందే. ఈ పనినే "ఖాస్" అనేవారు.

దురానీ భయంకర పరిపాలన 1820 లో రంజిత్ సింగు కాశ్మీర్‌ను జయించిడంతో అంతమయింది. అప్పటికి కాశ్మీర్ లోయలలో మిగిలి ఉన్నహిందువులు బహుకొద్ది మాత్రమే. సిక్కులు మహమ్మదీయులను నష్టపెట్టి స్వార్థకసిని తీర్చు కున్నమాట గూడా వాస్తవమే.

ప్రథమసిక్కు యుద్ధానంతరం కాశ్మీర్ బ్రిటిషువారి స్వాధీనమయింది. ఆర్థికంగా అనవసరపు ఖర్చు మోయవలసి వస్తుందనే ఉద్దేశముతో ఆంగ్లేయులు కాశ్మీర్‌ను మహారాజా గులాబ్‌సింగుకు అమ్మివేశారు. (1846) గులాబ్‌సింగు మునిమనుమడే ఇప్పటి కాశ్మీర్ "సర్దార్ – యి–రియాసత్"

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత గూడా కాశ్మీ ర్‌కు కొండజాతుల బెడద తప్పలేదు. ఈనాటికీ కాశ్మీర్ సమస్య ఇండియా – పాకిస్తాన్ దేశాలమధ్య అపరిష్కృతంగానే ఉన్నది.

# సరోవర విహారం

హజూరీబాగ్ మైదానంలో మా మకాం. 30 గుడారాలు నిర్మించుకున్నాం దీన్నే 'ఒలింపిక్ గ్రౌండ్సు' అంటారు. మా ప్రక్కనే అకాలీదళ్ మహాసభకు వచ్చిన సిక్కు ప్రతినిధుల గుడారాలు – బహిరంగ సభావేదిక. మాస్టర్ తారాసింగ్ ఆ మహాసభను ప్రారంభించారు.

కాశ్మీర్‌లో యింకా చూడవలసిన ప్రదేశాలు కొల్లలు. జూన్ 1 వ తేదీ ఉదయంనుండి మా కార్యక్రమం ప్రారంభమైంది. మొదటిరోజు నావలలో ప్రయాణం సాగించాము. జీలం నదిలో నావలు బయలుదేరాయి. హిమగిరులనుండి బయల్వెడలిన చిన్న సెలయేరులు ఒక దానితో ఒకటి సంయోగం చెంది జీలంనదిగా శ్రీనగర్ హృదయాన్ని చీల్చుకొని ప్రవహిస్తున్నది. ఇది శ్రీనగరునుండి దక్షిణముఖంగా ప్రవహించి పాకిస్తాన్‌లో చీనాబ్ – రావి – సట్లెజ్ నదులను కలుపుకొని పశ్చిమ పంజాబ్ దక్షిణభాగంలో సింధునదిలో సంగమిస్తున్నది. ఈ పంచనదులు ప్రవహిస్తున్న ప్రాంతానికే "పంజాబ్" అనే పేరు సార్థకమైంది.

డాల్ నాగిన్ సరోవరాలు–జీలంనది శ్రీనగరులో సగ భాగం ఆక్రమించాయి. డాల్ సరోవరంలో నావికా విహారం సల్పుతూ షాలీమార్, మొగల్ గార్డెన్సు, నెహ్రూపార్కు సందర్శించాము. డాల్ సరోవరజలాలు స్వచ్ఛంగా – నిశ్చలంగా వున్నాయి. అలవితప్పినలోతు. అడుగున జలారణ్యం కను

స్తుంది. విచ్చినతామర పుష్పాలు సరోవర సౌందర్యానికినగలు, నాణెములుగావిరాజిల్లుతున్నాయి. సరస్సు తీరమంతా అతిసుంద రమైన ఉద్యానవనాలే. మధ్యభాగంలో ఒక మంటపం. మంట పంలోపల 'స్విమ్మింగ్ పూల్' అచ్చట జలక్రీడలు ఎంతహాయి నిస్తాయి! ఎంత ఆనందాన్నిస్తాయి! సరస్సులోని నావికా గృహాలు (Boat houses) ఎంత అందంగావున్నాయి. ఒక్కొక్క దానికి ఒక్కొక్క సుందరనామం 'దిహెవెన్' 'ది పారడైజ్' నిజంగా అవి స్వర్గధామాలే! నీటిపైనిర్మించబడిన ఆ నావికా గృహాలలో నివాసంకంటే ఇంద్రలోకం సౌఖ్యవంతంగా వుం టుందా? నవీన గృహాలంకరణ, అధునాతన సౌకర్యాలతో అలరారే ఆ జలగృహాలను మనం ఎక్కడచూడగలం! వెన్నిస్ నగరాన్ని మేము చూడలేదు. అయినా ఇంతకంటే అధికంగా వుంటుందా? నీటిలో ప్రయాణం – నీటిలో నివాసం– నీటిలో బ్రతుకు – నీటిలో జీవితం – ఆ స్సరే అక్కడ లేకపోతే నావ లేదు. గృహంలేదు. ఆనందంలేదు. సౌఖ్యంలేదు.

ఆ నావికా గృహాలను యాత్రికులకు అద్దెకిస్తారు. జీలం నదిలో – డాల్ సరోవరంలో ఎక్కడనివాస మేర్పరచుకోవా లంటే ఆ నావికాగృహాన్ని అక్కడకే తీసుక వెళ్ళవచ్చు. మకాం మనతో నడిచివస్తుంది. ఎక్కడుండాలంటే అక్కడే వుంటుంది. రోజుకొక సుందర సుహాసన ప్రాంతానికి మకాం మార్చవచ్చు. ఆశ్చర్యంగా లేదూ! సాధారణమైన హౌస్ బోట్ లో రెండునివాసపుగదులు, రెండుపడకగదులు ఒకస్నానపు గది ఉంటాయి. అయితే దాని అద్దెను మార్లైతులు భరించ లేరు. రోజుకు అన్నపానాదులలో సహా రు. 25 లు మొదలు

రు 75 లు వరకూ వుంటుంది. అయినా అది స్వర్గమే! శ్రీమంతులైన నూతన దంపతులు 'హనీమూన్' డాల్ సరోవర నావికాగృహాలలో ఎంత మాధుర్యంగా వుంటుంది! దేశ విదేశాలనుంచి వేసంగిలో కాశ్మీరుకు విజ్ఞాన వినోద యాత్రలు సాగిస్తున్న యువతీ యువకు లెందరో నావికా గృహాలలో - సుహాసలమైన చల్లని పవనాల మధ్య మనురానుభూతుల్ని పొందుతున్నారుగదా!

ఈ నాలుగు మాసాలేగదా కాశ్మీర్ లోయలో జీవితం. యాత్రికులతోనేగదా ఇచ్చటి సామాన్య ప్రజల జీవనం! 'స్విట్జర్ లాండు' దేశానికి వచ్చేరాబడిలో హెచ్చుభాగం వివిధ దేశాలనుండివచ్చే యాత్రికుల దేనట ఔను మరి! స్విట్జర్ లాండు ఐరోపా ఖండానికి ఉద్యానవనం - కాశ్మీర్ ఆసియా దేశాలకు క్రీడామైదానం. కాశ్మీర్ న్యాలీ ప్రజలలో సగం మంది జీవితం నీటిమీద నివాసమేకాదు. నీటిమీదనే జీవన భృతిసాధనకూడా. ఒక్కొక్క సామాన్య కుటుంబం ఒక్కొక్క 'షికారీ' (ఇద్దరు లేక ముగ్గురు కూర్చోగల చిన్న బోటు) తో జీవనయాత్ర సాగిస్తున్నది. ఆవిధంగా కొన్ని వేల కుటుంబాలున్నాయి. ఆ కుటుంబాలు 6 నెలల సంపాదనతో 12 నెలలు. జీవించాలి. ఉదయం 9 గంటల మొదలు సాయంత్రం 5 గంటలవరకు షికారులో తిరిగినందుకు వీలునుబట్టి, రు 5/- మొదలు రు 10/- వరకూ చార్జీ చేస్తారు. మొత్తం సంవత్సరం మీద రు 1000/- మొదలు రు 1300/- వరకు సంపాదిస్తారు. ఆ స్వల్ప ఆదాయంతోటే యేడాది పొడవునా కుటుంబమంతా కాలక్షేపం చేయాలి.

కాశ్మీరు వ్యాలీలో సామాన్యుని జీవితంలో ఇంకెంతో ఉన్నతిని సాధించవలసివున్నది. ఆ భూమిలో సామాన్యుడు మహమ్మదీయుడు. హిందువులు నూరింట సుమారు 30 మంది మాత్రమే. శ్రీమంతులుకూడా వారిలోనే వున్నారు. సామాన్యమైన రైతులంతా మహమ్మదీయులు. ఫ్యాక్టరీలలోని కూలీలు మహమ్మదీయులు; షాపులలోని పనివాళ్ళు ముస్లిములు. కుటీర పరిశ్రమలలో హెచ్చుమంది ముస్లిములు. చలికాలంలో వస్తువులు చేసికోవడం – యాత్రికుల సీజనులో అమ్ముకోవడం. సహకారోద్యమం బలిష్టంగానే వున్నది. ప్రభుత్వ ప్రాపకం నిండుగా వున్నది.

కాశ్మీరు ముస్లిముడు ఎంతసాధువు! యాత్రికులంటే ఎంత గౌరవం! మా 'షికార్' నడుపుతున్న ఒక ముస్లిం కష్టజీవి ఎన్నిమాటలు చెప్పాడు! ఉర్దు ఎంత చక్కగా ఉచ్ఛరిస్తాడు. ఆ మాటలలో ఎంత సౌమ్యత! ఆ వాగ్ధోరణి ఎంత లాలితం. తేజోవంతమైన ఆతని ముఖమండలం ఆతని మనోభావాన్ని ఎంత స్పష్టంగా ప్రకటిస్తూంది. ఒక్కడే 'షికార్'కి తెడ్డువేస్తున్నాడు. ప్రశాంతమైన నిశ్చల సరస్సులో షికార్ హుందాగా ముందుకు సాగిపోతూంది. "అదిగో బాబూ నిషాత్ బాగ్" చూడండి అంటాడు. ప్రతిదీ మేము కన్నులు విప్పుకొని అదేపనిగా చూస్తూనే వున్నాం. అలాగే ఎన్నింటినో చూపించాడు. "చూడండి చెమట ఎలా కక్కుతుందో శరీరం" అన్నాడు అమాయకంగా–' ఎందుకు? అన్నాను అప్రయత్నంగా – "కష్టపడతాం బాబూ – ఈ నాలుగైదు మాసాలేగా."

'తర్వాత ?'

'పొట్టలో కుంపటి పెట్టుకొని ఇంట్లో కూర్చోవలసిందేగా' నిట్టూర్చుతూ అన్నాడు

"ఇంకెవరూ పనిచేసేవాళ్ళు లేరా యింట్లో ?"

'లేకేం బాబూ - నా భార్య ఎంబ్రాయిడరీ పని చేస్తుంది,'

'జీవనం బాగా గడుస్తుందా ?'

'అంతా మీలాంటి షావుకార్ల (సేట్) అన్నాడుదయ'

'నేను షావుకారును కాదే'

'మరి ఇంతదూరం ఎలా రాగలిగారు బాబూ ?'

'మేమూ కష్టజీవులం - రైతులం - మా కొద్ది సంపాదనలో మిగుల్చుకొని దేశాటనం చేస్తున్నాం మిమ్మల్ని, మీ దేశాన్ని చూద్దామని వచ్చాం'

'శుక్రియా సాబ్' అన్నాడు సంతోషంగా.

'మరి పాకీస్తాన్ ప్రభుత్వమైతే మీ జీవితం యింకా మెరుగ్గా వుంటుందేమో' అన్నాను తమాషాగా.

'యేతో మైజాన్‌తా నై' అన్నాడు అమాయకంగా.

'ఏంచేత, మీ ముస్లిం రాజ్యంతో చేతులు కలపాలని లేదా !'

'ఇండియన్ యూనియన్‌నుంచి లక్షలమంది యాత్రికులు వస్తున్నారు. లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఈ నాలుగు నెలల భత్యం 12 నెలలకు సరిపోతుంది. ఒక్కొక్క సేట్ రోజుకు రు 25/- లు గూడా ఇస్తాడు. పాకీస్తాన్‌తో కలిస్తే ఇండియా

యూనియన్‌నుంచి యాత్రికులు రాడుగదా !' 'పాకిస్తానీయోం హమారే పేట్ పర్ లాత్ మారేగా' అన్నాడు. ఆశ్చర్యం ! ఆతని నేత్రాలు నిప్పులు కక్కాయి.

'దేఖో సాబ్ ! ఆజాద్ కాశ్మీర్ కా హాలత్ దేఖో ! భూఖోం ప్యాససే తడప్ రహీహై' (చూడండి అజాద్ కాశ్మీర్ దుస్థితిని - ఆకలి దప్పులతో అలమటించిపోతూంది )

'నీ కెలా తెలుసు ?'

'నాకు తెలిసిన దోస్తు ఒకడున్నాడు. పాకిస్తాన్ వ్యామోహంతో అజాద్ కాశ్మీరుకు ఆదిలోనే పారిపోయాడు. భోగట్టా చేస్తే ఇప్పుడా కుటుంబం ఆ గడ్డమీాదనేలేదట. ఆకటిచిచ్చులో తిరుగుబాటు చేస్తే నూతమార్చబడ్డారని వర్తమానం......' సజలనేత్రాలతో - ‍గద్గదకంఠంతో నాకు వినిపించిన ఆ కథనం లోకాని కెలా తెలుస్తుంది !

అతడుఇక మాట్టాడలేదు - నేను మాట్టాడించనూ లేదు. షికారీ డాల్ సరోవరాన్నంత కలయతిరిగింది. మధ్య మధ్య ఆగాము - ఉద్యానవనాలను చూసేందుకు.

తోటల్లో ఆపిల్, ఆల్‌మండ్ చెట్లను చూశాము. చెట్టుకొకరు కాపలివున్నారు. ఉద్యానవనాల్లోని గులాబిపువ్వుల సువాసన ఘుమఘుమల మత్తులో ప్రపంచాన్ని మరచిపోయాం. రకరకాల, రంగురంగుల - చిత్రావిచిత్రాల పుష్పజాతులు ఈ ప్రకృతిలో యిన్నాళ్ళదాకా మనకు కనుపించకుండా ఎక్కడ దాగొన్నాయా అనిపించింది. ప్రకృతి మనమున్న దే కాదు. ఇంకా ఎంత వున్నదో - ఎక్కడ దాగొన్నదో ! ఔను మరి! ఈ విశాల విశ్వంలోని ప్రతివాక్క మానవునికీ-ప్రతినిత్యమూ

ఈ మహత్తర సృష్టి రహస్యమంతా కనిపిస్తే - అందులో విశేషమేముంటుంది! ఎప్పుడూ కొన్ని మానవున కందకుండా ప్రచ్ఛన్నంగా వున్నప్పుడే-అన్వేషణసాగుతుంది. క్రొత్తదాన్ని కనుగొన్నప్పుడు మానవుడు తృప్తిజెందుతాడు - ఉప్పొంగి పోతాడు.

1587 లో అక్బరుపాదుషా కాశ్మీరును జయించిన తర్వాత తాను స్వయంగా నిర్మింపజేసిన మొగల్ గార్డన్సు, నశీమ్ గాగ్, ఆయన కుమారుడు - మొగల్ సామ్రాజ్య వారసు డయిన జహంగీర్ నిర్మించిన 'శాలీమార్' ఆతర్వాత మొగల్ పాదుషా, జహంగీర్ కుమారుడు షాజహాన్ నిర్మించిన 'చష్మాషాహీ' మొదలైన ఉద్యానవనాలన్నీ డాల్ లేక్‌ను చుట్టుముట్టివున్నాయి. డాల్ సరస్సునుండి ఆ వనసందోహాల శోభను చూచినా - ఆ వనాలలోనుండి డాల్ సరోవర మనోహరదృశ్యాన్ని వీక్షించినా - మన హృదయంలో - మన అనుభూతిలో తొణికిసలాడేవి. 'అందం - ఆనందమే, అవి కాశ్మీరులోయ ప్రకృతిశోభకు మణి మాణిక్యాలయి వెలుగొందుతున్నాయి. అనంత ప్రకృతిమాత సిగలో పూలు తురిమి నట్లుగా - మెడకు పుష్పాభరణాలనలంకరించినటుగా వున్న దనడంలో అతిశయోక్తి యేమున్నది?

ఒక్కనాటికే యింతటి అపూర్వఅనుభూతిని పొందాము

# హిమగిరులలో విహారం

మరునాడు మా కార్యక్రమం అనంత ప్రకృతితో సమాగమం. శ్రీనగర్ పరిసరాల ప్రకృతి ఔచిత్య సందర్శనానికి పురోగమించాము. నగరానికి 20 మైళ్ళ దూరంలోని గుల్మార్గ యాత్రికులకు ఒక క్రీడా మైదానం. నలువైపులా పర్వత పంక్తులు-అంచుల్లో పచ్చిక బయళ్లు - నడుమ సువిశాలమైన మైదానం. సముద్ర మట్టానికి 8,500 అడుగుల ఎత్తు. తాన్‌మార్గ్ వరకు బస్సులో వెళ్ళి - మిగిలిన నాలుగు మైళ్లు గుర్రాలమీద ప్రయాణం సాగించాం. గుల్మార్గ రాస్తా వెంట నడక సాగిస్తూవుంటే నాగపర్వత పంక్తుల అపూర్వదృశ్యం కనుల పండువుగా కనిపిస్తుంది. గుల్మార్గలో ఆధునిక వినోద విలాసాలకు అవసరమయ్యే అన్ని సౌకర్యాలూ లభిస్తాయి అక్కడనుండి 200 అడుగుల ఎత్తులోనున్న ఖిలన్ మార్గకు గుర్రాలమీదనే అందమైన దేవదారు వృక్షారణ్యం గుండా ఎక్కాము సాయం తన సూర్యకిరణాలకు హిమశిఖరాలు పరావర్త మొందుతున్నాయి. మంచుశిఖరాలనుండి చిన్న చిన్న పిల్లకాల్వలు కిలకిలారావంతో చంటివాడు గెంతినట్టుగా గెంతుతున్నాయి. మంచుకొండ ఎక్కాము మంచుతో ఆడాము. ఆ పర్వత పంక్తుల వెనక భాగంలో నాగదేవత సరోవరమున్నది. ఆ సరోవరాన్ని చూచే భాగ్యం మాకు కలుగలేదు. సాయంత్రం 5-30 గంటలకు తిరుగు మార్గం పట్టాము. గుల్మార్గదాటగానే కారుమేఘాలు భయంకరంగా చుట్టుముట్టాయి. భయంకరమైన ఉరుములు మెరుపులతో బాటు జడివాన ప్రారంభమైంది. 'పోనీ'ల మీద నేము

ముద్దయ్యాము. ఆ జడివానకు ప్రాణాలను బిగబట్టుకొనే తాన్ మార్గ్ చేరుకున్నాము. ఎలాగైతేనేం రాత్రి 9 గంటలకు మకాం చేరాము. వచ్చి చూద్దుముగా – మాగుడారాలు నేలమట్ట మయ్యాయి. ఆ తుపాను వర్షానికి డేరాలు ఆగలేదు. డేరాలలోవున్న కొందరు మా యాత్రికులను పక్కనేవున్న ముస్లిం సోదరుడు తన భవనంలోనికి సురక్షితంగా చేర్చాడు. కొందరు హోటళ్లలో చేరారు. ఆ రాత్రి మా పని అయోమయం–ఒకరి కొకరికి సంబంధంలేదు. తెల్లవారగానే తిరిగి ఎక్కడెక్కడ తలదాచుకొన్నవాళ్లు మా జూరీబాగ్ చేరుకున్నారు. తిరిగి డేరాలు మరమ్మత్తు చెయ్యబడ్డాయి.

ఆ సాయంత్రపు గాలివానలో డాల్ సరోవర మధ్య భాగంలో చిక్కుకపోయిన కొందరు యువకులు (అందులో వాహిని ఎడిటరు శ్రీ ఉమామహేశ్వరరావుగారు కూడా వున్నారు) సురక్షితంగా క్యాంపుకు చేరగలగడం అదృష్టం.

శ్రీ నగరుకు 67 మైళ్ళ దూరంలో వున్న భూలోక స్వర్గమని ప్రసిద్ధి గాంచిన 'పహెల్ గామ్'ను మా రైతులు చాలామంది సందర్శించారు.

కాశ్మీర్ లోయలో నాలుగు ముఖ్యనగరాలున్నాయి. వాటిలోపెద్దది శ్రీనగర్. మిగిలిన మూడు పట్టణాలు బారాముల్లా. సోపార్, ఇస్లామాబాద్. జీలంనది లోయను తప్పించుకొని బాహ్యప్రపంచంలో పడేచోట బారాముల్లా పట్టణమున్నది. ఇచ్చటి జనాభా 7 వేలు. ఈ పట్టణానికి పురాణగాధ ఉన్నది. శ్రీ మహావిష్ణువు వరహావతారంలో సనకాసురుని సంహారించి

భూమాతను - వేదాలను రక్షించినచోటు అది. అచ్చటే వరహామూర్తి ఆలయమున్నది.

బారాముల్లాకు ఎగువన 10 మైళ్లలో జీలంనదీతీరంలో సోపార్ పట్టణమున్నది. దీనిజనాభా 10 వేలు. ఈ పట్టణం నదికి ఇరువైపులా కట్టబడి ఉన్నది.

ఇస్లామాబాద్ శ్రీనగర్‌కు 33 మైళ్లదూరంలో ఉన్నది. దీన్నే "అనంతనాగ్" అంటారు. ఇక్కడ వేడి నీటిబుగ్గలు జాస్తి. హిందువులకు పవిత్రతీర్థం. జనాభా 10 వేలు.

శ్రీనగర్ కాశ్మీర్ లోయ మధ్యలో ఉన్నది. జీలంనదికి ఇరువైపులా మూడుమైళ్లు విస్తరించి ఏడువంతెనలచే విభాగింపబడి ఉన్నది. నగరానికి మైలుదూరంలో 1000 అడుగుల ఎత్తునున్న శంకరాచార్యుని కొండమీదినుండి పక్షిదృష్టిలో నగర దృశ్యం మనోహరంగా ఉంటుంది. సుమారు 50 మైళ్లనిడివి 20 మైళ్లు వెడల్పుగల కాశ్మీరులోయ వంకరటింకర వాగులు - సరోవరాలు - మైదానాలు పచ్చని వరిపైరులుతో నయనానందకరంగా గోచరిస్తుంది. ఆ కొండమీదనుండి మనదృష్టి భాను కిరణాలకు పరావర్తనం చెందే జీలంనది శీతలోదకం పై పడుతుంది.

ఈ కొండపై పురాతన హిందూ ఆలయమున్నది. ఈ కొండను ముస్లింలు "తక్తీ - ఇ - సులేమాన్" అంటారు ఈ ఆలయం ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క ధర్మానికి ఆశ్రయమైంది. సుమారు 4600 సంవత్సరాలక్రితం అప్పట్లో కాశ్మీర్ నేలుచున్న రాజా సందీమానుడు నిర్మించాడు. మారుసుమారు 2400 సంవత్సరాలక్రితం దీనికి గోపాదిత్యుడు మరా

మ్మత్తులు చేయించాడు. 2200 సంవత్సరాలక్రితం అశోకుని మనుమడు జాలకుడు దాన్ని బౌద్ధాలయంగా పరిమార్పు చేశాడు. 1200 సంవత్సరాలనాడు లలితాదిత్యుడు తిరిగి మరామ్మత్తు జేయించాడు. 8 వ శతాబ్దంలో శంకరాచార్యుడు అచ్చట వైదిక ధర్మాన్ని పునః స్థాపించాడు. మహమ్మద్ ఘజనీ ఇందులో ప్రార్థనలు చేశాడు. అందుకే దీన్ని "అల్లా పీఠం'' అన్నారు ముస్లింలు.

శంకరాచార్య కొండకు తూర్పున- డాల్ సరోవరానికి ఆనలివైపున 700 అడుగుల ఎత్తులో "హరిపర్వత" మున్నది. ఈ రెండు కొండలమధ్యనే శ్రీనగర్ పట్టణం నిర్మింపబడిఉన్నది దీనిపైగూడా ఒక పురాతన హిందూ ఆలయం, సిక్కులకోట పరివేష్టితమై ఉన్నవి.

ఈ పర్వత శిఖరంలో ఒక రంధ్రంనుండి ఉద్భవించి మానవులను భయభ్రాంతుల్ని చేస్తున్న దైత్యులను దుర్గామతల్లి సంహరించినది ఇచ్చటనేనని చెప్తారు.

కాశ్మీరులోయ మనుషులను గురించి ఒక్కమాట చెప్పాలి సామాన్యజనాల విషయమే నా మనస్సు కెలుకుతూంది. మురికి దుస్తులమధ్య కాశ్మీరు యువతుల సౌందర్యం- బురద నీళ్లలో ముత్యంలాగా మెరుస్తుంది. శరీరాన్నంతాకప్పే ఆ మురికి వస్త్రాలమధ్య అతిసుందరమైన, అత్యంతకోమలమైన ఆముఖం - ఎంతగా ప్రకాశిస్తుంది! కోటేరులాంటిముక్కు - పాలుగారే గులాబీరంగు బుగ్గలు- తమలపాకులవంటి పెదవులు, వెడల్పాంటి ఫాలభాగం, విశాలమైన నేత్రాలు, నొసట కుంకమ లేకపోయినా ప్రకాశించేముఖం - అందమైన పరిశుభ్ర

మైన దుస్తులు ధరిస్తే... దేవతాకన్యలను మరపించరా ! అది అచ్చమైన ఆర్య సంతతి అని చెప్పక చెప్పవచ్చునుగదా ! వాళ్ళ అందాన్నిచూస్తే మనం సిగ్గుపడాలేమో ! అంత అందంలోనూ - ఆ సామాన్య స్త్రీలలో ఎంతటి అమాయకత్వం ! ఆ చూపులలో ఎంతజాలి. ఆ నడకలలో ప్రవర్తలోన ఎంత నిరాడంబరం ! 'వాళ్లు మన దేశం వస్తే వుండిరలరా !' అని గూడా అడక్కపోలేదు మాలోని కొందరు.

మరొక విశేషం – శ్రీనగరులో షాపింగ్. ఉన్ని, సిల్కు దుస్తులు – కంబళ్లు, చేతి పనిముట్లు దాదాపు మా రైతులు రు 30,000 వేలు విలువజేసే వస్తువుల్ని కొన్నారు. అందుకే కాబోలు ఆ షికారీవాలా. ఇండియా యూనియన్ నుండి వచ్చేవారంతా 'సేట్లు' అని భ్రమపడ్డారు.

ఎన్నో చిత్రాలు చూశాం. ఆదివారం శ్రీనగరులో ఆనందానుభూతిని పొందాము. అయితే బహిరంగ ప్రదేశాల్లో కిల్లీబడ్డీలలాగా ఎక్కడపడితే అక్కడే మాంసం – చేపలు అమ్మడంచూస్తే – మా రైతులకు అదోమాదిరి అనిపించింది. వ్యవధిచాలక యింకా ఎన్నింటినో వదిలివేశాం - ఇంతకూ రానూ- పోనూప్రయాణం పోగా నాలుగు రోజులేకదా అక్కడ వున్నది. కాగా టూరిస్టు ఆఫీసర్ల యేర్పాట్లు సహకారం సంతృప్తికరంగా లేక కొంత సమయం వృధా కావడమే కాకుండా– ఎన్నో వ్యయ ప్రయాసలుల్ని గూడా అనుభవించక తప్పలేదు

మా అనుభవాన్ని బట్టి శ్రీనగరులో యాత్రిక సమాచార కార్యాలయ కార్యక్రమాన్ని మరింత సుదృఢంగా - సమర్థవంతంగా సాగించుటకు చర్య తీసుకోవడం అవసరం. అది 'యాత్రిక కేంద్రం' కదా మరి !

4 వ తేదీ సాయంత్రం 4 గంటలకు తిరుగు ప్రయాణం సాగించాము. 5 వ తేదీ సాయంకాలానికి పటాన్ కోట చేరుకున్నాము. ఏమైనా కాశ్మీర్ యాత్ర మధురానుభూతి - ఇప్పటికీ మా హృదయఫలకంలో జిగేలుమంటూనే వుంది "మళ్ళీ ఒకసారి పోవాలనిపిస్తోంది" అని అప్రయత్నంగా అన్నారు అనేకమంది.

# చరిత్రపుటల్లో పంజాబు

బలపరాక్రమాలకు దేశభక్తికి, జాతీయ విప్లవాలకు, సహజసంపదలకు పేరెన్నికగన్న పంజాబు రాష్ట్రంలో నాలు గురోజులు గడపటం మా అదృష్టం. హిస్సార్, పటాన్‌కోట, "అమృతసర్, భాక్రా- నాంగల్- మొత్తం నాలుగు ప్రదేశా లలోనూ నాలుగు రోజులు గడపటం -' పంజాబు రాష్ట్రాన్ని అ కొసనుంచి ఈ కొసకు తిరిగినట్లనిపించింది.

ఒకనాడు పంజాబు ప్రజలు అధ్యాత్మికచింతన, దైవ భక్తితో శాంతి, సుఖం, భక్తి, ముక్తి తమ సొమ్ముగా జీవి స్తూవుండేవారు. కాని దురదృష్టవశాత్తు పరిస్థితుల పరిభ్రమ ణంలో ఆప్రాంతం రణరంగాలకు, మారణహోమాలకు, అశాంతికి ఆలవాలమై పోయింది. కాలపురుషుడు భక్తిప్రమత్త మైన ఆ జాతిని రణరంగ కోవిదులుగా, బలపరాక్రమ శౌర్య యశోవంతులుగా పరిమార్పుచేయడం ఆశ్చర్యం. పంచనదుల పావనోదకాలతో సస్యశ్యామలంగా వర్ధిల్లుతూవుండిన ఆ పుణ్య భూమి నిరంతర రణదుందుభులతో - పాశవిక సైనిక సమూ హాల పాదఘట్టనలతో - అశాంతిఘోషలు - హాహాకారాలు, కరువురాకాశి కంకాళ నృత్యాలతో - దద్దరిల్లి పోయింది. ఒకనాడు అది గ్రీకుదండుకు సైనికశిబిరమైంది. సికందర్ దండ యాత్రలో జీలంనది రక్తసిక్తమైంది. కానీ ప్రపంచంలో తన శక్తి కెదురు లేదనిపించుకొన్న అలగ్జాండరు చక్రవర్తి జీలం నదీ లోయలో పురుషోత్తముని పరాక్రమానికి తలవంచవలసి వచ్చెనుగదా! ఆ ప్రళయభీకర సంగ్రామం ఆ యిద్దరు భూప

తులకు శాశ్వత మైత్రిని చేకూర్చిపెట్టినది గదా! గ్రీకు చక్రవర్తి పురుషోత్తముని సోదరిని పెండ్లాడి - హైందవ - గ్రీకు సంస్కృతికి పునాదులు వేశాడు. తక్షశిల విశ్వవిద్యాలయంలో గ్రీకు సంస్కృతి పఠనాంశమైంది. ఇది 2500 సంవత్సరాలనాటి చరిత్ర. ఆ నాటి సింధునదీ లోయ సంస్కృతి, నాగరికతకు చిహ్నాలు ఈనాటికీ "హరప్పా, మొహంజదారో, తక్షశిల" లో కన్పిస్తున్నాయి గదా! అప్పట్లో, ఆజాతి, ఆప్రాంతం ఉత్తమ సంస్కృతికి, ఉన్నత సంప్రదాయాలకు, ఉత్కృష్ట నాగరికతకు, శాంతి సౌఖ్యాలకు, భక్తి ప్రబోధాలకు ప్రాశస్త్యాన్ని పొంది వున్నది.

కానీ ఆ శాంతిమయ ప్రపంచంలో మహమ్మదీయుల దాడితో తిరిగి మారణహోమం ప్రారంభమైంది. విదేశీయుల దోపిడీలు విచ్చలవిడిగా సాగాయి. మరల పంచనదుల పుణ్యభూమి, సింధునదీలోయ అశాంతికి ఆలవాలమైంది. మహమ్మదీయుల యుగం ఆ యశాంతి జ్వాలలోనే అంతరించింది. మొగల్ సామ్రాజ్యం అవతరించింది. అక్బర్ చక్రవర్తికాలంలో శాంతిబీజాలు నాటబడ్డాయి. సుప్రసిద్ధమైన అమృతసర్ సువర్ణాలయం (Golden temple) ఆ చక్రవర్తి హయాంలోనే నిర్మించబడింది. కానీ జహాంగీర్ పరిపాలనా కాలం - పంజాబు చరిత్రను - సిక్కుల మానసిక తత్వాన్ని, పునాదులతో సహా మార్చివేసింది.

ఒకనాడు శిక్కుజాతి శాంతి కాముకులైన దైవభక్తిపరాయణులు. కడుపులోచల్ల కదలకుండా ఇష్టదేవతారాధనతో కాలక్షేపం జేసేవారు. సిక్కుల పంచమగురువు 'అర్జున్'ను

జహాంగీర్ చిత్రవధ చేయించడంతో ఆజాతి సహనం కోల్పో, యింది అంతవరకూ ఆధ్యాత్మిక జాతిగావున్న సిక్కులు ఆనాటినుండే పరాక్రమశాలురుగా పరిణతి చెందుతూ వచ్చారు. ఆరవగురువు "హరగోవింద్" మొగల్ సైనికులతో నిరంతరం యుద్ధాన్ని సాగిస్తూనేవచ్చాడు.

తొమ్మిదవ గురువు "తేజ్ బహదూర్"ను ఔరంగజేబు పదభ్రష్ఠుణ్ని గావించి - 'ఇస్లాం'ధర్మాన్ని స్వీకరించమన్నాడు. 'తేజ్' అందుకు నిరాకరించగా దారుణంగా కాల్చి చంపబ బడ్డాడు. సిక్కుల క్రోధానికి అంతులేకపోయింది. దశమగురువు 'గురుగోవిందసింగ్' నూతన ధోరణిలో సిక్కు శక్తిని యిను మడింప జేశాడు 'ఖాల్సా' దళాన్ని నిర్మించాడు. పోగాకు, త్రాగుడు విసర్జించారు 'సింగ్' (సింహము) అప్పుడే సిక్కు లకు సార్థకమైనది. "కేశ్, కాచ్, ఖరా, కిర్పాన్, కాంగా" (పొడవుపాటి జుత్తు, పొట్టి లంగోటాలు, ఇనుపకడెము, చిన్న బాకు, దువ్వెన) వారికి వీరచిహ్నాలుగా నియమించుకున్నారు. గురుగోవిందసింగ్ నాయకత్వాన, ఆ తర్వాతవచ్చిన గురు బందాష్ నాయకత్వాన సిక్కుల శక్తి విజృంభించింది. యుద్ధాలు చేశారు.సర్‌హింద్ లాంటి పట్టణాలను ఆక్రమించుకున్నారు.కానీ అందరు గురువులు వధింపబడ్డారు. అయినా శిక్కుల శక్తి ఆనాటికీ, ఈనాటికీ మొక్కవోలేదు. సిక్కుల పౌరుషం, విజాయితీ క్రమశిక్షణ, నియమాలు, ఆచారాలు. ఎన్నియుగాలకైనా మార్పు జెందగలవా !

వీరపూజలో ఆజాతికిగల విశ్వాసం - గురువులపట్ల వారికిగల భక్తిప్రపత్తులు - ఆచారాల మొడల వారికిగల

సమ్మేళనాలు - నియమాలయందు వారిలో పాతుకపోయిన ప్రాముఖ్యం - అమృత్ సర్ సువర్ణఆలయంలో వారుజరిపే పూజా పునస్కారాలు చూచినవారికి తేటతెల్లము కాగలదు. ఆ ఆలయంలో అమలు జరుపబడుతున్న క్రమశిక్షణ గణనీయం. తలకుపాగాలేని వారెవ్వరూ దాని ఆవరణంలోనైనా ప్రవేశానర్హులే. సువిశాలమైన కొలనుమధ్యలో నిర్మించిన ఆ బంగారు దేవాలయం సిక్కుమతానికి శాశ్వతచిహ్నం. అందులో గురువుల సమాధు లున్నాయి. పూజా పునస్కారాలు - ధూపదీప నైవేద్యాలు - భక్తిగీతాపారాయణ లు సర్వవేళలయందూ జరిపించబడ వలసిందే.

పంజాబీయులు అవమానంకంటే మరణాన్నే ఆహ్వానిస్తారు. ఒక్క రణరంగంలోనేకాదు. సర్వవిషయాలలోనూ వారి దృష్టి అంతే. మతాంతీకరణ, రాజకీయ పరాధీనత, సాంఘిక హీనసత్వం పంజాబీయులకు ప్రధాన శత్రువులు.

ఆర్యులు సప్తసింధు ప్రాంతాన్ని ఆక్రమించుకొన్నప్పటి నుండీ పరాయి పెత్తనం, ఆధిక్యతలపై వారిప్రతిఘటన ప్రారంభమైంది. ఆనాటి వైదిక, బ్రాహ్మణ మతగురువుల్ని వారు తీవ్రంగా ప్రతిఘటించారు. ఆ నాటికీ ఈ నాటికీవారి తత్వమిదే. మహాభారతాన్ని వ్రాసిన ఆర్య పౌరాణికవేత్త పంజాబీయులను గురించి ఇలా అన్నాడు.

'రాచరికంలేని అరాచకంలో-బ్రాహ్మణులులేని అబ్రాహ్మణ వాతావరణంలో కుగ్రామాలలో, చిన్న చిన్న ముఠాలుగా, నిరంతర యుద్ధాలతో నివసిస్తూఉండేవారు' అని

స్వేచ్ఛాయుతమైన సాంఘిక కట్టుబాట్లు, మతైక నియమాలు, స్వాతంత్ర్య జీవనం వారి ప్రకృతి. అందుకే ఆర్యులు వారిని 'అత్యంత అనాగరిక జీవులు' అన్నారు. 'బ్రాహ్మణులు లేరు సరికదా కులాలుకూడా నాస్తి' అన్నారు. 'పంజాబీయులకు వేదాలంటే గౌరవం పూజ్యం. యజ్ఞయాగాదులకు వ్యతిరేకులు. దేవునికి బలులిచ్చేవారు కాదు. అతి మోటుమనుషులు. అనాగరికులు నియంలేని త్రాగుడు, మాంసభక్షణ విపరీతం' అన్నాడు మహాభారత కృతికర్త.

అలగ్జాండరు ఆ భూమిపై దండయాత్ర చేసినప్పుడు ఆయన కనుగొన్న విషయంఇది'' "గ్రీకు దేశంలోవలె చిన్నచిన్న ప్రజాస్వామిక పరగణాలుపంజాబులో ప్రవర్ధమానమైఉన్నాయి. ఆ భూమి సారవంతమై, సస్యశ్యామలమై స్వయంసమృద్ధమై, స్వాతంత్ర్యంతో విరాజమానమౌతున్నది.'

పంజాబీయులలో పాతుకొనియున్న స్వాతంత్ర్యకాంక్ష స్వేచ్ఛాయుతమైన ప్రజాజీవిత వ్యవస్థ అలగ్జాండరు బ్రహ్మాండమైన సైన్యాన్ని పరాభూతుల్ని జేసింది. సింధు-గంగాలోయల సస్యశ్యామల భూముల్ని, భారతావని గణనీయ సంపదను తమకు పంచిపెట్టెదనని సికందరు తన సైనికులకు వాగ్దానాలపై వాగ్దానాలు చేసినప్పటికీ, పంజాబీ ప్రజల స్వాతంత్ర్యేచ్ఛతో కూడిన శౌర్య, బల, దర్పాలముందు గ్రీకు సైనికబలం తాళ లేకపోయింది. అలగ్జాండరు తిరోగామియయ్యాడు. తర్వాత అలగ్జాండరు గవర్నరైన 'మెసిడోనియన్' ను పంజాబీయులు సులభంగా పరాజితుణ్ణి గావించి యమలోకానికి పంపించారు. గ్రీకుసైనిక పటాలాలు చెల్లాచెదరయ్యాయి. లొంగిపోయాయి.

క్రీస్తుకుపూర్వం 2వ శతాబ్దం మొదలు క్రీస్తుశకం 6వ శతాబ్దం వరకు పార్థియనుల, సిధియనుల, హూణుల దండయాత్రలు ఉద్ధృతంగా సాగాయి. 711లో మహమ్మదీయుల దండయాత్రలు ప్రారంభమయ్యాయి. మహ్మద్ బిన్ కాసిం సింధును ఆక్రమించుకొని భారతభూమిలో ముస్లిం పరిపాలనకు ప్రారంభోత్సవం చేశారు. మహమ్మద్ ప్రవక్త నిర్యాణానంతరం 80 సంవత్సరాలకే ప్రపంచంలో మహమ్మదీయ శక్తి విజృంభించింది. అరేబియా, పర్షియా, సిరియా, పశ్చిమటర్కిస్తాన్, సింధు, ఈజిప్టు, దక్షిణ స్పెయిన్‌లకు తిరుగులేని అధినేతలయ్యారు. అది మహమ్మదీయ సిద్ధాంతబలం. ఈ విశాల విశ్వానికి "ఏకో నారాయణుడొక్కడే" "దేవుని దృష్టిలో మానవులంతా సమానులే" నన్న ఒక నూతన పంథా విశ్వ ఇతిహాసంలో ఒక ప్రత్యేకస్థానాన్ని ఏర్పరచుకొన్నది. ఈ సిద్ధాంతపు ముసుగులోనే సామ్రాజ్యాలు వెలిశాయి. విస్తరిల్లాయి. అంతేకాదు. మతం పేరతో భీషణ మారణహోమం జరిగింది – ఈ సిద్ధాంతపు నీడనే. మహమ్మద్ ప్రవక్త పుట్టిన ప్రదేశం – మెట్టిన వాతావరణం భయంకరమైంది. దాన్ని మార్చాలంటే వివిధ ప్రయోగాలను చేయవలసి వచ్చింది. ప్రవక్త కత్తిబట్టి యుద్ధాలుగూడా చేశారు. ప్రవక్త శిష్యులు – హాస్సన్ – హుస్సేన్ అనేవాళ్ళు మతయుద్ధాలలోనే మృత్యువాతపడ్డారు. అందుచేతనే మహమ్మదీయ ధర్మవిస్తరణకు మారణయుద్ధాలు – దారుణ హింసాకాండ ప్రధాన ఆయుధాలయ్యాయి. 'జీహాద్' మత విస్తృతికి సాటిలేని నినాదమైంది – ఆనాటికీ – ఈనాటికీ గూడా.

'జీహాద్' కై పుత్తో మహమ్మదీయులు మధ్యప్రాచ్యాన్నంతా ఆక్రమించుకొనేందుకు అట్టేకాలం పట్టలేదు. అయితే అంత ఉరవడిగా ఇండియాలో ఇస్లాంను విస్తరింప చేయుటకు వీలుపడలేదు జీహాద్ విజృంభణ సింధుదాటగానే పంజాబులో చావుదెబ్బ తిన్నది. మహమ్మదీయులు పంజాబులో కాలు నిలద్రొక్కుకొనేందుకు 250 సంవత్సరాలు పట్టినది, 711 లో ప్రారంభమైన మహమ్మదీయుల దండయాత్రలు 960 నాటికి "ఘజనీల" నాయకత్వాన ఫలితానికొచ్చాయి. 960—1189 మధ్య మొట్టమొదటి మహమ్మదీయ రాజ్యం పంజాబులో నెలకొన్నది. రెండున్నర శతాబ్దాలపాటు పంటరిగానే పంజాబీయులు మహమ్మదీయుల్ని ఎదుర్కొంటూ వచ్చారు.

మొత్తంమీద ఇండియాలో ఇస్లాం సామ్రాజ్యం ఏర్పడింది. గురునానక్ విమోచనోద్యమం ప్రారంభ మయ్యేంతవరకూ మహమ్మదీయులకు ప్రతిఘటన ఒక సంఘటితస్వరూపంలో సాగలేదు. అప్పటికి భారతీయులు అలసిపోయి ఉన్నారు.

గురునానక్ పంజాబు చరిత్రనే మార్చివేయ గలిగాడు నానక్ కేవలం మహర్షిమాత్రమేకాదు. అందరు సెయింటుల వలె ఆయనధ్యేయం కేవలం ప్రార్థన, యోగాభ్యాసం, ముక్తి మాత్రమేకాదు. నానక్ ప్రజల మనిషి. ప్రజలతో కలిసి పోయాడు ప్రజావాణిని ప్రతిధ్వనింప జేశాడు. నానకే ప్రజలు ప్రజలే నానక్. ఆనాటి రాజకీయ, సాంఘిక వ్యవస్థలో ప్రజల స్థితికి ఆయన హృదయం ద్రవించింది. ఆయన కదిలాడు.

'రాజులు కసాయివాళ్ళు క్రూరత్వం వాళ్ళకత్తి.
ధర్మం, కర్మం రెక్కలు కట్టుకొని

ఎగిరిపోయి నీలాకాశంలో లీనమయ్యాయి
నీలమేఘాలనుండి వర్షధారల్లా
కార్చాయి కన్నీటిని.
అబద్ధం, అవినీతి ప్రబలిపోయాయి -
కాళరాత్రిలో కారుచీకట్లు కమ్మినట్లు.
సత్యం అనే చంద్రుడు కారుమేఘాల్లో
కనపడకుండా దాగొన్నాడు.
సత్యంకోసం వెతికి వెతికి అలశాను
కనుచూపుమేరలో అది కనుపించదే!
ప్రపంచానికి సంధిగుణం పుట్టింది
దీన్ని రక్షించే మార్గమేదో!'
అంటూ కన్నీరు కార్చాడు గురునానక్.

బాబర్ దండయాత్రలో చిందిన రక్తానికి భారతభూమి తడిసిపోయింది. జరిగిన అకృత్యాలకు ప్రకృతి విలపించింది. ఆ ఘోరకలిని ప్రస్తావించి నానక్ ఇలా అన్నాడు.

'అదిగో పెండ్లివారు బారులు తీరిపోతున్నారు
ఆ పెండ్లికూతురుకు రక్షణ ఉందా ?
అదుగో మొగల్ రక్కసి మూకలు
వధించారు పెండ్లివారిని
దోచుకున్నారు నగనాణ్యాల్ని
బంధించారు పెండ్లికూతుర్ని
పాపం!
నిన్న పసుపుగుడ్డల పెండ్లికూతురు

నేడు మొగలాయి సౌధంలో ఉంపుడుగత్తె
గర్వం విలయతాండవం చేస్తూంది.
ధర్మం అంతరించింది
మతం మటుమాయమైంది.
కండ్లకు కనుపించేదీ –
చెవులకు వినిపించేదీ
ఒకటే ఒకటి
'అవినీతి'
కాలసర్పం కోరలు చాచింది

ఎక్కడువిన్నా మృత్యువు! మృత్యువు! మృత్యువు!
ఎక్కడచూచినా రక్తం! రక్తం!
అదిగో అంగన –

ఆకృతిలో ఆ అందం మొగల్ సైనికుల స్వంతసొమ్ము
కాదంటే ఆకృతి వికృత మౌతుంది.
ఆ అందమైన నల్లని కేశసంపద
కాలసర్పపు వాడి నాల్కలు – అనే కత్తెరకు బలి
నెత్తిన దోసెడు దుమ్ము
నోట గుక్కెడు మన్ను
అందం అవమానంపాలు
మానం మొగల్ సైనికులపాలు
కాదంటే ప్రాణం కరవాలపాలు
అదిగో బాబరు పరిపాలన
ప్రారంభోత్సవమట

ఆ తరుణంలో అన్నం ముట్టితే వొట్టు
వొట్టంటే ఊచకోతె !'

ఇది సిగ్గుమాలిన తన మన్నాడు నానక్

"బలవంతుడు బలవంతుని ఎదుర్కొంటే నాకేమీ కోపంలేదు. కానీ క్రూరమైన మృగరాజు బలిమిలేని పశువుపై లంఘిస్తే నా మనస్సు చివుక్కుమంటుంది. అప్పుడు ఆ పశువులకాపరి మగతనాన్ని ప్రదర్శించ వలసివుంది" అన్నాడు ఒక సందర్భంలో ఆయన.

తన దేశస్థుల శక్తి సామర్థ్యాలు ఆయనకు సుగ్రాహ్యం. సరైన నాయకత్వం లేక దేశస్థుల శక్తియుక్తులు నివురుగప్పిన నిప్పులా ఉండిపోయాయి. దేశంలో నూతన చైతన్యం రావాలి సమధికోత్సాహంతో ప్రజలు పరాధీనతనుండి విముక్తులయ్యేం దుకు పయనమవ్వాలి – అంటూ ఆయన ప్రబోధాలు సాగించాడు.

మహమ్మదీయుల ఇనుప పాదాలక్రింద భారతీయులు నలిగిపోతున్నారు. నానక్ విమోచనోద్యమ శంఖారావాన్ని పూరించేందుకు ఆయత్తమౌతున్నాడు. వాతావరణం అనుకూలంగా లేదు. ఆయన ఉద్యమం రాజకీయంగా పరాధీనులైన హిందువులకొరకు మాత్రమేకాదు. సాంఘికంగా పౌరోహితవర్గం క్రింద అణగారిపోయిన చరిత్రహీనుల సముద్ధరణకు సన్నద్ధుడయ్యాడు. బ్రాహ్మణవర్గం నానక్‌ను నిరశించింది –

ప్రపించింది. వెలివేసింది. "సంఘవిద్రోహి - మతవిద్రోహి" అని శపించింది. అయితే ఆయనకు దైవంమీద అచంచలవిశ్వాసం. కర్తవ్యంపట్ల అఖండదీక్ష. సంఘ సంస్కరణలో అద్భుతాలను సృష్టించవచ్చునని ఆయన ప్రగాఢవిశ్వాసం. నానక్ దైవాన్ని స్తోత్రం చేస్తూ ఇలాఅన్నాడు.

"భగవానుడు లీలామానుష విగ్రహుడు
మదకరి మస్తకాన్నికోరే మృగరాజును
పచ్చగడ్డిని నమిలించగలడు
మృతజీవుల మాంసాన్ని ఆరగించే
రాబందును
గరికపోచలు కొరికించగలడు
పచ్చిక బయళ్లలో
పచ్చగడ్డిని
పరమాన్నంగా భావించే
పశుగణాలచేత
మదమాంసాలను భక్షింపజేయగలడు
ఆయనది అపురూపశక్తి -
ఈగచే రాజ్యమేలించగలడు
దోమచే సైన్యాలు నడిపించగలడు
ప్రచండ సైనిక సమూహాలను
క్షణంలో మంత్రించి మాయం చేయగలడు"

భయంకర సైనిక కూటాలను చూచి ప్రజలు పారిపోకుండా నూతనోత్సాహాల్ని నూరిపోయుటకు పాడినపాట ఇది.

నానక్ "చాపకూటి సిద్ధాంతాన్ని" (సంగత్) ప్రవేశ పెట్టి సాంఘిక విప్లవానికి పునాదులు వేశాడు. మన పల్నాటి మహాభారతంలో మహిమాన్విత పాత్రనుని ర్వహించిన బ్రహ్మ నాయుడు గూడా "చాపకూటి సిద్దాంతాన్ని అమలు జరిపాడు ఆ సిద్ధాంత రక్షణకే పల్నాడులో బ్రహ్మాండమైన యుద్ధం జరిగింది. నాయకులు, సైన్యాలు హతమయ్యాయి కానీ బ్రహ్మ నాయడు "సార్వజనీన సిద్ధాంతం" మాత్రం అమరమైంది.

ఇలాంటి సార్వజనీన సిద్ధాంతమే గురునానక్ ను ప్రపంచ ప్రవక్తల్లో. కనిగా చేయుటకు కారణమైంది. ఆ బలమైన సిద్ధాంతం నేడనే పంజాబులో ఒక పటిష్ఠమైన 'సిక్కు' వ్యవస్థ ఈనాటికీ ప్రవర్థమానమై ఉన్నది. దానితో నానక్ అమరుడు,అజేయుడు అయ్యాడు.

నానక్ వారసులలో చిట్టచివరివారి గురుగోవిందసింగ్. ఈయన సెయింటు మాత్రమే కాదు. సైనికుడు, నాయకుడుకూడా. నానక్ సిద్ధాంతానికి మెరుగులు దిద్దాడు. క్రమశిక్షణా యుతమైన వ్యవస్థనుస్థాపించాడు. ఆవ్యవస్థనుప్రజాస్వామ్యసిద్దాంతాల పైనడిపించాడు. సిక్కువ్యవస్థ చరిత్రలో ఒక ప్రధాన భూమికను నిర్వహించింది.

దురధికార కాంక్షతో 'శివాళికులు' ఈ యుద్యమంపై దాడిప్రారంభించారు. మొగలాయీలతో కుట్రజేసి ఉద్యమాన్ని వెన్నుపోటు పొడిచేందుకు ప్రయత్నించారు. తత్పర్యవసానంగా గురుగోవిందసింగ్ కత్తి బట్టి కదనరంగానికురుక వలసివచ్చింది. ఈయన మొత్తం పదునాలుగు యుద్ధాలుచేశాడు.

వన్నెండింటిలో విజయాన్ని సాధించాడు. ఈయన సాగించిన విమోచనయుద్ధాలు పంజాబీయులలో మరింత ఉత్సాహాన్ని కలిగించాయి. మొగలాయి చక్రవర్తుల నిరంకుశత్వానికి పంజాబుజాతి సింహస్వప్నమైంది.

ఈయనఅనంతరం బందాసింగ్ నాయకత్వాన పంజాబుజాతి స్వాతంత్ర్యధ్వజ మెత్తింది. మొగల్‌సామ్రాజ్యంపై తోడఁ చరిచింది. కయ్యానికి కాలుదువ్వింది. కదనరంగంలో కదలి పోయింది. తూర్పు పంజాబు [ఇప్పటి ఇండియాభాగం] స్వతంత్రమయింది. దీనితో మొగలాయీలు తోకత్రొక్కిన త్రాచుల్లా విరుచుకపడ్డారు. స్థానికులతో కుట్రలుచేసి వీరుడు బందాసింగు - ఆయన సహచరులను పట్టి బంధించి ఢిల్లీ తీసుకపోయి అగ్నిజ్వాలల్లో మాడ్చి హత్యజేశారు [1716 మార్చి - జూన్].

బందాసింగు అమరత్వం చెందాడు. స్వాతంత్ర్యోపాసకులకు ఆయన పేరు మంత్రోచ్చరణ అయింది. ఆనాడు స్వతంత్ర పంజాబులో ఆయన ప్రవేశపెట్టిన సంస్కారణలు అమేయమైనవి. అగ్రజాతుల అధిక్యతక్రింద అణగిపోయిన "శూద్రులు" ఉద్ధరణను, సంస్కారణలు ప్రవేశ పెట్టినవారిలో ఆది పురుషుడు బందాసింగ్. సంఘంలో, ప్రభుత్వయంత్రాంగంలో కులతత్వాలను రూపుమాపేందుకు తీవ్రచర్యలు గైకొన్నారు. పరిపాలనా యంత్రంలో వెనుకబడిన జాతులకు సముచిత ప్రాతినిధ్యాన్ని కల్పించారు.

మొగలాయీలు - తమ స్వంత విలాసాలకోసం ప్రవే శపెట్టిన జమీందారీ విధానాన్ని అనాడే రద్దు చేయించాడు. ఫ్యూడల్ వ్యవస్థకు స్వస్తిజెప్పాడు "దున్నేవాడిదే భూమి" అనే అభివృద్ధికర సిద్ధాంతాన్ని అమలుజరిపాడు. భూమిపై రైతుకు స్వాతంత్రం ఉండేవిధంగా "రైతుస్వామ్య" విధానాన్ని అమలులోనికి తెచ్చాడు, స్వతంత్ర పంజాబులో ఒక సార్వ జనీన విప్లవ శకానికి ప్రాతిపదికలు వేశాడు.

బందాసింగ్ హత్య అనంతరం పంజాబులో స్వాతం త్ర్యభానుడు అస్తమించాడు. సిక్కుజాతికి రాహువు ఎదుర య్యాడు. పంజాబుకు గ్రహణం పట్టింది. "కనపడిన సిక్కుల నందర్ని విచారణ లేకుండా చిత్రవధ చేయాలి" అని మొగల్ ప్రభుత్వం ఒక శాసనాన్ని (మిఫ్తా - ఉత్ - తవారిఖ్) జారీ చేసింది.

సిక్కు ఉద్యమం ప్రవాసానికి పయనించింది. రెండున్నర దశాబ్దాలప్రవాసానంతరం 1739లో నాదిర్షా దండయాత్ర సమ యంలో తిరిగి ఈ విమోచనోద్యమం జీవం పోసుకొన్నది. ఇది ఒక విషాద సంఘటన.

ఔరంగజేబు అనంతరం మొగలాయి శక్తి క్షీణదశ పట్టింది. తన అగర్భశత్రువైన మొగల్ ప్రభుత్వాన్ని దెబ్బ కొట్టేందుకు ఇదే అదను అనుకొని ఆఫ్ఘన్‌నుండి నాదిర్షాను ఆహ్వానించింది సిక్కునని కూడా చేస్తారు

18 వ శతాబ్దపు మధ్యభాగంలో పంజాబులో ఘోర కలి జరిగింది. సిక్కు విప్లవకారులు వేలకువేలు ఉరికంబాల

కేకొట్టారు. స్త్రీలు, పురుషులు - బాలురు - వృద్ధులు అనే విచక్షణ లేకుండా ఊచకోత కోయబడ్డారు. ఎగిరిపోయిన తలలు - క్రిందబడ్డ మొండాలు లాహోరులో రాసులయ్యారు. ఇదంతా లాహోరులో ఇప్పటికీ ఉన్న "లంగాబజార్" లో జరిగింది. "మేక్ మన్ను" పరిపాలన కసాయి పరిపాలనగా గణుతికెక్కింది. తల్లులు కండ్లఎదుటనే బిడ్డలను కత్తికో కండగా నరికి ఆ మొండాలను తల్లడిల్లి పోతున్న ఆ తల్లుల కంఠాలకు వేలాడకట్టారట భర్త కండ్లఎదుటనే భార్యల్ని - బహిరంగంగా మానభంగం చేశారట ఇందులో ఒక సంఘటన కూడా చరిత్రలో ఉటంకించబడలేదు గదా !

18 వ శతాబ్దపు మధ్యాంతంలో మరొక కొత్త దండయాత్ర పంజాబుపై విరుచుకపడింది. ఆఫ్ఘనీనుండి అహ్మద్‌షా దురానీ అనే దోపిడీముఠా నాయకుడు దండయాత్ర చేశాడు. పంజాబు జాతి ఏకోన్ముఖంగా ఈ దోపిడీముఠాను ఎదుర్కొని త్రిప్పి కొట్టింది. సింధునది దాటి అడుగుపెట్టనివ్వలేదు.

మూడవ పానిపట్టు యుద్ధంలో 1764 జనవరి 14 న సిర్‌హింద్ సిక్కులు జయించుకొన్నారు. దానితో సట్లెజ్ ప్రాంతం ముస్లింలనుండి విముక్తి చేయబడింది. అది మొదలు 84 సంవత్సరాలవరకూ సట్లెజ్ నదీ ప్రాంతమంతా స్వాతంత్ర్యాన్ని అనుభవించింది. తిరిగి 1849 లో బ్రిటిషువారి కుయుక్తులకు లోనై తూర్పిండియా కంపెని స్వాధీనమైంది. బ్రిటిషు ప్రభుత్వాన్ని ఎదురించుటలో పంజాబుజాతి ప్రథమతాంబూలం స్వీకరించింది. 'గదర్ ఉద్యమం' భారత స్వాతంత్ర్యోద్యమ

చరిత్రలో ఒక ప్రధానభూమిక నిర్వహించింది. గదరిస్టులు ప్రాణాలకు తెగించి బ్రిటిషు ప్రభుత్వంతో విప్లవపోరాటం సాగించారు. లాలాలజపతిరాయ్ ప్రారంభించిన స్వాతంత్ర్య సమారాధన ప్రతి భారతీయుణ్ణి ఉద్యూతలూగిస్తుంది.

చరిత్ర పుట్టుకనుండి పంజాబులో స్వాతంత్ర్య మహా యజ్ఞం నిరంతరంగా,ఆరని అగ్నిజ్వాలగా సాగుతూనేవచ్చింది ఈ దేశంలో నిన్న మొన్నటివరకూ విచ్చుకత్తులమధ్య విన్యాసం చేసింది-కరకుకత్తులకు వేడిరక్తాన్ని వారు పోసింది- నిరంకుశత్వానికి, మతమహమ్మారికి నిండుప్రాణాలను ధారవోసింది స్వాతంత్ర్య దేవతా బలిపీఠంపై చిరునగవులతో జీవితాలను అర్పణజేసింది పంజాబీయులే. అది వీరజాతి - స్వతంత్రజాతి - అభ్యుదయజాతి - అమరజాతి - మన దేశానికి మణిపూస ఆ దేశం, ఆ ప్రజలు. ఆ జాతి క్రమశిక్షణ మనకాదర్శం. అది భారతావని మెడలోని మణిహారం - మాతృదేవి హృదయం లోని ఆరని అమరజ్యోతి.

అమృతసర్ ఆంగ్ల సామ్రాజ్యవాదంపై జరిపిన జాతీయ విప్లవంలో అగ్రస్థానం వహించింది. "జలియన్ వాలాబాగ్" అందుకు శాశ్వత చిహ్నం. భారతజాతీయ విప్లవపోరాట చరిత్రలో "జలియన్ వాలాబాగ్" ఉదంతం ఒక మైలురాయి.

ప్రథమ ప్రపంచ సంగ్రామంలో బ్రిటిషు సామ్రాజ్యాన్ని రక్షించేందుకు భారత దేశం తన బిడ్డల్ని, సంపదను, సామ్రాజ్య వాద యుద్ధానికి అశేషంగా బలిచేసింది. భారతీయ సైనికులు వివిధరంగాలలో అతి సాహసంతో తుదివరకూ పోరాటాన్ని సాగించారని ఆంగ్లప్రభుత్వమే అంగీకరించింది. ఒక సందర్భం

లో భారతదేశపు సహకారమే లేకపోతే యుద్ధరంగంలో ఆంగ్లేయుల గతి యేమయ్యేదో గూడా చెప్పడం 'కష్టమని' ఇంగ్లీషు అధికారులే వొప్పుకున్నారు. కనీసం భారతదేశంపట్ల 'భారతజాతీయుల స్వాతంత్రేచ్ఛపట్ల ఆ పాటి విశ్వాసమన్నా లేకుండా, - స్వాతంత్ర్య పోరాటాన్ని అణచివేయుటకు- విప్లవ కారుల్ని తుదముట్టించుటకు బ్రిటిషు ప్రభుత్వం "రౌలట్" చట్టాన్ని ప్రవేశపెట్టింది. ఈచట్టంఉద్దేశం విప్లవకారులనువిచారణ లేకుండా ఉరితీయడం. ఈ చట్టాన్ని ఆసరాగా గొని, శాంతి భద్రతల పేరుతో ఎంతోమంది విప్లవకారులను ఉరికంభా లెక్కించారు. దేశంలో బ్రిటిషు పరిపాలనపై, ప్రభుత్వ దమన నీతిపట్ల పెరిగిన అసంతృప్తి కార్చిచ్చులా అణుమకపోయింది. రాక్షసత్వంతో కూడుకొన్న "రౌలట్" చట్టానికి నిరసన తెలియజేసేందుకు - భారతీయుల స్వాతంత్ర్యేచ్ఛను ప్రకటితం జేయుటకు 1919 ఏప్రియల్ 13న అమృతసర్ జలియన్ వాలా బాగ్‌లో వేలాది భారతీయులు సమావేశమయ్యారు. ఆ తోటకు యిరుకైన ఒకే ఒక దారివున్నది. ముందుగా తెలియ జేయనైనా లేకుండా జనరల్ డయ్యర్ సైనికులతోవచ్చి, దారి బిగించి ప్రజలపై మరతుపాకులు పేల్చాడు. కొన్ని వేల తుపాకీ తోటాలు ఆనాడు భారతీయులగుండెల్లో దూసుకుపోయాయి. సుమారు 500 మంది భారతీయులు తుపాకీ గుండ్లకు హుతు లయ్యారు. ఆ నాటి తెల్లదొరల రాక్షసత్వచిహ్నాలు ఈనాటికీ జలియన్ వాలాబాగ్‌లో కండ్లకు కట్టినట్లు కనుపిస్తున్నాయి. ఎన్ని వేల సారులు పేల్చబడినవో - ఆ తోటలోని గోడలన్నీ తుపాకీతోటాలకు తూట్లు పడిపోయ్యాయి. ఆ తూట్లుయిప్పటికీ

కనుపిస్తున్నాయి. తుపాకీ కాల్పులకు చెల్లాచెదరైన గుంపులో అనేకమంది ప్రక్కనేవున్న బావిలోపడి మృత్యువాతపడ్డారు. ఆ బావి - అందులోని నల్లని నీరు యిప్పటికీ భయంకరంగా కనుపిస్తూంది. అందులోనుండి జాతీయ పోరాటపు అమరవీరుల విప్లవగీతం ప్రతిధ్వనిస్తూంది. సువిశాలమైన ఆ తోటలోని వివిధ దృశ్యాలను చూచినమీదట ఆవిషాదగాథల్ని విన్నమీదట మాత్రైతులు సజలనేత్రాలతో నిట్టూర్చారు.

జనరల్ డయ్యరు క్రూరత్వానికి ఫలితంగా అతను ఇండియా ఉద్యోగంనుండి రిటైరు అయి ఇంగ్లాండులో గౌరవాలను పొందాడు.

పంజాబురాష్ట్రం దేశ విభజన సందర్భంలో మరొకసారి మతపిచ్చకు ఆహుతి కావలసివచ్చింది. దేశంలో స్వాతంత్ర్యభానోదయమైంది. ప్రజలు ఆనందం, ఉత్సాహాలమధ్య కోలాహలంగా పండుగజేసికొంటున్నారు. కానీ పంజాబు కారుచీకట్ల మధ్యనే వుంది. మతపిచ్చి కార్చిచ్చులా విజృంభించి - అమాయక ప్రజల రక్తంతో ఆ పంచనదుల పుణ్యభూమి తడిసిపోయింది. లాహోరు నుండి అమృతసర్‌కు హిందూ కాందిశీకులను చేరవేస్తున్న రెండు ప్రత్యేక రైలు బండ్లను - మధ్యలో మృక్కడి మూకలు ఆపివేసి - ఆ బండ్లలో ఒక్క ప్రాణిగూడా మిగలకుండా ఊచకోత కోయబడి - కాకులకు గ్రద్దలకు ఎగురవేయబడిన భయంకర సంఘటన గుర్తుకు వచ్చినప్పుడు ఎవ్వని హృదయం కంపించదు? తత్ఫలితమే కాబోలు ఈ నాడు అమృతసర్‌లో మచ్చుకు గూడా ముస్లిం కుటుంబం లేదు. అమృతసర్ నగరంలో నలు

మూలలా పరికించాము. ముస్లింల నివాస గృహాలు నేలమట్ట మయ్యాయి. అగ్నిదగ్ధమయ్యాయి. ఆ శిథిలాలమధ్య తిరుగుతూ వుంటే ఆనాటి మారణహోమం కళ్ళకు కట్టినట్టే ననిపించింది. లాహోర్‌లో జరిగిన ఘోరకలినిగురించి అప్పుడే ఒక సిక్కు సోదరుడు విశ్లేషించాడు. "భర్తను కాళ్ళుచేతులు కట్టివైచి భార్యను మానభంగంచేయడం, తల్లి కన్నుల ఎదుటనే బిడ్డను కరకు కత్తికి బలివ్వడం – భార్య ఎదుట భర్తను కత్తికి ఒక కండగా చిత్రవధచేయడం" రుద్ధకంఠంతో ఆ సిక్కు కాంది శీకుడు చెప్పిన ఘోరాతిఘోరమైన ఉంతాలకు మా హృద యాలు బరువెక్కాయి. నరాలు బలహీనమయ్యాయి. నాజీలు యూదులను కాల్చి చంపిన విషాదగాథలకు – భారత దేశ విభజనలో జరిగిన ఘోరకలికి వ్యత్యాసమేముంది! "స్వాతంత్ర్య దినోత్సవంనాడు పంజాబు ప్రజలు చూసింది – స్వాతంత్ర్య జ్యోతులనుకాదు – పీనుగ పెంటలను; జయజయధ్వానాలను కాదు। హాహాకారాలను" అని ఒక సోదరుడన్నాడు. అది నిజమేకావచ్చు.

అయితే స్వాతంత్ర్యానంతరం తూర్పుపంజాబు అభివృద్ధి రంగంలో శరవేగాన పురోగమిస్తుందనుటకు సందేహంలేదు. అమృతసర్‌లో పంజాబు అసెంబ్లీ స్పీకరును మా రైతులుకలిసి కొన్నప్పుడు – ఆ రాష్ట్రంలో జరుగుతున్న అభివృద్ధినిగురించి ఆయన వివరించారు. వారు ఆచరణ సాధ్యమైన విధంగా భూ సంస్కరణలను అమలుజరుపుకుంటున్నారు. రైతు స్వామ్యపు హక్కులను – రక్షిస్తూ – స్వతంత్ర జీవనభృతి, వృత్తి, ఉద్యో గాలను కల్పించగల రైతాంగవ్యవస్థను నిలుపుకొనేందుకు, అభి

వృద్ధిపరచుకోనేందుకు – ఆ రైతులు – రాష్ట్రప్రభుత్వం కృషి సాగిస్తున్నదన్నారు – నాగరికంగా వున్న ఆంధ్ర రైతులను శాసన సభాధ్యక్షులు అభినందించారు. రైతు నాయకులు రంగాగారిపట్ల తమకు సంపూర్ణమైన విశ్వాసం కలదనికూడా ఒక సందర్భంలో వివరించారు. అమృతసర్ అందమైన నగరం – అచ్చటి ప్రజలు నాగరికులు, శ్రమజీవులు, ఏదో ఒక వ్యాపారం చేయడం వారి లక్షణం. వస్త్రోత్పత్తి అధికం నగరంలోని బట్టలషాపులు మా రైతుల్ని ఆశ్చర్య చకితుల్ని చేశాయి. విశేష మేమంటే మూడు రూపాయిల ఖరీదుచేసే గుడ్డను పదిరూపాయిలు చెప్తారు. బేరమాడితే మూడు రూపాయిలకే యిస్తారు. వ్యాపార సరళి బాగా తెలిసినవారు.

# భాక్రా - నాంగల్

మననాడు స్వతంత్రభారతంలో నిర్మించబడిన భారీ ఇర్రిగేషన్ జలవిద్యుత్ ప్రాజెక్టు భాక్రా - నాంగల్ పేరు కొన్నాము.

సట్లెజ్ నదిపై 'భాక్రా - నాంగల్' అనే రెండుచోట్ల ఆనకట్టలు నిర్మించారు. సట్లెజ్ పంజాబు పంచనదుల్లోఒకటి. ఈ నది హిమవత్పర్వతాలలో కైలాసగిరి దిగువభాగంలో "మానస సరోవరం" లో జన్మించి హిమాచల్ ప్రదేశ్ మీదుగా పంజాబులో ప్రవేశించి - సింధు రాష్ట్రంలో సింధునదిలో సంగమిస్తున్నది.

భాక్రాదగ్గర ఈ నదిపై నిర్మించబడుతున్న ఆనకట్ట ప్రపంచంలోనే ఒక ప్రసిద్ధ నిర్మాణ మౌతుంది. స్వాతంత్ర్యానంతరం మన ప్రభుత్వం అభివృద్ధి రంగంలో సాధించిన ఘన విజయాలకు తార్కాణం భాక్రా - నాంగల్ ప్రథమ పంచ వర్ష ప్రణాళికారచనకు పూర్వమే ఈ మహత్తరపథకం అమలు లోనికి తేబడింది. ఈ ప్రాజెక్టు మొత్తం వ్యయం రు 170 కోట్లు - ఆనకట్ట ఎత్తు 680 అడుగులు. ఈ ఆనకట్ట దిగువ భాగంలో రెండు పెద్ద పవరుహౌసులు నిర్మించబడినాయి. అంతేకాకుండా నాంగల్‌దగ్గర మళ్ళింపు కాలవకు ఆనకట్ట బ్యారేజి, విద్యుత్తు ఛానల్ పూర్తయ్యాయి. గంగువాల్,

కోట్లాదగ్గర రెండు జలవిద్యుత్ పవరుహౌసుల నిర్మాణం ముగిసింది. ఇప్పుడు పూర్తి కావలసింది ఒక్క భాక్రా ఆనకట్ట మాత్రమే. ట్రాన్స్‌మిషన్ సిష్టమ్‌గూడా పూర్తి అయింది. పూర్తి నిర్మాణం తర్వాత ఈ ప్రాజెక్టు ద్వారా పంజాబు, పెప్సు రాష్ట్రాలలో 30 లక్షల ఎకరాల భూమి సాగులోనికి వస్తుంది. 1,54,000 కిలోవాట్ల విద్యుత్ వినియోగానికివస్తుంది.

కూలీల ప్రత్యేక రైలులో మా రైతులు భాక్రా ఆనకట్ట నిర్మితప్రాంతాన్ని చేరుకున్నారు. డాం నిర్మాణానికి అనుకూలంగా సట్లెజ్ నీటిని మళ్ళించుటకు నిర్మించిన రెండు సొరంగాలు రైతుల్ని ఆశ్చర్య చకితుల్ని చేశాయి. దాదాపు 10 వేలమంది కూలీల శ్రమతో నిర్మాణమౌతున్న ఆ డాం ఉపరిభాగంలో 1700 అడుగుల పొడవు వుంటుంది. ప్రాజెక్టు అధికారులు రైతులకు స్వాగతమిచ్చి ఆనకట్ట నిర్మాణానికి సంబంధించిన విషయాలన్నింటినీ వివరించారు. సాయంత్రం నాంగల్ డైవర్షన్ డాం - హైడల్ ఛానల్ సందర్శించాము. దాదాపు రెండు ఫర్లాంగుల పొడవున నదికి అడుగున నిర్మించిన పర్యవేక్షణ సొరంగంగుండా రైతులు నడిచారు.

ఒకనాడు ఎడారిగానున్న ఆ ప్రాంతంలో ఈనాడు ఒక నవీన నగరం వెలిసింది కూలీలకు చక్కని వసతి గృహాలు నిర్మించబడినాయి. అసలు భాక్రా - నాంగాల్ ప్రాజెక్టు ప్రాంతమే కనులపండువలా కనిపిస్తుంది. సట్లెజ్ నదీతీరంలో లభ్యమయ్యే రంగురంగుల రాళ్ళతో నిర్మాణమై - అలంకరింపబడిన కట్టడాలు అతిమనోహరంగా వున్నాయి.

ఈ ప్రాజెక్టు పంజాబురాష్ట్రానికి వరప్రసాదం వంటిదని అచ్చటి రైతుల - ప్రజల అభిప్రాయం. పంజాబు రైతులు కష్టజీవులు. వ్యవసాయంలో ఆంధ్రరైతులవలెనే వారికిఅభిరుచి జాస్తి. అందుచేతనే భాక్రా-నాగంల్ ప్రాజెక్టు నిండుగా సద్వినియోగం కాగలదని చెప్పబడుతుంది. పంజాబు రాష్ట్రంలో అనేకచోట్ల రైతులు మాకు స్వాగతమిచ్చారు. పంజాబు రైతులను ఆంధ్రరైతులు ఎన్నటికీ మరువజాలరు.

# గంగా - యమునా లోయ

భారతావని చరిత్రలో, సంస్కృతిలోనే కాకుండా - దేశపు ఆర్థిక, రాజకీయ సాంఘికరంగాలలో హిమాలయాలు మహత్తరమైన పాత్రను నిర్వహించాయి. హిమపర్వతాల దక్షిణభాగంలోని సింధు, గంగ, యమున నదుల ప్రాంతం భారతావని చరిత్రలో అడుగడుగునా ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించుకొన్నది.

ఒకనాడు విశ్వ ఇతిహాసంలో ప్రసిద్ధికెక్కి- నటువంటివి, అసలు ప్రపంచ మానవచరిత్రకు - పరిణామాలకు ఆధారభూతమై నటువంటివి మెడిటరేనియన్ సముద్రాన్ని అంటుకొని యున్న ప్రాంతాలు, నైలునదీతీరంలోని నయాసిస్సులు, టైగ్రిస్ యుఫ్రేటిస్సులోయ, సింధు, గంగా, యమునా లోయ, ఆగ్నేయాసియా. సాగరనదీ ప్రాంగణాలలో నిలిచియున్న చైనా భూభాగాలే. అన్నియుగాలలోనూ, ఈప్రాంతాలలోనే మానవ నాగరికత సంస్కృతి విరాజమానమై యున్నవి.

మధ్య ఆసియాలోనుండి - హిందూకుష్ పర్వతాలను దాటి సప్తసింధులో స్థిరనివాసా లేర్పరచుకొన్న ఆర్యుల రాజ్యం ఇదే. హిందూదేశీయులతో సమ్మేళనం చెందిన ఆర్యులు, ఆదివాసులు హిందూమతాన్ని పెంచుకున్నారు. హిందూరాజ్యాన్ని స్థాపించుకొన్నారు. అదే ఆర్యావర్తనమని పిలువబడింది.

గయనుండి మధుర - సంగం (ప్రయాగ) నుండి హరిద్వార్ వరకు గల ప్రాంతం హిందువులకు పవిత్రప్రాంతంగా పరి

గణించబడింది. ఆ యెల్లలలోని దే ఆర్యావర్తనపు జీవగడ్డ అనిపిలువబడింది. ఆగడ్డనే మహానీయులు రాజ్యమేలారు. వీరులు యుద్ధాలు చేశారు. మహాత్ములు తపస్సులుచేసి యోగబలాన్ని సాధించారు. యోగబలంతో రాజుల్ని, మహారాజుల్ని వశపరచుకున్నారు. ఈ మహాతాపసుల వత్తాసిలో ఆర్యులుసామ్రాజ్యాన్ని విస్తరింపజేసికొన్నారు. దక్షిణాపథంపై దండయాత్రలు సాగించారు.

అర్యావర్తనంలో ఒకనాడు ప్రఖ్యాతిజెందిన ఈ ప్రాంతంలో ఆనాటినుండి – ఈనాటివరకూ ప్రవర్థమాననమైయున్న హరిద్వార్, ఋషికేశ్, డేహ్రాడూన్, లక్నో, అయోధ్య, అలహాబాద్, కాశీ, గయలను మా రైతులు సందర్శించారు.

ఆర్యావర్తనం పుణ్యభూమి మాత్రమేకాదు. సారవంతమైన భూమి. గంగ – యమునా నదుల ప్రవాహాలు ఈ భూమిని సస్యశ్యామలం జేశాయి. అందుచేతనే ఐతిహాసిక పూర్వయుగాలనుండీ ఈ ప్రాంతంలో జనసమ్మర్థం మెండు. విదేశీయుల నేత్రాలు ముందుగా ఈ ప్రాంతాన్నే ఆకర్షిస్తూ వుండేవి. ఆర్యులు ఈ ప్రాంతాన్ని తమ స్వంతంగా జేసికొన్నారు. గ్రీకులు, పారసీకులు, కుషాణులు, హూణులు, వైకింగులు, మహమ్మదీయులు, మంగోలియనులు, ఆంగ్లేయులు–అందరూ.సప్తసింధు, ఆర్యావర్తనంలోనే ప్రవేసించేందుకు ప్రయత్నించారు కొందరు ప్రవేశించారు. మహమ్మదీయులు, ఆంగ్లేయులు–ఒక్కొక్కరు నాలుగైదు శతాబ్దాలపాటు ఆర్యావర్తనాన్నే కాకుండా– దాన్ని ఆధారంగా జేసికొని హిందూ దేశానికి చక్రవర్తులయ్యారు.

జనసమ్మర్దమైన, సారవంతమైన ఈ భూభాగంలో ఆది నుండీ వ్యవసాయమే జీవనాధారం. పరిశ్రమలులేని ఆయుగాలలో పాడిపంటలతో సుభిక్షంగావున్న ఈ భూమి ఉత్తరాపథాని కంతకూ మకుటంగా నిలిచింది. దాని రాజకీయప్రాబల్యం ఒక్కొక్కరి కాలంలో ఒక్కొక్కవిధంగా దేశం మీద విస్తరిల్లింది. అక్కడనుండే సామ్రాజ్యవాద యుద్ధాలు బయలుదేరాయి.

జీవనస్థాయి పెరిగినప్పుడు అధికారం కావాలని పిస్తుంది. ఏలుతున్నరాజ్యం చాలదు. ఆర్యావర్తాన్నుండి దండయాత్రలు దక్షిణాదికిసాగాయి. మగధ,మౌర్య, గుప్త, మొగల్ సామ్రాజ్యాల విస్తరణకు ప్రాతిపదిక ఆర్యావర్తం. వింధ్య పర్వతాల వరకూ ఎప్పుడైనా ఎదురుండేది కాదు. దక్కను పీఠభూమిలోని శాతవాహనాది ఆంధ్రరాజులు,దక్షిణాదిన పల్లవ చాళుక్యరాజ్యాలు ఆచక్రవర్తులకు దుర్భేద్యమయ్యాయి.

ఆర్యావర్తంపై పరాయి దేశస్తుల ప్రభావమున్నట్టుగా దక్కన్ -- దక్షిణా పథాలలోని-గోదావరి – కావేరీ లోయలలో లేకపోయింది. ఈ దుర్భేద్య ప్రదేశాలలో వారి యెత్తుగడలు పారలేదు. వీరితో వారు యుద్ధాలుచేయలేకపోయారు. యుద్ధాలు చేయకుండా కుతంత్రాలతో సామ్రాజ్యాన్ని విస్తరింప జేసికొన్న ఆంగ్లేయులు దక్షిణాపథంలోని రక్షణ శ్రేణులను భేదించగలిగారు.

•

మేముమధ్య దేశంలో ప్రయాణంచేశాము. పంజాబులో పర్యటించాము. అయితే గంగా,యమునా లోయలోవున్నంత జనసమ్మర్దం ఎక్కడాచూడలేదు. ఆ ప్రాంతంలో చదరపు

మైలుకు 500 మంది చొప్పున నివసిస్తున్నారు. ఆ విధంగా ఆంధ్రలో గోదావరీ, కృష్ణాడెల్టా ప్రాంతంలోనూ, దక్షిణా పథాన కావేరీ లోయలోనూ నివసిస్తున్నారు - మధ్యప్రదేశ్ లోనూ, దక్కను పీఠభూమిలోనూ చదరపు మైలుకు 250 మందికి లోపుగానే నివసిస్తున్నారు.

హరిద్వార్ నుండి అయోధ్యవరకూ - దాదాపు హిమా లయాలకు దగ్గరగానే మేము ప్రయాణం సాగించాము. హిమా లయాలు భారతీయ నాగరికతకు, సంస్కృతికి, కళకు, విజ్ఞాన శాస్త్రానికి ప్రాణాధారాలు అందుకే ఆ పర్వతాలను మనం పవిత్రంగా భావిస్తున్నాము. దేశాన్ని సస్యశ్యామలం జేస్తున్న సింధు, గంగ, యమున, బ్రహ్మపుత్రా మొదలైన మహానదుల జన్మస్థలం హిమాలయాలే. అందుకే హిమాలయాల ప్రమే యం లేకుండా - యే పురాణమూ, యే కావ్యమూ లేదు. గౌరీశంకరుల క్రీడాస్థలం హిమాలయాలలోని కైలాసగిరి. దేవ తలు జలక్రీడలు సలిపే పవిత్ర సరస్సు మానససరోవరం హిమా లయాలలోనిదే. అమర్‌నాథ్, జ్వాలాముఖి, హరిద్వార్, కేదార్‌నాథ్, బదరీనాథ్, పాశుపత్, ఇవన్నీ హిందువుల తీర్థయాత్ర స్థలాలు. దేవతల రంగస్థలాలు. పరమశివుని పత్ని పార్వతీదేవి పర్వతరాజు ముద్దులపట్టి అనిగూడా మనం పురా ణాలలో చదువుకున్నాము. పర్వతరాజు హిమాలయాలకు రాజు హిమాలయాలు పర్వతాలకు రాజు.

గంగానది హిమాలయాలలో పుట్టి 500 మైళ్ళ పర్యంతం పర్వతాంతాలలో ప్రవహించి - శిఖరాలపైనుండి దూకి, లోయ లలో లోయలలో విన్యాసమొనర్చి సొరంగాలలో దూరి

ఋషికేశ్ కు పైన 25 మైళ్ళలో సమతల భూభాగంలో ప్రవ
సిస్తుంది.

గంగ పుట్టుక ఒక పెద్దగాథ. భగీరథుడు గంగను భూలో
కానికి తెచ్చాడు. గంగావతరణకు భూలోకం దద్దరిల్లింది. పరమ
శివుడు ఆ ప్రవాహాన్ని తన జడలలో బంధించాడు. జడలో
ఒక్క పాయను లాగి గంగకు దారిచూపాడు. గంగ భూలోక
నికి సన్ననిపాయగా అవతరించింది. ఆ పాయ భారతభూమి
మణిమయం చేసింది.

హిమాలయాలలో పుట్టిన మహానదులు ఈ దేశాన్నే
గాదు, చైనానుగూడా సుభిక్ష మొనర్చాయి. యాంగ్సీ, పస
పుపచ్చనదీ చైనా భూభాగంలోనూ, మికాంగ్ సైయా
లోనూ, సాల్వీన్ బర్మాలోనూ ప్రవహిస్తున్నాయి. ఒక్క
మాటలో చెప్పాలంటే హిమాలయాలు ప్రపంచంలోని సగ
జనాభాకు సంస్కృతీ, నాగరికతలను ప్రసాదించాయి. ఆమహ
పర్వతాల ప్రభావం – భూగోళంలోని – సగం భూభాగంపై
ప్రవర్ధమానమై యున్నది.

"హిమాలయాలు భారతావని మకుటం – గంగాన
భారతావని మణిహారం. గంగా, యమునానదీ లోయ భారత
మాత హృదయపీఠిక. పంజాబు, వంగదేశము భారతమాత
హస్తద్వయము – దక్కను పీఠభూమి ఆ మాత నాభిస్థానం
దక్షిణాపథం పాదపద్మాలు" అని ఒక భావకవి వర్ణించాడు
అఖండభారతాన్ని.

ఆర్యులు హిమాలయ అధోభాగాన్ని జయించడంతో
భారతావనిలో ఐతిహాసిక భానోదయ మైందని చెప్పవచ్చున

భారతకాలంలో ఇచ్చట ద్విగర్త, త్రిగర్త, మాద్ర అనే మూడు ప్రాంతాలు ప్రవర్ధమానమై వున్నట్లు పురాణాలు చెప్తున్నాయి. రామాయణ కాలంలో హరిద్వార్‌కు ఉత్తరంగానున్న ఋషికేశ్ దగ్గర లక్ష్మణుడు గంగానదిని దాటినట్లు చెప్పబడుతున్నది. ఆ దాటిన చోటునే ఇప్పుడు 'లక్ష్మణఝూల' అని వ్యవహరిస్తున్నారు. రామాయణ, భారత యుద్ధాల మధ్య కాలంలో ఈ భూమి బహుప్రాశస్త్యంలో ఉన్నట్లు చెప్ప బడుతూంది. పంచపాండవులు ద్రౌపదీ సహితంగా కైలాసానికిపయనమై - గంగానదీతీరాన్నంటి-హరిద్వార్- ఋషికేశ్‌ల మీదుగా ఉత్తరాభిముఖులై నడచి మానససరోవరం దాటి - కైలాసాన్ని చేరుకున్నట్లు చెప్తారు.

ఆనాటి తాపసులుప్రశాంత వాతావరణాన్ని పరిశోధించుకుంటూ కైలాసగిరి వరకు పయనించారు, హరిద్వార్ మీదుగా బదరీనాథ్ వరకూగల కాలిబాట ఆనాటి ఋషులు నిర్మించినదే నని వాడుక. ఆనాడు తాపసులు ఆశ్రమాలు నిర్మించుకొని తపోదీక్షలను కొనసాగించిన ప్రతిప్రదేశం ఈనాడు మనకు యాత్రాస్థలమైంది. కల్కా (కాళిక) సిమ్లా (శ్యామల) మధ్య అలాంటి ప్రదేశాలు ఈనాటికీ ఎన్నోవున్నాయి. హరిద్వార్ - బదరీనాథ్‌కు మధ్యగల క్షేత్రాలను ప్రతియేటా లక్షలాది యాత్రికులు సందర్శిస్తున్నారు.

హరిద్వార్‌లో మా రైతులు ఒక్కరోజు గడిపాయి. హిమాలయప్రాంగణంలో గంగాతటిపై విరాజమానమైయున్న హరిద్వార్ హిందువులకు, సిక్కులకు, బౌద్ధులకు పవిత్రతీర్థం. ఇచ్చట దక్షుడు యజ్ఞంచేశాడు. పార్వతి ఆ యజ్ఞంలో భస్మ

మైంది. దక్షుణి శిరస్సు ఖండించబడి హోమగుండంలో బూడిద అయింది. పార్వతి తిరిగి పర్వతరాజు పుత్రికగా జన్మించింది. దక్షుణికి మన్నపోతు శిరస్సు అతికించి మహేశ్వరుడు ప్రాణం పోశాడు.

దేవతలు అమృతభాండంతో పారిపోయివచ్చి హరిద్వార్‌లో విశ్రాంతి తీసుకున్నారు. దానిచిహ్నంగా ఇచ్చట కుంభమేలా, అర్ధకుంభమేలా జరుగుతుంది.

హరిద్వార్‌లోని గంగానది శీతల స్వచ్ఛోదకం 70 సంవత్సరాలదాకా నిల్వవుంటుందని శాస్త్రజ్ఞులు నిగ్గు తేల్చారు. గంగానది బ్రహ్మగుండం, కుషబరా, కుషావర్త ఘాటులలో స్నానమాడితే పాపాలు పటాపంచలవుతాయని భక్తుల విశ్వాసం. చండీదేవి, మానసాదేవి ఆలయాలు ప్రశస్తమైనవి.

హిమాలయాలకు మరింత దగ్గరలో నున్న ఋషికేశ్ లోగూడా మా రైతులు ఒకరోజు గడిపారు. ఇది కేదార్‌నాథ్, బదరీనాథ్‌పోవు దారిలో వున్నది. ఋషికేశ్ వేదయుగంనాటి అరణ్య విశ్వవిద్యాలయమని ప్రతీతి. హిందూ ధర్మానుసారం – చతురాశ్రమాలలో ఆఖరిదైన సన్యాసాశ్రమాన్ని గడిపేందుకు ఇది అనువైన చోటు. పూర్వపు ఆర్యావర్తనపు రాజులు తమ సన్యాసాశ్రమాలను ఇచ్చటనే వెళ్ళదీసి ముక్తిబొందినట్లు చెప్పుకుంటారు. కైలాసానికి చేరువలోనున్న ఈ ప్రశాంత స్థలం యోగాభ్యాసానికీ, తపోదీక్షకు అనువైనదనుటలో సందేహంలేదు. గంగానది వొడ్డున – శీతలవాతావరణంలో – పర్ణకుటీరాలను నిర్మించుకొని – తపోదీక్షను కొనసాగిస్తున్న ఎందరో తాపసులను కన్నులార గాంచిన మా

రైతులకు ప్రబంధ. యుగం స్మృతిపథాల్లో మెలిగిందంటే అతి శయోక్తికాదు. అయితే తాపసోత్తముల తపోనిష్ఠలను భగ్న మొనర్చే – రాక్షసులు – గంధర్వాలు – అప్సరసలు లేక పోయినా నిత్యమూ చీమలబారుల్లాగా వస్తూ – పోతూన్న యాత్రికులే – వారి తపోభంగానికి గంధర్వాలు – అప్సరసలు కావచ్చునేమో! గృహచ్ఛిద్రాలు, గయ్యాళి భార్యల ఆంప కోత, జీవనోపాధిలేమి మనశ్చాంచల్యంతో అచ్చటి ఆశ్ర మాల నాశ్రయించే వారెందరో – మా కన్నెదుట పడకపోలేదు. మానవునకు ఆత్మశాంతి ఎక్కడా లభించ కపోతే – అది ఋషికేశమందు సాధ్యమని ఊహించడంలో పొరపాటులేదు. ఈనాటికీ అదొక ఫారెస్టు యూనివర్శిటీయే. ఎన్నో ఆశ్రమాలు ఎందరో గురువులు యోగాభ్యాసం చేయు టకు, ఆత్మశక్తిని సాధించుటకు ఎన్నో అవకాశాలువున్నాయి. జీవనభృతి సమస్యలేదు. ముందువెనుకల ఆలోచనలేదు. సంపా దన దుగ్ధలేదు. మనోహరమైన ప్రకృతి, ప్రశాంతమైన వాతా వరణం.

నవయవ్వనపుహొయలు ప్రదర్శించే గంగానది, నవరస భరితమైన సంగీతాల నాలపించే పక్షిగణం, యాత్రికులుమినహా బాహ్యప్రపంచంతో సంబంధంలేదు. ఆ యాశ్రమాల తీరు- అందున్న సౌకర్యాలు – అచ్చటి క్రమశిక్షణ - నిత్యమూ మృష్టాన్నము... కాకపోతే స్వచ్ఛమైన గాలిభక్షణ – నిజంగా అది మరో ప్రపంచం. ఆ గీతామందిర్ జనసమ్మర్దంగా వున్నా రోజూ భజనలు – హారతులు, ఫలహారాలు. చలువరాతితో నిర్మింపబడిన ఆ భవనం వీడి ఒక్కపట్టున మారైతులు రాలేక

పోయారు. అందులోని ప్రతిగోడ, ప్రతిరాయి, ప్రతి స్థంభ మూ, గీతా ప్రవచననాలను వల్లిస్తున్నాయి. అచ్చట ఆధ్యాత్మిక చింతనలేకుండా ఎవరుండగలరు? ఋషులు వనమూలికలతో ఔషధాలను తయారుచేస్తున్నారు. శిష్యులు వేద పాఠాలు నేర్చుకుంటున్నారు. ఒక ప్రక్క వేదాంతంపైచర్చ జరుగుతూంది. ఒక ఆశ్రమంలో మీమాంస శాస్త్రాన్ని సమీక్షిస్తున్నారు. ఒకచోట ఆధ్యాత్మిక బోధలు వినబడు తున్నాయి. ఒక గదిలో యోగాభ్యాసం చేస్తున్నారు. అదిగో! ఒక ఆలయంలో గంటానాదం వినబడుతోంది. వసారాలో అన్నదానం జరుగుతూంది. దేవాలయ ప్రాంగ ణంలో సారస్వత సమావేశం జరుగుతూంది. అది మరో ప్రపంచం.

'ఆధ్యాత్మిక వాదంద్వారా ప్రజల్ని శుద్ధిచేయడ మెలా'' అనేదే అచ్చటిపరిశోధన. అది అణుశక్తిని మించిన శక్తి - అంతర్జాతీయ అణుశక్తి సమావేశాలకుమించిః సమా వేశాలు. ''సత్యంతో శాంతి సాధించబడాలి అణుశాంబుల తోకాదు''.- ఆ సమావేశాల, చర్చల పర్యవసానం.

ఆంధ్రఆశ్రమంలో మాకుమర్యాదలుజరిగాయి. ఎందరో యాత్రికులకు అచ్చట వసతికల్పించబడుతూంది.బదరీయాత్రకు అదొకమార్గం. ఎందరికో వేందాతంలో, ఆధ్మాత్మికంలో శిక్షణ గరపబడుతూంది. ఈ ఆశ్రమ నిర్మాణంలో శ్రీమంతు లైన ఆంధ్రులు ఎంతో సహాయపడినారు

ఋషీకేశం నిజంగా ఋషులపట్టణమే. ఇది ఒక ముని పల్లె. హిమవత్ పర్వత ప్రాంగణంలో - గంగానదీ తీరంలో యుగయుగాలుగా నిలిచియున్న ఆధ్యాత్మికనగరం.

ఆ ఒక్క రోజూ మేమూ వేదాంతులమయ్యాము. ఆధ్యాత్మికవాదంలోవిలీనమయ్యాము. ఇహలోక సంబంధాలను వీడి...ఆముష్మిక సుఖాలను మరచిపోయి, ఆనందానుభూతిని పొందాము.

# డెహ్రాడూన్ వ్యాలీ

ఎప్పుడో ఒకనాడు భూమికి పెద్ద ఒత్తిడి తగిలిందట. గట్టిగా నలిగిందట. భూ గర్భంలో లావా తదితర పదార్థాలు ఉపరిభాగానికి చిమ్మిన కారణంగా హిమాలయ పర్వతాలు యేర్పడినవని భూగర్భ శాస్త్రవేత్తలు నిర్ధారణచేశారు. అంతకు ముందు హిమాలయప్రాంతం లోని కొంత భాగం సముద్రగర్భంలో దాగియుండేదని కూడా శాస్త్రకారులు నిర్ధారించారు. అదెప్పుడు, ఏ యుగంలో జరిగిందో తెలియదు.

ఇయితే ఐతిహాసిక పూర్వయుగాలనుండి హిమాలయాలు మన దేశానికి పెట్టనికోటగా, రక్షణ దుర్గాలుగా వుంటూ వచ్చాయి. అంతేకాదు. ఆ మహాపర్వతాలలో జన్మించిన మహానదులు మన దేశాన్ని మణిమయం చేశాయి. చేస్తు

న్నాయి. ఈ దేశాన్నే కాదు - ఆసియా ఖండంలోని అనేక దేశాలకు ఈ పర్వతశ్రేణులు వరప్రసాదాలయ్యాయి. అందు చేతనే హిమవంతుడు భారతీయులకు దైవసమానుడు. దేవతా పీఠాలు అక్కడేనని, ముక్కోటిదేవతల రంగస్థలం అదేనని, హిందువుల విశ్వాసం. ఈ పుణ్యనదీ, నదాలను భూలోకానికి పంపించినదిగూడా ఆ దేవతలేనంటారు.

పావన గంగానదీలోయలో అంతర్భాగమైన "డూన్ వ్యాలీ" ఈనాడు సర్వశోభాయమానంగా వెలుగొందుతు న్నది. "డూన్ వ్యాలీ" లో మా రైతులు రెండురోజులు గడిపారు. గంగా - యమునా నదులమధ్య 70 మైళ్ళపొడవు 20 మైళ్ళ వెడల్పు గలిగిన ఈ లోయ సమస్త వృక్షజాతులకు నిలయం. ఒకనాటి హిందూ సామ్రాజ్యానికి ఈ డెహ్రాడూన్-హరిద్వార్ లోయలు జీవగర్రలు. హిందూరాజుల పతనానం తరం ఈ ప్రాంతపు ప్రాధాన్యత ఒకవిధంగా తగ్గిపోయిందనే చెప్పాలి. మహారణ్యాలతో నిండి, జనశూన్యమైన ఈ ప్రాం తంపై మొగల్‌పాదుషాల దృష్టి పడలేదు. హిమాలయ పర్వ తాల వాలులోనున్న ఈ సుందర ప్రాంతం వారన్‌హేస్టింగ్స్ హయాంవరకూ అజ్ఞాతంగానే పడివున్నది. 1774 లో వారన్ హేస్టింగ్సుహిమాలయాల మీదుగా టిబెట్టుదారికనుగొన్నాడు. 1814-1816 లో గూర్ఖాలతో యుద్ధం ప్రజ్వరిల్లింది. అందులో విజేతలైన ఆంగ్లేయులు గారక్వాల్, కుమోన్ మొదలుకాంగ్రా వరకూ హిమాలయ పర్వతప్రాంతపు హిందూరాజ్యాలన్నింటినీ బ్రిటిషుసామ్రాజ్యంలో కలుపుకోవడం జరిగింది.

హిందూస్తాన్ - టిబెట్ రోడ్డు నిర్మాణమైన తర్వాత శ్యామల' (సిమ్లా) ఆంగ్లేయుల వేసవి మకాముగా రూపొందించబడింది. ఆతర్వాతనే డూన్ వ్యాలీలోని ముస్సోరీ గూడా వేసవి మకాముగా అభివృద్ధి పరచబడింది, శీతలదేశం నుండి ఇండియావంటి ఉష్ణదేశానికి వచ్చిన తెల్లదొరలకుశీతల ప్రాంతాల అన్వేషణ అవసరమైంది. హిమాలయ పర్వత ప్రాంతం తమ ఆధీనంలోనికి వచ్చినతరువాత అలాంటివి ఎన్నో ప్రాంతాలు వారి దృష్టి నాకర్షించాయి. అలాగే ఉత్తర దేశంలో సిమ్లా మొదలు డార్జిలింగువరకూ గల కొండలలోని శీతల ప్రాంతాలన్నీ వారి వేసవి మకాములయ్యాయి. సిమ్లా ప్రభుత్వపు వేసవిరాజధానిగా రాణించింది.

ఆంగ్లేయుల కాలంలో ఒక నిర్ణీత విధానం ప్రకారం అభివృద్ధి పరచబడింది డెహ్రాడూన్ వ్యాలీ. ఇది హిమాలయ పర్వతాల వాలులో అతిమనోహర దృశ్యాలమధ్య విరాజమానమైవున్నది. ఒకనాడు ఈ ప్రాంతాన్ని 'కీన్యా'వలె 'బ్రిటీషు కాలనీ'గా పరిమార్చు చెందించుటకు గూడా ఆలోచనలు సాగాయి. శావలిక్ - హిమాలయ పర్వత శ్రేణులమధ్య నున్న రమణీయ ప్రకృతి కాంతవడిలో దూన్‌వ్యాలి ఆంగ్లేయులకు వరప్రసాదమైంది. సారవంతమైన ఈ భూములు రకరకాల కూరగాయలకు - వన్నెచిన్నెల పూదోటలకు ఆలవాలమై వున్నది. డూన్ వ్యాలీ ఒక పూ పొదరిల్లు. ప్రకృతిసంతతికి అది మాత. దాని చల్లని హాయిగొలిపే వాతావరణం మానవునకు స్వర్గతుల్యంగా వుంటుందనుటలో అతిశయోక్తిలేదు. 1844లో స్థాపించబడిన "రూర్కీ కళాశాలతో" డ్యూన్‌వ్యాలీ చరిత్ర

గతే మారిపోయింది. అదిమొదలు అచ్చట కుప్ప తెప్పలుగా వెలిశాయి మహాసంస్థలు. ఈనాడది భారతావనిలో ఒక గొప్ప విద్యాకేంద్రంగా నిలిచివున్నది. అరణ్య పరిశోధనా విద్యాలయం, భారతసైనికకళాశాల- ఇంకా ఎన్నో విద్యాసంస్థలు అచ్చట పాదుకొల్పబడినాయి.

ఫారెస్టు కాలేజీ మా రైతుల కొక మాయాబజారుగా కనుపించింది. పర్వతాలు - వాటిఅవంచులలో- లోయలలో, భీకరారణ్యాల సమూనాలు అతిసహజంగా ప్రదర్శింపబడినాయి.

అక్కడమండి చెట్లు నరికడం - పనిముట్లుచేయడం. ఇది సామాన్యమైన విషయమేకానచ్చు. అయితే ఒక్కొక్కవృక్షం మానవసమాజానికి ఎన్నివిధాలుగా- ఎన్నిరంగాలలో ఉపయోగపడుతుంది ? అని శిల్యపరీక్షచేసి పరిశీలిస్తే మన ఆశ్చర్యానికి అంతువుండదు. మానవసంతతి చాలా దొడ్డది. అలాగే తరు సంతతి. వృక్షశాస్త్రం విస్తృతమైంది. అది మానవ జీవనోపాధికీమార్గం - మానవజీవితానికి అండ. అది లేకపోతే మానవుడు లేడు. ప్రకృతిలేదు. అపాయంలోనున్న మానవ ప్రాణాన్ని వనమూలికలు రక్షిస్తాయి. మానవావసరాలలో ప్రధానమైన తిండికి, బట్టకి, వసతికి ఆధారం వృక్షాలే! అంతేకాదు. విజ్ఞానాన్ని ప్రసాదించే గ్రంథాలకు కాగితంకావాలి. ఆ కాగితపు ఉత్పత్తి చెట్లద్వారానే. మనం కూర్చునేకుర్చీలు, వ్రాసుకునే బల్లలు, పరుండే మంచాలు అన్నీ కర్రలతోనే మనం వాయించుకొనే పియానో, పిల్లనగ్రోవి, హార్మోనియం అన్నీ కర్రలతోనే.

ఈ విషయం కొత్తదికాదు. కాని ఆలోచిస్తే ఆశ్చర్యం గానే వుంటుంది. ఈ తెలిసిన సత్యాన్నే డెహ్రాడూన్ లోని ఫారెస్టు కాలేజీలో చూస్తే నిజంగా ఆశ్చర్యంకలిగింది. అరణ్యంచూస్తే వన్యమృగాల భీకరగర్జనలతో భయంకరంగా వున్నది. అరణ్యంలోని కలప మానవజీవిత విజ్ఞాన, వినోద, సౌఖ్యసంపదలకు ఆధార భూతములయ్యాము కొనుమరి! యావత్తు మానవసమాజాన్ని ఒక్క త్రుటిలో హత మార్చగల 'పరమాణశక్తి'లో మానవ జీవితాన్ని మహదానంద భరితం చేయగల అద్భుతశక్తి యిమిడియున్నది. మంచిగానీ, చెడుగానీ దాన్ని ఉపయోగ పరచుకొనే మార్గాల పైనే ఆధారపడి వున్నది. ఈ సత్యం డెహ్రాడూన్ ఫారెస్టు కాలేజీలో మాస్టర్సు ల మధ్య నగ్నంగా ప్రత్యక్షమైంది.

ఆ యావరణలోనే ఒక పెద్దఅరణ్యం అందులేని వృక్ష జాతి మరెక్కడా లేదేమో! అది నిజమైన అరణ్యం. వన్యమృగాలు మినహా చిన్న తుమ్మచెట్టు మొదలు - పెద్ద మర్రిచెట్టు వరకూ అన్నిజాతుల వృక్షసంతతీ ఆ యరణ్యంలో మాస్టర్సు లు చూడగలిగారు.

ఫారెస్టు కాలేజీ భవనపు శిఖరంనుండి నేము నలుదెస లా పరికించినప్పుడు భానుకిరణాలకు ఉవ్వెత్తున పొంగిపరవళ్లు తొక్కుతున్న డూన్‌వ్యాలీ ప్రకృతికాంత నవయవ్వనంలో మమ్మల్ని కన్నుగీటింది. ఆ ప్రకృతి రమణీయకతకు హృదయం స్పందించింది. నలుదెసల పర్వతపంక్తులు-అల్లంతదూరాన హిమవా

లయ శ్రేణులు—మధ్యన మహారణ్యం. దానికి మనవలె జరా మరణాలులేవు. ఎల్లప్పుడూ పూలోయలు చిలుకతూ— చిరునవ్వు నంతో — అమృతం సేవించిన అప్సరసలా సర్వాంగోభితమాన వరిల్లుతూంది

ఫారెస్టుకాలేజీ దాపులోనే మిలటరీకళాశాల. ఆదిభారత దేశరక్షణదళానికి శిక్షణగరిపే మహత్తర విద్యాసంస్థ పాలు లేపసి పిల్లలకు — దేశభక్తిని, ఉగ్గుబాలతో రంగరించిపోసి, దేశ రక్షణకు అఖండ పరాక్రమ శాలులుగా, రణరంగ ధీరులుగా తయారుజేసే మహత్తర సంస్థ.

అది ఆంగ్లేయుల సృష్టి, అయినప్పటికి ఈనాడు మాతృ భూమికి అజేయమైన రక్షణ దళాన్ని నిర్మిస్తున్నది.

పురాణ కాలంలో అశ్వమేధయాగాలు జరిగినట్లుగా — ఈ నాడు దేశరక్షణకు మహాయజ్ఞంజరుగుతున్న ఆ ప్రాంతం గూడా భారతీయులకు యాత్రాస్థలమే !

# ముస్సోరి

డెహ్రాడూన్‌లో గడపిన రెండు రోజుల్లోనూ మాలో కొందరం ముస్సోరీనిగూడా సందర్శించాము. సముద్రమట్టానికి 7000 అడుగుల ఎత్తులో హిమాలయ పర్వత శ్రేణుల్లోవున్న ముస్సోరీ ప్రయాణం అతిరమ్యంగా కొనసాగింది. ఇది ఆంగ్లేయులు నిర్మించుకున్న శీతలనగరం బస్సులలో ప్రయాణం ఒక చక్కని అనుభూతి. క్రిందనుంచి పైకి వెళ్లేలోపుగా రకరకాల శీతోష్ణ గతులను అనుభవించాము. డెహ్రాడూన్‌లో బయలు దేరినప్పుడు వేడిగావున్నది. రెండు గంటల్లో ముస్సోరీ చేరుకున్నాము మా దుస్తులు నెమ్ముకున్నాయి. చలి ప్రారంభమయింది. స్వెట్టర్లు, మఫ్లర్ల అవసరం అధికమయింది.

నగరం ఒక శిఖరంమీద నిర్మించబడింది నగరమంతా తిరగాలంటే పోనీలు (చిన్న గుర్రాలు) అవసరం. ఆనగరంలో ఉన్నంతసేపూ విదేశంలో వున్నట్లే విచిత్రానుభూతిని పొందాము. ఒకరకం మనుషులు కాదు. అన్ని ప్రాంతాల, దేశాల మనుషుల్ని అక్కడే చూడవచ్చు అక్కడినాగరికత వేరు. వేషభాషలు బహుళం. సిగ్గరితనం గలిగిన స్త్రీలు అరుదు. చట్టాపట్టాలుపట్టి షికార్లుచేసే స్త్రీపురుషజంటలుతరుచుగామనకండ్లను జిగేలు మనిపిస్తాయి. నాగరికత ఒక అడుగు ముందుకు నడిచింది, శీతలప్రాంతం అయినందునే కావచ్చు. పని తక్కువ. పైకి శ్రీమంతులుగనే కనిపిస్తారు. యాత్రిక సుంకాలవలన ఆ నగరానికి ఆదాయం జాస్తి. స్విట్జర్లాండు మోస్తరు. స్కేటింగు

బాల్ రూం డాన్సులు అధికం — అందుకు సంబంధించిన శిక్షణ కేంద్రాలు గూడా అక్కడక్కడ కనుపించాయి. కొయ్యతో నిర్మించిన గృహాలుజాస్తి. ప్రతి బజారులో, ప్రతి హోటలులో ప్రతి మూలలో ఒక వినోదగృహమున్నది. అసలు వీధులు — అందు సంచరించే మనుషులే మాకు వినోదమనిపించింది.

దారిచూపడంలో — అక్కడ సంచరించే స్త్రీలే మా కెంతో సహాయ పడ్డారు. యాత్రికుల్ని అతిథులుగా ఆదరిస్తారు. రాత్రిపూట విద్యుద్దీపాల కాంతుల్లో నెహ్రూ పార్కు కనులు పండువగా నున్నది.

ముస్సోరీ శిఖరంనుండి సూర్యాస్తమయ దృశ్యపు వింత శోభకు పులకిత మానచిత్తులమయ్యాము. సంధ్యాసమయంలో ముస్సోరీ కోలాహలంగా వుంటుంది నగరంలోని వారంతా వీధుల్లోనే విహారం చేస్తూవుంటారు. పనివున్నా — లేకపోయినా షాపుల జోలికిరాకుండాపోరు. షాపుల్లో లావణ్య యువతులు గొప్ప ఆకకర్షణ. అసలు అచ్చటి ఆకర్షణఅంతా ఆటలు — యువతులే. అదే అక్కడి రాజకీయం అదే అక్కడిజీవితం.

# లక్నో

లక్నోనగరం రామాయణకాలం నాటిదని ప్రతీతి. అది లక్ష్మణుని పేరుమీద నిర్మించబడిన "లక్మన్" అనే పట్టణమట. లక్మన్ కొన్నాళ్ళకు 'లక్నో'గా పరిణామం చెందినది.

ముస్లిముల పరిపాలనా కాలంలో 'లఖ్నా' అనే శిల్పి ఉండేవాడట. ఆయన పేరుమీదనే ఈ పట్టణం నిర్మించబడినదని మరొక వాడుక కలదు.

ఏ మైనప్పటికీ లక్నో కాలపరిభ్రమణంలో గొప్పకీర్తిని గడించింది. హిందూ - మహమ్మదీయ నాగరికతా - సంస్కృతుల సమ్మేళనానికి అదొక గీటురాయి.

రామాయణకథ ఉపనాయకుడు లక్ష్మణుని పేరుమీద ఎన్నోయుగాలనాడు ఆ పట్టణం నిర్మించబడినా - మహమ్మదీయుల కాలంలో ప్రసిద్ధిలోకి వచ్చినా - బ్రిటిషు మహాయుగంలో రాజధానిగా వాసికెక్కినా - లక్నో భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించిన చారిత్రక నగరం.

గోమతీనదిపై మనోహరదృశ్యాల మధ్య ప్రతిష్ఠితమైయున్న ఈ సుందరనగరం హిందూ మహమ్మదీయుల ఐక్యత నిదర్శనం. ఈ నగర నిర్మాణానికి - అభివృద్ధికి హైందవ - ఇస్లాం సంస్కృతి పునాది. ఈ పట్టణపౌరులు మాట్లాడే-ఉరుదు హిందూస్థానీ సమ్మిళిత భాషయే అందుకు దృష్టాంతరం. ప్రతియేటా పెద్దయెత్తున జరిగే మొహరం పండుగలో హిందూ - ముస్లింలు సమైక్యంగా పాల్గొనుటయే అందుకుసూటైనిదర్శనం.

ఉత్తరాపథంలో హిందూ - ముస్లిములు సమైక్యంగా వున్న నగరం ఒక్క లక్నోయే నని చెప్పవలసి వుంటుంది.

మొగల్ సామ్రాజ్యం ఇండియాలో పాతుకొనివున్న రోజులలో లక్నోకు అంతగా ప్రాముఖ్యత లేకపోయింది. ఔరంగజేబు దుష్టపాలన అనంతరం మొగల్ సామ్రాజ్యం విచ్ఛిన్న మయింది. బహదుర్షా అసమర్థు డయ్యాడు. సామంత రాజులు స్వతంత్రులయ్యారు. అప్పుడే హైద్రాబాదు అసఫ్‌జా నైజాం ముల్‌ముల్క్ దక్కను రాజ్యానికి స్వతంత్రాన్ని ప్రకటించుకున్నాడు. అది 1724 వ సంవత్సరం. అప్పుడే మహమ్మద్ అమీన్‌సాదత్ ఖాన్ ఔధ్‌కు స్వతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు. అప్పటినుండీ సాదత్ ఖాన్‌తో ప్రారంభమై లక్నో ప్రశస్తి దినదినాభివృద్ధి జెందుతూవచ్చింది. సాదత్ ఖాన్‌తో ప్రారంభమైన ఔధ్‌వజీరుల వంశం లక్నో నగరాన్ని ఒక అద్భుత కళాఖండంగా రూపొందినది. వజీరుల వంశం 132 సంవత్సరాలు ఔధ్‌ను పరిపాలించింది. 1855 లో బ్రిటిషు గవర్నరు లార్డ్ డల్‌హౌసీ అనేక సామంతరాజ్యాలతోబాటు ఔధ్‌నుగూడా కబళించి - చిట్టచివరి వజీర్ అయిన నవాబ్ వజీద్ ఆలీషాను భరణమిచ్చి కలకత్తా పంపించాడు. ఆనాటినుండి లక్నో తూర్పుయిండియా కంపెనీ స్వాధీనమైంది. ఆ మరుసటి సంవత్సరమే ప్రజ్వరిల్లిన 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామానికి గల కారణాలలో ఇదొకటి.

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం జరిగిన ప్రదేశాలలో లక్నో నగరం ప్రసధామైంది.

మా రైతులు. లక్నో స్టేషనులో దిగటంతోనే సిపాయీల కలహం జరిగినచోటు చూడాలన్నారు. ఔను, మరి! భారతజాతీయ విప్లవ పోరాటానికి నాంది ప్రస్తావన గావించిన 1857 భారత స్వాతంత్ర్య సంగ్రామ రంగస్థలాన్ని చూడాలని ఏ భారతీయుడు వాంఛించడు!

ఆనాటి మంగళపాండ్యా, ఝాన్సీ లక్ష్మిబాయి, తంతియాతోపి, నానా సాహెబ్ ఈ నాటికీ స్వతంత్ర భారత పౌరుని హృదయాలలో అమరవీరులే కదా!

బ్రిటిషు ప్రభుత్వం ప్రవేశపెట్టుచున్న సంస్కరణలను సరిగా అర్థంచేసుకోలేక కొందరు తీవ్రవాదులు – మతపిచ్చిగాళ్ళు, అధికార వ్యామోహితులు – ఈ తిరుగుబాటును లేవదీశారని ఆంగ్లేయులు వ్రాసికొన్న చరిత్రలలో మనం చదువుకొన్నాము. అది "సిపాయి పితూరి" కాదు – ప్రథమ భారతస్వాతంత్ర్య సంగ్రామం. రాజకీయ చతురత లేని సామంత రాజులను అణచి – పదబహిష్కారం చేసి – భారతావనిలో ఆంగ్లేయులు స్వైరవిహారం సల్పారు. బ్రిటిషువారి చరిత్రలో ఘనంగా చెప్పుకోబడుతున్న లార్డ్ డల్‌హౌసీ అతి నిరంకుశంగా – కసాయివాడిలాగా వ్యవహరించాడు. దేశభక్తులైన రంజత్ సింగ్‌ను – మైసూరులో టిప్పుసుల్తానును ఓడించాడు. మైసూరును, పంజాబును కలుపుకున్నాడు. పీష్వాల రాజ్యాన్ని కబళించాడు. ఝాన్సీ రాజ్యాన్ని కబళింపజూచాడు. ఔధ్‌ను మ్రింగి – నవాబును కలకత్తా పంపించాడు. రాజులు – జమీందారులు ఎదురు తిరిగారు. కంపెనీవారి పక్షపాత వైఖరివలన భారత సిపాయీలలో అసంతృప్తి జనించింది.

దేశాన్ని కొల్లగొట్టడం తప్ప, సౌకర్యాలు సూన్యమయ్యాయి తత్కారణంగా ప్రజలలో అసహనం పెరిగిపోయింది. ఝాన్సీలో లక్ష్మీబాయి, కాన్పూరులో నానా సాహెబ్ విజృంభించారు. మే 10 న మీరట్ సైనికులు తిరగబడ్డారు. లక్నోలో సైనికులు-పౌరులుకలిసి బ్రిటిషువారి రెసిడెన్సీనిపట్టు కున్నారు. అందులోని ఆఫీసర్లు జౌత్ రాం - హేవిలక్ ను ఖైదు చేశారు. ఢిల్లీ ఈస్టిండియా కంపెనీనుండి విముక్తిచెందింది. చిట్టచివరి మొగల్ పాదుషా బహాదర్షాకు - భారతదేశ పట్టాభిషేకం కూడా జరిగింది.

కానీ నిర్మాణాత్మకంగా విప్లవం జరగనందున, నైజాం లాంటి బ్రిటిషుఇండియా సంస్థానాధిపతులు తెల్లవాళ్ళకు మద్దతు యిచ్చినందున తిరుగుబాటు అనతికాలంలోనే విఫల మయింది. ఝాన్సీరాణి వీరస్వర్గ మలంకరించింది. మరాఠా వీరుడు తంతియాతోపీ ఉరితీయబడ్డారు ఢిల్లీలో బహదర్షా కుమారులిద్దరూ నడివీధిలో - నిట్టనిలువున తెల్లసైనికులచే కాల్చివేయబడినారు. లక్నోలో సైనిక నాయకులు కాల్చి వేయబడ్డారు. తెల్లసైన్యాధిపతి నీల్ దొర స్త్రీపురుష విచక్షణ లేకుండా వేలాది భారతీయుల్ని పొట్టనపెట్టుకున్నాడు. రాస్తాల ప్రక్కన కనుపించిన వారినందర్నీ పట్టుకొని చెట్లకు వ్రేలాడతీయిం చాడు. అమాయకుల్ని తుపాకిగుండ్లకు ఎరచేశాడు. లక్నోను తిరిగి స్వాధీనం చేసికోనేందుకు కొన్ని వేల ప్రాణాలనుబలితీసు కొనవలసి వచ్చింది. నీల్, హేవలాక్ నాయకత్వాన లక్నో లో మానవవధ ప్రారంభమైంది. భారతవీరులు ప్రాణాలకు తెగించి పోరాటం సాగించారు. చివరి వీరుడు మరణించేదాకా

లక్నో స్వాధీనం కాలేదు. చివరకు స్మశానాన్ని 1858 మార్చి లో నిలుడు స్వాధీనం చేసికొన్నాడు.

పోరాటం అణచివేయబడింది. అంతటితో భారతదేశం లో మొగల్ సామ్రాజ్యం నామరూపాలులేకుండా నశించింది బాబరు వారసత్వమయిన బహదూర్‌షా కుమారుడు - నిండు ప్రాణాలతో వధించ బడటంతో మొగల్ సామ్రాజ్యం అంత మొందింది. అంతేకాదు. విక్టోరియా రాణి భారతదేశానికి చక్రవర్తిని కావడంతో తూర్పు ఇండియా కంపెనీ పాలన గూడా అంతమైంది.

ఆనాటి పోరాటపు చిహ్నాలు లక్నో రెసిడెన్సీలో ఇప్ప టికీ కనుపిస్తూనే వున్నాయి. అప్పటి పోరాటంలో చచ్చిన ఆంగ్లేయులు వీరులుగా చిత్రించబడ్డారు. అందుకే వారి సమా ధులు ఇప్పటికీ అందులో చెక్కు చెదరకుండా వున్నాయి ఈ రెసిడెన్సీ భవనాన్ని 1800 సంవత్సరంలో బ్రిటిషువారు కట్టించు కున్నారు. 1857 పోరాటంలో ఇది పూర్తిగా దెబ్బతిన్నది, ఆ దెబ్బతిన్నదాన్ని మరామ్మత్తు చేయకుండా ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ చిహ్నంగా అలాగే వుంచారు. అచ్చటి బ్రిటిషు వీరులకు చలనరాని సమాధులు. భారతీయ వీరులకు ఆ పడిపోయిన, శిథిలమైన గోడలు - పునాదులేకదా!

లక్నో మహమ్మదీయుల "ఇమాం బ్రాల"కు ప్రసిద్ధి ఇవి బ్రహ్మాండమైన నిర్మాణాలు. 'ఇమాంబ్రా'అనగా మొహ రం పండుగ జరుపుకొనే ఆలయాలు. మొహరం మహమ్మదీ యులకు నరకచతుర్ధశి లాంటిది. హజరత్ ఆలీఅనేఒక మహమ్మ దీయప్రవక్త తనకొడుకులైనహస్సన్-హుస్సేన్ అనేవారలుకలిసి

మహమ్మదీయ మతరక్షణకు, విస్తృతికీ యూదులతో హోరా హోరిగా పోరాడి వీరస్వర్గ మలంకరించి పీరులయ్యారు. ఆపీరు లనే పీర్లు అంటూ వుంటాము. వారి వర్ధంతినే పీర్ల పండుగగా ప్రతి యేటా మహావైభవంగా జరుపుకుంటూ వుంటాము. అదే మొహరం.

హజరత్ అలీ మహమ్మదీయ ధర్మసూత్రకారుడు మహమ్మదీయ సాంఘిక వ్యవస్థను కట్టుదిట్టంగా రూపొందించ డంలో మతస్థులను ఒక త్రాటిపై సంఘటిత పరచడంలో, మతంకొరకు ప్రాణాలనైనా వొడ్డాలని ప్రబోధించి-కత్తి పట్టవ లెంటే ముస్లిమునకు మంచినీళ్ళ ప్రాయంగా చేసిన గొప్ప ప్రవక్త హజరత్ అలీ.

అయితే ఆపీరులు హిందువులకుగూడా ఆరాధ్యప్రాయు లయ్యారు. అది వారి మతపిచ్చకాదు. వారిదీక్షనే హిందు వులు ఆదర్శంగా తీసుకొని యుండవచ్చు. మన పల్లెలలోని ముస్లిం సోదరులు – 'పోలేరమ్మ, అంకమ్మ' దేవతలను కొలిచి నట్లుగా దీనిని మనం మతైకదృష్టితో కాక, హిందూ– ముస్లిం సఖ్యత దృష్టితో చూడడం సమంజసం

లక్నోలోని "బడా ఇమాంబరా" మూ ర్ఖులన్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది. దీనిని ఔధ్ నవాబ్ అసఫ్‌దౌల్లా 1784 లో నిర్మింపజేశాడు. గోమతీనది వొడ్డున ఈ మహత్తర నిర్మాణం - తనకుసాటి ఎవరన్నట్లు నిలిచియున్నది. మధ్య ఒక పెద్దహాలు – 60 అడుగుల ఎత్తుగల ఆ విశాలమైన హాలుకు స్తంభాలులేవు. అంత పెద్ద ఎత్తయిన, విశాలమైన స్థంబాలుగానీ మరేవిధమైన ఆధారంగానీ లేకుండా జరిగిన ఆ నిర్మాణం,

అప్పటి ఇంజనీర్ల ప్రతిభను వేనోళ్ల చాటుతుంది. హాలుఉపరి భాగంలో షాండ్లియర్లు, కారిడర్లు ఆ కట్టడానికి మరింత అందాన్ని చేకూరుస్తున్నాయి. అన్నిటికంటే చిత్రం, ఆ కట్టడం పై అంతస్థులోని "పద్మవ్యూహం". కొత్తవారు ఆ వ్యూహంలో మార్గం పడవలసిందే, పోయినదారి ఏదో వచ్చే దారి ఏదో తెలిసికోవడం దుర్ధరం. అదీ ఆనాటి డిజైనర్ల ప్రతిభయే నని చెప్పవచ్చు.

అదే ప్రాంతంలో "రూమీ దర్వాజా" మహమ్మదీయ హిందూ శిల్ప కళానైపుణ్యాన్ని చాటుతుంది. దాని వెనుక భాగంలో 1842 లో వజీర్ నవాబ్ మహమ్మద్ అలీషా కట్టించిన "ఛోటా ఇమాంబరా" సౌదర్యానికి ఒకగీటురాయి. దీనిలోని గాజులతో అతి నైపుణ్యంగా చెక్కబడిన జ్యోతులు, గిల్టు చెక్కబడిన అద్దాలు ఈ భవనానికి ఎంతో శోభను చేకూర్చాయి. ఇది తాజ్‌మహల్‌ను పోలివుండటమే కాక ఇందులోని కళానైపుణ్యం యాత్రికులను ఆశ్చర్య చకితుల్ని చేస్తాంది. దీనిప్రక్క విహారంలో ఔధ్ నవాబుల వర్ణచిత్రాలు అమర్చబడియున్నాయి.

కాసరీబాగ్ – కుర్షీద్ మంజిల్, షా జాఫ్ లక్నోలో చెప్పుకోదగిన కట్టడాలు.

లక్నో ఉద్యానవనాలకు ప్రసిద్ధి. నవాబుల విహారాలకు నిర్మించబడిన ఈ ఉద్యానవనాలు - ఈనాటికీ ఆనాటి నవాబుల విలాస జీవితాల్ని చాటుతున్నాయి ఔధ్‌నవాబులు విలాసపురుషులనీ, ప్రజల క్షేమంకంటే రాజకుటుంబాల వినోదాలకే ఖజానాలలోని డబ్బంత ఖర్చయిందని ప్రతీతి. ఔధ్

కుఅక్బర్ పాదుషాచే గవర్నర్లుగా నియమించబడిన ఈ నవాబుల వంశం - ఔరంగజేబు అనంతరం స్వతంత్రులై - పరిపాలలో అసమర్థులని నిరూపించుకొన్నారు. డల్హౌసీ - ఔధ్‌ను తూర్పు ఇండియా కంపెనీలో కలుపుకొనేందుకు ఇదొక కారణమంటారు.

ఈనాడు లక్నోలో ప్రతికుటుంబానికీ ఒకపూర్వచరిత్ర ఉన్నదట. నగరంలో తిరిగి చూస్తూవుంటే - పురాతన భవనాలు - శిథిలావస్థలోనున్న కట్టడాలు ఆ నగరానికి ఎంతో గతచరిత్రవున్నదని అర్థం చెప్తున్నాయి. లక్నోలో హాజరత్ గంజే ప్రధాన వ్యాపార కేంద్రం. ఇది లక్నో రాజవీథి. ఆనాటికీ - ఈనాటికీ ఇదే రాజవీథి విశాలమైన రాస్తాకు ఇరువైపులా అమర్చబడిన అందమైన అంగళ్లు, బజారు కనులపండువగా ఉంటుంది. ఆ వీథిలో సంచరించే స్త్రీలనుగాని, పురుషులనుగానీ- హిందువో, ముస్లిమో గుర్తించడం కష్టం. ఆనగరంలో అన్నివిధాలా- ఆ రెండు తెగలూ కలిసి పోయాయి.

లక్నో సంగీత, సారస్వత సమ్మేళనాలకు పెట్టింది పేరు. లలితకళలకు ప్రాశస్త్యం వహించిన ఆ నగరం ఒక కళాఖండంగా కనిపిస్తుంది. అన్నింటికంటే విచిత్రం గాలిపడగల వినోదం పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు అనే విచక్షణ లేకుండా తీరిక సమయాల్లో - ముఖ్యంగా సాయంసమయాల్లో గాలిపడగలను ఎగురవేసికొని, ఆ వినోదంలో విలీనమై పోతారు. పట్టణమంతా గాలిపడగలమయమే.

లక్నో జనాభా 5 లక్షలు. ఉత్తర ప్రదేశ్‌కు రాజధానీ నగరం. విద్యాక్షేత్రం. ప్రసిద్ధమైన విశ్వవిద్యాలయ

మున్నది. శాసనసభా కౌన్సిలుహాలు ఒక అద్భుతమైన కట్టడం. బడా ఇమాంబరా ఎక్కినప్పుడు పక్షిదృష్టిలో లక్నో నగర దృశ్యం మనోహరంగా కనుపిస్తుంది. లక్నోనుండి గౌతమ బుద్ధుని జన్మస్థలం లుంబినీవనానికి వెళ్ళనచ్చును.

ఇప్పటికే మా రైతులు దేశంలో ఎన్నో ప్రాంతాలను సందర్శించారు. అయితే హిందూ, ముస్లిం, నాగరికతా, సంస్కృతుల సమైక్యతకు చిహ్నమైన లక్నోనగరం మా రైతులకు ఒక నూతన అనుభూతిని కలిగించింది. ఇది మరపురాని అనుభూతి.

## అయోధ్య

మనం రామరాజ్యం కావాలంటున్నాము. రామరాజ్యం కావాలని మహాత్మాగాంధీ అన్నారు. రామరాజ్యమంటే ఏమిటి? సర్వప్రజలు సుభిక్షంగా జీవించడం. రామరాజ్యములో ప్రజలు సుఖజీవనం గడిపారని వాడుక. ఇది ఒక ఆకర్షవంతమైన నినాదం. అందుకే ఆ నినాదాన్నిచ్చారు మహాత్ముడు. ప్రార్థన సభలో 'రాంధున్' పాడించేవారు.

మహాత్ముడు చెప్పిన రాముడు అయోధ్య రాముడేనా? అయోధ్య రాముడంటే హిందువులకు భక్తిమెండు. భారత దేశంలో ప్రతి గ్రామంలోనూ రామాలయమున్నది. ప్రతి

రోజూ 'రాంభజనలు' సాగుతున్నాయి అందుకే బాపూజీ రామరాజ్య మన్నారు, ఆయన. అయోధ్యరాముడు కావచ్చు-ఆత్మారాముడు కావచ్చు. రాముడు భగవంతుడా - కాదా అనే మీమాంసతో మనకు పనిలేదు. రాముడు భగవత్ స్వరూపమని హిందువుల నమ్మకం. ఆ పేరున మంచి జరిగితే సంతోషం. ఆ రాముడు జన్మించిన అయోధ్యలో మార్వాడీలు ఒక్కరోజు గడిపారు.

అయోధ్య వేదకాలంనాటిది. కృతయుగంనుండీ అయోధ్యప్రశస్తిలో వున్నది. ఆర్యావర్తనకు అయోధ్య రాజధాని.

ఆర్యులు ఉత్తరధృవ నివాసులని కొందరంటారు. దేవతలలో ఒక తెగ అని కొన్ని శాస్త్రాలు చెప్తున్నాయి. ఆ దేవతల రాజ్యమే ఉత్తర ధృవంలో ఎప్పుడో ఉండేదనీ; హిమ ప్రళయంతో నివాసయోగ్యం కాకుండా పోయిందనీ, అప్పుడు ఆ ధృవ నివాసులు ప్రపంచంలో .వివిధ ప్రాంతాలకు వలస వెళ్ళారనీ - అందులో ఒక తెగ మధ్య ఆసియామీదుగా టిబెట్టులో ప్రవేశించి - అచ్చటనుండి - కాశ్మీరువచ్చి - హిందూకుష్ పర్వతాలమీదుగా ఉత్తర భారతంలో హిమాలయ పర్వతప్రాంతాలలో సింధు, గంగ, యమునానదీ లోయలలో స్థిరనివాసా లేర్పరచుకొని, ఆదివాసులను దక్షిణాపథానికి తరిమి - రాజ్యాలను స్థాపించుకొన్నారనీ "బాలగంగాధర తిలక్" తమ "ఆర్యులు ఉత్తరధృవ నివాసులు" అనే గ్రంథంలో ఉటంకించారు. ఏమైనా ఆర్యులు శీతల దేశస్థులు కాబట్టి - బలిష్ఠంగా ఉండేవారు. తెలివిగలవారు. అందుచేత ఆదివాసులను సులువుగా పరాజితులను గావించడం జరిగింది. శ్రీరామ

చంద్రుడు ఆర్యసంతతివాడే. శ్రీరామచంద్రుని కథలు తెలియని భారతీయుడులేడు. అందుచేత ఆ మీమాంస ఇచ్చట అప్రస్తుతం.

అయోధ్యకు ప్రతియుగంలోనూ ఒక గొప్ప ఇతిహాసమున్నది. అది ఒకప్పుడు కోసలదేశానికి ముఖ్యనగరం. పూర్వ సామ్రాజ్యంలో ప్రధాన నగరం. మొగల్ పాదుషాల కాలంలో అయోధ్య రాజ్యం ఔధ్‌గా పరిమార్పు చెందినది.

అయోధ్యనగరం ప్రక్కన సరయూనది గంభీరంగా ప్రవహిస్తూవున్నది. సరయూనదినిగురించి గూడా మనం కథలు చదువుకున్నాము.

సరయూనదిలో నీళ్లు ముంచుతున్న మునిబాలకుని-మదకరియని భ్రమపడి అంబున కొట్టిన దశరథుడు శాపమునకు గురియై - పుత్రవియోగంతో విలవిల తన్నుకొని బలవంతపు మృత్యువుపాలయ్యాడని రామాయణ కథ మనకు చెప్తున్నది. అంధ తాపసుల కోపకారణమే...సీతా రామలక్ష్మణుల వనవాసమని వ్యాఖ్యానిస్తున్నారుకూడా. ఆ వనవాసం ఆర్యావర్తాన్ని విస్తరింప జేసిందికదా! దక్షిణాదిన వానర రాజ్యాన్ని, లంకలో రావణ రాజ్యాన్ని పాదాక్రాంతం జేసికొనుటకు తాపసుల శాపమే శ్రీరామునకు వరప్రసాదమైనది. లేకపోతే కైకేయి వరములు రెండూ రామచంద్రునికే వర్తింపవలెగాని - సీతా లక్ష్మణులు వెళ్ళవలసినపనిలేదుగదా! "ఇది దైవేచ్ఛ". రాక్షస సంహారానికి శ్రీ మహావిష్ణువే నరరూపధారియై పోవుచుండ - ఇంతటి స్వల్ప విషయాలు లెఖ్ఖకు తీసుకోనగునా! ఆయన మాయా మానుష విగ్రహుడు.

ద్రావిడ రాజ్యము, ద్రావిడ రాజులు ఆర్యులకు సామంతరాజు లగుటకు కారణభూతమయిన, ఉత్తర, దక్షిణా పథాలను ఏకఛత్రాధిపత్యం క్రిందకు తీసుకరాగల సరయూ నదిలో మా రైతులు స్నానమాచరించారు. సరయూనది విశాలమైంది. లోతైనది. నావికా వ్యాపారానికి అనువైనది. స్టీం బోట్లు ద్వారా ప్రయాణానికి అనుకూలమైనది. నదినిండా కూర్మావతారాలు విచ్చలవిడిగా ఉన్నాయి.

సరయూనదిలో స్నానమాడి పౌరాణిక ఇతిహాసానికి ప్రాముఖ్యతసంతరించుకొన్న అయోధ్యానగరంలో ప్రవేశించాము.

అయోధ్య వేదాలకుముందే అప్రతిహతమానమై యున్నట్లు చెప్పబడుతుంది.

అన్ని యుగాలలోనూ - అయోధ్య ప్రాశస్త్యం ఈ మాత్రమూ తగ్గలేదు ఆంగ్లేయుల హయాంలోనే అది సామాన్య పట్టణంగా నిలచిపోయింది.

పురాణ యుగంలో ఆర్యావర్తానికి మకుటంగా నిలచి నది అయోధ్య. గౌతమబుద్ధునకు పూర్వం- తర్వాత కొన్నాళ్ళవరకూ - ఉత్తరా పథంలో ప్రధానంగా మూడే రాజ్యాలుండేవి. అవి కోసల, మగధ, అవంతి. కోసల రాజ్యానికి రాజధాని అయోధ్య ఆనాటి రాజులలో మొట్టమొదటగా బౌద్ధ ధర్మాన్ని స్వీకరించిన మగధరాజు బింబిసారుడు. కోసలరాజకన్యను పరిణయ మాడినట్లు చెప్పుకొంటారు. బింబిసారుని కుమారుడు అజాతశత్రువు. ఈతడు తండ్రిని వధించి సింహాసనాన్ని ఆక్రమించుకొని-తర్వాత గౌతమబుద్ధుని యెదుట పశ్చాత్తాపం పొంది - బౌద్ధుడైనాడు. గంగా - సోన్ నదుల సంగమ స్థానంలో అజాత శత్రువు ఒక

బ్రహ్మాండమైన కోటను నిర్మించాడు. అదే మగధరాజ్యానికి రాజధానీ నగరమైన పాటలీపుత్ర. ఇప్పుడది బీహార్ రాజధాని పాట్నా. కొన్నాళ్ళకు అజాతశత్రు అనంతరపు మగధ రాజొకరు కోసలరాజ్యాన్నికూడా తన సామ్రాజ్యంలో కలుపుకొన్నాడు. కోసలను కలుపుకోవడంతో — మగధసామ్రాజ్యం — ఉత్తరాపథంలో ఒక బలమైన శక్తిగా రూపొందినది.

తర్వాత కొన్నాళ్ళకు మగధరాజులైన ఈ శిశునాగ వంశాన్ని నందుడనే ఒక కడజాతి సంతోస్థుడు పదభ్రష్టులను గావించడంతో మగధ సామ్రాజ్యంలో 'నవనందులు' క్రీస్తుకు పూర్వం 322 వరకు రాజ్యమేలారు. 325 లో శిశునాగుల రాజకుటుంబీకులైన చంద్రగుప్తుడనే యువకుడు విజృంభించి 322 లో నవనందుల్ని పదభ్రష్టుల్ని చేశాడు.

చంద్రగుప్తుడే మొట్టమొదటి భారత చక్రవర్తి అంటారు. వింధ్య పర్వతాల వరకూ చంద్రగుప్తుని సామ్రాజ్యం విస్తరిల్లింది. దేశాన్ని సమైక్యం చేయుటకు — ప్రజలను ఒకే పరిపాలనక్రిందకు తీసుకవచ్చుటకు చంద్రగుప్తమౌర్యుడు ఎన్నెన్నో యుద్ధాలు సాగించాడు. ఆయన కాలంలోనే అలెగ్జాండరు సైన్యాధిపతి సెల్యూకస్ భారత దేశంపై దండెత్తగా — చంద్రగుప్తుడు ఆయన్ను ఎదుర్కొని పరాభూతుణ్ని చేసి పరమ మిత్రుణ్నిగా చేసికొన్నాడు. తత్ఫలితంగా చంద్రగుప్తునకు— అచ్చటి బెలూచిస్థాన్, దక్షిణ ఆఫ్ఘనిస్థాన్ లభించడమే గాక, గ్రీకు యువరాణి పట్టమహిషిగా లభ్యమయింది.

అశోకుని అనంతరం మగధ సామ్రాజ్యం ముక్కలు ముక్కలైంది. తర్వాత పరిపాలనకు వచ్చిన కణ్వులను ఆంధ్ర

రాజులు పోషించారు. తర్వాత మూడు శతాబ్దాలవరకు మగధ రాజ్యం అంధకారంలో వున్నది. ఆతర్వాత గుప్తయుగం ప్రారంభమైంది చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలంలో తిరిగి అయోధ్య ప్రాశస్త్యానికి వచ్చింది. పాటలీపుత్ర అధికారయుతంగా రాజధానియైనా వాస్తవానికి అయోధ్యయే విక్రమాదిత్యుని రాజధానిగా పరిగణించబడింది. విక్రమాదిత్యుని గురించి ఈ నాటికీ చిత్రవిచిత్రాలైన కధల్ని చెప్పుకుంటుంగదా !

గుప్తరాజుల స్వర్ణయుగం మధ్య ఆసియానుండి వచ్చిన శ్వేతహూణుల దండయాత్రతో అంతమైంది. థానేశ్వర్‌లో చిన్నరాజ్యానికి అధిపతియైన హర్షుని ధాటికి హూణులు ఆగలేక గుజరాత్‌లో చిన్న రాజ్యాన్ని నిర్మించుకొని – హిందూ మతాన్ని స్వీకరించి భారతీయులయ్యారు అనతికాలంలోనే ఆర్యావర్తాన్ని హర్షుడు జయించి – చక్రవర్తిఅయ్యాడు. తిరిగి హర్ష చక్రవర్తి అనంతరం దేశంలో అరాచకం ప్రబలింది. ఉత్తరాపథం ముక్కలు ముక్కలయింది. అప్పుడే అయోధ్యలోని రాజపుత్రులు విజృంభించారు. శ్రీరామచంద్రుని వంశస్తులమనే పేరుతో ఆర్యావర్తనాన్ని లోబరచుకొన్నారు. అది క్రీ. శ. 850 అప్పటికే భారత దేశం–విభిన్న సంస్కృతుల – నాగరికతల, భాషలకూడలియైంది. మహమ్మద్ గోరీ కుట్రతో ఢిల్లీలో పృథ్వీరాజు పతనమై – వధించబడిన తర్వాత ఉత్తర దేశంలో హిందూరాజుల పరిపాలన అంతమైంది. దానితోబాటు హిందువుల పవిత్రప్రాంతమైన అయోధ్యగూడా మహమ్మదీయుల హస్తగతమైంది. అయోధ్యలోని రామాలయాలన్నీ తురుష్కుల మసీదులయ్యారు.

దేవతా విగ్రహాలన్నీ తురుష్క రాజుల మేడ మెట్లయ్యాయి.

1321-25 సంవత్సరాల మధ్య మహ్మద్ బిన్ తుగ్లక్ పిచ్చిచేష్టలకు, నిరంకుశత్వానికి అయోధ్యలో తిరుగుబాటు చెలరేగింది. ఆ తిరుబాటులో అయోధ్యపౌరులు తండ్రిలేని బిడ్డలయ్యారు. తురుష్కుల క్రూరత్వానికి తాళలేక అడవుల పాలయ్యారు. పారిపోతున్న వారిని సుల్తాన్ సైనికులు వెంబడించి వేటాడారు.

ఈస్టిండియా కంపెనీ పెత్తనంలోకి వచ్చేవరకూ అయోధ్య (ఔఫ్) మహమ్మదీయుల పరిపాలనలోనే వున్నది. అక్బర్ అనంతరం ఔధ్ నవాబు స్వతంత్రుడయ్యాడు. అంతటితో ఔధ్ వజీరుల పరిపాలనక్రిందకి వచ్చినది. వజీరులు అసమర్థులు, సోమరులు, విలాసపురుషులు వజీరులక్రింద వున్న ఉద్యోగులు లంచగొండులు, నిరంకుశులు. తత్కారణంగా వజీరులు ఔఫ్ ప్రజల మన్ననలను పొందలేకపోయారు. డల్హౌసీ ఈ వజీరులను బలవంతంగా పదభ్రష్టుల్ని గావించి ఔఫ్‌ను ఈస్టిండియా కంపెనీలో కలుపుకున్నాడు. అంతేకాదు. వజీరుల బేగంల ఆస్తిపాస్తుల్ని గూడా కాజేశాడు. అంతటితో అయోధ్యకు మహమ్మదీయుల బెడద వీరగడైంది. మశీదులుగా మారిన రామాలయాలు కొన్ని తిరిగి రామాలయాలయ్యాయి. ఒక ప్రసిద్ధ ఆలయాన్ని గురించి ఇప్పటికీ జగడం సాగుతూనేవున్నది. కోర్టు లావాదీవీలు గూడా జరిపించబడ్డాయి. ఆ రామాలయంలో ప్రతిరోజు -- రాత్రింబవళ్లు రామభజన జరిపించబడుతున్నది. ఆ ఆలయం హిందూ ఆలయంగానూ - మహమ్మ

దీయుల మశీదుగానూ - కనుపిస్తుంది. అయోధ్యలో పెద్ద పెద్ద రామాలయాలే కాకుండా ప్రతిఇంటా రాముడున్నాడు. అది రాముడు బంతులాడినచోటు. ఇది శ్రీరామ చంద్రుని జన్మస్థలమని ఒక శిథిలమైన పురాతన ప్రాంతం చూపెట్టబడింది. అక్కడే అనేక మంది సూర్యవంశపు రాజులు అశ్వమేధ యాగాలుచేశారు. అక్కడే దశరథమహారాజు పుత్రకామేష్టి యాగం జరిపాడు. అక్కడే బ్రహ్మర్షి వశిష్టుడు వేద పారాయణం చేశాడు. అక్కడే విశ్వామిత్రుడు సత్య హరి శ్చంద్రుని కానలకుబంపి యతి రాజ్యమేలినాడు. అదే పరశురాముడు ఒకప్పుడు న-భైమంది క్షత్రియ రాజులను పరశువుతో సంహరించిన ప్రదేశం. అక్కడే రాముడు పుట్టింది, మెట్టింది. అప్పుడు రాముడు పుట్టినచోట ఇప్పుడు 'జన్మభూమి ఆలయం' వెలసియున్నది. ఆనాడు సీతాదేవివంట చేసినచోట ఈనాడు 'సీతా రసోయి' మందిరం ప్రవర్ధమానమై యున్నది. శ్రీరామచంద్రుని రత్నసింహాసనమున్నచోటు— ఇప్పుడు మనకు చూపించబడుతుంది. ఆనాటి అయోధ్య రాజ్య పుకోశాగార మున్నచోట కనకభవన ఆలయమున్నది లక్ష్మణ స్వామి భూమాత గర్భములో అంతర్ధానమయ్యారట. దానినే ఇప్పుడు లక్ష్మణఘాట్ అంటారు. అన్నిటికంటే ప్రసిద్ధమయినవి. హనుమాకుఘర్ ఆలయం. అవామామందిర్, నూతన నిర్మాణం చలవరాతితో అద్భుతంగా నిర్మించిన ఆలయం. ఒకటేమిటి అయోధ్యలో నివాసగృహాల కంటే రామాలయాలే ఎక్కువనిపించింది. అక్క ఎటేటా రావణుని కాల్చి మసిచేస్తారు. అదే దుష్టశిక్షణకు చిహ్నమంటారు.

రాముడు అవతారమూర్తి కావచ్చు. కొందరంటు న్నట్లు కాకపోవచ్చు. శ్రీ నెహ్రూ తమ "Discovery of India" గ్రంథంలో చెప్పినట్లు ఆర్య సామ్రాజ్యాన్ని దక్షిణా పథంలో విస్తరింపజేసిన మహావీరుడనేందుకు సందేహంలేదు. రాముడు ఒకయుగాన్ని సృష్టించుకొన్నాడు. రామాయణం హిందువులకు పవిత్రగ్రంథం. తత్కారణంగా ఆయన నిస్సందేహంగా యుగపురుషుడే.

# ప్రయాగ

శ్రీరామచంద్రుని జన్మస్థానం అయోధ్యలో ఒకరోజు గడిపిన తర్వాత జూన్ 14 న ఒక పురాతన చారిత్రక మహా పుణ్య నగరాన్ని సందర్శించాము, భారతీయ నాగరికతకు, హైందవ సంస్కృతికి – హిందూదేశపు ఇతిహాసానికి పునాదులు వేసిన, పెంపుజేసిన, పటిష్ఠమొనర్చిన గంగా, యమున, అంతస్సరస్వతీ నదీమతల్లుల సంగమస్థానం అలహాబాద్. అక్కడి మనకండ్లకు కనుపించేవి రెండే నదులు – గంగ, యమున. సరస్వతి అంతర్వాహిని మాత్రమే. ఇందు ఏదో ఒక మహత్తర శక్తి–అనూహ్యమైన వేదాంతం – ఉండినదంటారు. గంగ, యమున, సరస్వతి సముద్రుని భార్యలు. ఆ యంత ర్వాహిని మహిమ తన గర్భంలో విలీనం చేసికొన్న సాగరునకే తెలియాలి.

ఈ త్రివేణి సంగమస్థానం దేవతలు అమృతకుంభాన్ని ఎత్తుకవచ్చి ఆరగించినచోటు. మనం పురాణాల్లో వింటూవుంటాము. సురులకు - అసురులకు యుద్ధాలు జరిగాయని - యుద్ధాలు జరిగాయని - ఈ యుద్ధాలు ఈ ప్రాంతంలోగూడా జరిగినట్లు ప్రతీతి,

సురలు (సురాపానం సేవించేవారు) అసురులు (సురాపాన బహిష్కారులు] అమృతం కొరకు క్షీరసాగరాన్ని - మేరుపర్వతం కవ్వంగా నూ, వాసుకి (సర్పము) త్రాడుగా నూ జేసికొని మర్దించారని పురాణాలలో వింటున్నాముగదా! అసురులకు దేవతలిచ్చిన నామధేయం రాక్షసులు. ఈ రాక్షసులు వాసుకి శిరోభాగాన్నీ - దేవతలు తోకను పట్టుకొని పాల సంద్రాన్ని చిలికారు. పాపం వాసుకివిషజ్వాలలకు ఎందరో అసురులు అశువులు బాసినారుగూడా. అమృతం (వెన్న) పడగానే దానికొరకు దేవతలు - రాక్షసుల మధ్య జగడం బయలుదేరింది.

ఈ అమృతంపై రాక్షసులకు అసలు అధికారమే లేదన్నారు - తోక పట్టుకొన్ని క్షీరసాగరాన్ని మర్దించిన దేవతలు. వాసుకి తలవైపున వుండి - దాని విషజ్వాలకు గురియై- అధిక కష్టాన్ని, నష్టాన్ని అనుభవించిన మాకూ భాగముండితీరాలని అసురులు. ఈవిధంగా పోట్లాట ప్రారంభమైంది. శ్రీమహావిష్ణువు జగడాన్ని పరిష్కారం చేసేందుకు మోహిని వేషం దాల్చాడు. మోహిని కులుకు బెళుకులతో - అసురులను సమ్మోహితుల్ని చేసి - అమృతాన్ని దేవతలకు పంచింది. ఈమోసాన్ని గమనించిన రాహు కేతువులు సుర రూపా

లలో దేవతల సరసన కూర్చున్నారు. విష్ణుచక్రం వారి శిర స్సుల ఖండించింది. మోహిని జాలం అసురులకు అర్థమైంది. రాక్షసులు విజృంభించారు. మోహిని అమృతభాండాన్ని సురు లకు అప్పగించి అదృశ్యమైంది. దేవతలు అమృత కుంభంతో పర గెత్తుకొని వచ్చి త్రివేణీ సంగమంలో దాగొని, అమృ తాన్ని ఆరగించారు. అదే పన్నెండేళ్ళకు ఒకసారి వచ్చేకుంభ మేలా. ఆరేళ్ళ కొక పర్యాయం అర్ధకుంభ మేలా జరుగు తుంది.

అసురులు - రాక్షసులు. మానవ పీడకులు! వాళ్ళకు పండ్లు కోరలు తిరిగి వుంటాయి! ముక్కునంకర తిరిగివుంటుంది! నెత్తిన కొమ్ములుంటాయి. కడుపులో కళ్ళువుంటాయి! భయం కరంగా కనుపిస్తారు! అందుకని వాళ్ళకు అమృతాన్ని దక్క నిస్తే - అపరామరులైతే - ప్రజానాశం జరుగుతుంది! అదే మన పురాణాల నిర్వచనం! అందుకే లోకరక్షకుడైన శ్రీ మహావిష్ణువే అసురులకు ద్రోహం తలపెట్టాడు! మోసగించి తెచ్చుకొన్న అమృతకుంభాన్ని త్రివేణి దగ్గర సురలారగించి నారు కాబట్టే - కుంభమేళా అతి పవిత్రమైన దంటున్నాము. అందుకే "కుంభమేలా"లో వేలాది ప్రజలు నలిగి చచ్చినా- ఋషులు త్రోచుక వస్తున్న ప్రజా సమూహాన్ని - గొర్రెల మందగా ఎంచి శూలాలతో పొడిచినా "ధన్యోస్మి" అంటు న్నాము! ఆ మేలాను సందర్శించిన విదేశీయులు - హైందవ సంస్కృతిలో - నాగరికతలో - విశ్వాసాలలో ఒక భాగ మైన దీన్ని ఎంతగా హర్షించినారో! వాళ్ల పత్రికల్లో ఎంతగా ప్రశంసించినారో!

ప్రయాగ మహానదులకు సంగమస్థానమైనట్లే - వివిధ ధర్మాలకు సమాగమ -సమన్వయస్థానం శ్రీహర్షుడు అందుకు పునాదలు వేశాడు.

క్రీ॥ శ॥ 606 లో రాజ్యానికి వచ్చిన మహాపండితుడు హర్షచక్రవర్తి. గంగానదీ తీరంలో కనూజ్ పట్టణాన్ని రాజధానిగా చేసికొని, గంగా, యమునా నదీ లోయలను సస్యశ్యామలంచేశాడు.సర్వధర్మసమన్వితమైన ఉత్తమ సంస్కృతికీ, నీతిదాయకమైన సాహిత్యానికి, అత్యున్నతమైన నాగరికతకు పునాదులు వేశాడు. బాణకృతి 'హర్ష చరిత్ర' ఆ విషయాలను విపులీకరిస్తున్నది. అప్పట్లో పదిహేను సంవత్సరాల పర్యంతం భారతావనిలో పర్యటించిన చైనా యాత్రీకుడు - న్యాయ, ధర్మ, తార్కిక, తాత్విక శాస్త్రజ్ఞుడు "హుయాన్ త్సాంగ్" ప్రశంసా రచనలు మనకు ఆధారం. ప్రయాగలో ఐదేళ్ల కొకసారి మతసమావేశాలు జరుగుతుండేవి. సర్వమతాల నాయకులు, శాస్త్రజ్ఞులు, పండితులు, తాత్వికులు శ్రీ హర్షుని అగ్రాసనాధిపత్యాన మీమాంస జరిపేవారు. హర్షుని ఆస్థానంలో, సభల్లో, ఉత్సవాలలో అందరికీ సమానమైన ప్రాతినిధ్యం వుండేది. గౌరవం జరిగేది. ప్రయాగనుండి గంగానది ఒడ్డునంటి-కనూజ్ వరకూ హర్షచక్రవర్తి దేవతామూర్తివలె అలంకరించుకొని, గౌతమ బుద్ధిని విగ్రహం ప్రతిష్టింపబడియున్న పల్లకి కొమ్మును బుజాన మోయుచూ నడిచి పోతూవుండగా, వెనుక కుమార రూపవల్లభ రాజుతో బాటు మరి పదునెనిమిది మంచి సామంతరాజులు, నాలుగు వేలమంది బౌద్ధబిక్షవులు, నాలువేలమంది వైదిక బ్రాహ్మణులు. నాలుగు

వేలమంది సైనులు, మూడుపందల ఏనుగులు, ఇంకా మంది. మార్బలం బారలుతీరి మహారాజు మోస్తున్న పల్లకీ వెనక సాగిపోతూవున్న హృద్యంగమమైన దృశ్యాన్ని కనులారాంచిన హుయాన్ త్సాంగు ఆ మతాంతర, సార్వజనీన మహోత్సవా లనుగురించి ఘనంగా వర్ణించారు శ్లాఘించారు. ఉత్సవానంతరం మహారాజు ధరించిన ఆభరణాలు, దుస్తులు పేదలకు పంచి పెట్ట బడేవి. అంతేగాదు, క్రిందటి ఐదు సంవత్సరాలనుండి కూడ బెట్టిన చక్రవర్తి స్వంతఆస్తినంతా బిక్షగాళ్లకు దానమిచ్చి, మహారాజే ఒక బిచ్చగాడై సోదరినుండి ఒక పాతగుడ్డను దానమర్థించేవాడు. సోదరి "జయశ్రీ" నుండి దానంగా స్వీక రించిన ఆ పాతగుడ్డను ధరించి బోధిసత్వుని సేవించి, తాను సంపాదించిన ధనం, ధర్మానలంబనకు ప్రణతులిస్వ బడినదని ఆనందపరవశు డయ్యేవాడు.

త్రివేణి-పవిత్రతకు చిహ్నమని మన విశ్వాసం. ఆపవిత్ర సంగమంలో పడవలలో వెళ్ళి పతుాశనం జేసికొన్న మార్పైతులు గూడా పవిత్రమైనట్లే భావించుకున్నారు. గంగ శ్వేతోదకం. యమున నీలోదకం. సంగమించే స్థలంలో లోతు తక్కువ. గంగ శీతలోదకం. శీతల పానీయంలో శరీరం గగుర్పాటు. యమునానది చిరోష్ణ పానీయంలో హాయి. వన్నెలో నేకాకుండా గుణంలోకూడా తేడా. ఔనుమరి! యమునానదిలో నీలమేఘశ్యా ముడు వేణుగోపాలుడు జలకమాడేవాడుకదా! గంగ- శ్వేతవర్ణపు శంకరుని ప్రియురాలుగదా! సంగమ స్నానం హాయిగొలిపింది. [పండాల పీడమినహా] ఆత్మశుద్ధి – జరిగినా – లేకపోయినా – శరీరం మాత్రం శుద్ధి అయినమాట వాస్తవం, స్నానానంత

రం వెలుపలకు వచ్చినమాకు శరీరం చాలా తేలికనిపించి. హృదయంనుండి ఏదో పెద్దబరువు తీసి వేసినట్లనిపించిందంటే అతిశయోక్తికాదు.

ప్రయాగ తీర్థరాజము ఏటేటాజరిగే మాఘమేలా లక్ష లాదియాత్రికుల్ని ఆకర్షిస్తున్నది. అచ్చటి గంగానది స్వచ్ఛోద కం ఒక పుష్కరకాలం నిల్వవుంటుందని శాస్త్రజ్ఞులు నిగ్గు తేల్చారు.

దేవతలు అమృతభాండాన్ని మోసుకొని పారిపోతూ ఈ ప్రదేశంలో విశ్రాంతి తీసుకొన్న సందర్భంలో బహుశా ఒకటి – రెండు అమృతపు చుక్కలు పడినవో ఏమో– ఒక "వటవృక్షం" నిత్యమూ పసరుకక్కుతున్న దానివలె పచ్చగా వుంటుంది. దానికే "అక్షయ, భట్" అని పిలుస్తారు. ఈ వృక్షానికి ఎల్లప్పుడూ అక్షయమే! ఇది ఆశ్చర్యమే!

అది బ్రహ్మర్షులు కఠోర తప మాచరించిన చోటు. తాపసుల పర్ణకుటీరాలు వెలసినచోటు. ఆ ఋషుల ఆశ్ర మాల మధ్య ఆరణ్య విశ్వవిద్యాలయాలు విలసిల్లిన స్థలం.

భరద్వాజమహర్షి ఆశ్రమం ఉన్నచోట ఇప్పుడు భర ద్వాజ ఆలయమున్నది. ఈనాడు అచ్చటి పూజారులు భరద్వా జుని వారసులేనట. ఒకటికాదు – రెండుకాదు – ఎన్నో...! ఒక్కేచోట భరద్వాజుని వారసుల మధ్య పోటీ – మేమే నిజ మైన వారసులమని నిత్యసంఘర్షణ. ఇంటికొక భరద్వాజుని బొమ్మ. పూజారులు ఆడవారు. ఒక బొమ్మకు కానుక చెల్లిస్తే

మిగిలిన అన్నిబొమ్మలకూ చెల్లించక తప్పదు. చెల్లించకపోతే చేయిబట్టి లాక్కొనిపోయి – మరీ చెల్లింపజేసికొంటారు. నిజమైన భరద్వాజుడెవరో! భరద్వాజుడు త్రేతాయుగంలోనే కాదు; కలియుగంలోనూ గొప్పవాడే - కనీసం ఈయుగంలో శిలగా వెలిసి ఏడెనిమిది కుటుంబాలకు జీవనోపాధి కలిగిస్తున్నాడు!

శ్రీరామచంద్రుడు – సీతా, లక్ష్మణ సమేతంగా అరణ్యవాసానికి వెళ్తూ – ప్రయాగలోని భరద్వాజాశ్రమాన్ని సందర్శించినట్లు ప్రతీతి. ప్రయాగ సమీపంలోనే గంగానదిని దాటి గుహునకు మోక్షమిచ్చినట్లుగూడా అనుకుంటారు.

ఇది అలహాబాదు గతించిన పురాణం. ఇతిహాసం. వర్తమానంలోనూ ఈ పుణ్యభూమిలో ఒక స్వాతంత్ర్యయోధుడు, ఒక నవభారతనిర్మాత, ఒక విశ్వశాంతి దూత అవతరించాడు. భరద్వాజ మహర్షి ఆశ్రమం అంచునే జననం. శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ చిరుగజ్జెలతో చిందులు త్రొక్కిన రంగస్థలమది. స్వాతంత్ర్య పిపాసను ఉగ్గుబాలతో రంగరించి త్రాగిన స్థలమది. జాతీయత పాఠాలను నేర్చినచోటది. నెహ్రూ వివాహం నిశ్చయమైన వారంరోజుల్లోనే అంత పెద్ద ఆనందభవనం నిర్మించబడిందట. ఆనందభవనంలో కమలాదేవితో వివాహమైంది. ఆనందభవనంలోనే ఆయన చిన్ననాటి మధురానుభూతులు. అనతికాలానికే – ఆయన యౌవ్వనపు కాంతులు తగ్గకమునుపే ఆ మహాసాధ్వీ అంతరిక్షంలో కలిసిపోయింది.

భారతావనిని నవ్యపథాన నడిపిస్తూ ప్రపంచానికి శాంతి సందేశాన్ని అందజేస్తున్న జవహర్‌కు మనోఫలకంలో ఏదో

నిస్పృహా - నిరాశ. దోబూచులాడుతూనే వుంది. అది ఆ మహాసాధ్వి సహచరత్వం - అచిరకాలంలోనే లోపించడమేనని. అనకుండా వుండగలమా! తన జీవిత సహపాత్రి లేనప్పుడు ఆనంద భవనంలో నిజమైనఆనందమేముంటుంది! ఆనందభవనం స్వరాజ్య భవనమైంది. ఆ ప్రక్కనే మహాసాధ్వి కమలా నెహ్రూ స్మారక చిహ్నంగా స్థాపించిన 'కమలా నెహ్రూఆసుపత్రి'. కమల జవహర్‌కు అన్నింటా సహచరురాలే. జీవితంలో, ఆనందంలో – కుటుంబవ్యవహారాలో, స్వాతంత్ర్య సమరంలో. జవహర్‌కు చెల్లెళ్లు స్వరూప్, కృష్ణ సేవలచేస్తుండేవారు – 'అదుగో స్వాతంత్ర్యయోధుడు వస్తున్నాడనే' – అప్పట్లో ఆయన ధోరణి ఈ విలాసవతులకు చాదస్తంగా తోచేది. కాని ఆ మాటలకు గాయపడుతున్న ఆయన మనస్సుకు కమల కట్లుకట్టేది. క్షణంలో గాయాన్ని మాన్పేది మరల ద్విగుణీకృతోత్సాహం...కానీ దురదృష్టం! విశ్వశాంతి దూతను, ఆ మహాసాధ్వి చూడలేకపోయింది. 'నవభారత నిర్మాత'ను చూచి వొళ్లు పులకరించే భాగ్యానికి ఆయమ నోచుకోలేకపోయింది తెరపిలేని బాధ్యతల మధ్య సహచారిణి పరిచర్యలు పొందేభాగ్యం ఈయనకు లేకపోయింది. గడ్డుసమస్యల మధ్య, హృదయం కష్ట కాసారంలా ఉడికిపోతున్న సమయంలో మనశ్శాంతికి "కమలా" అని పిలిచేందుకు ఈయన నోచుకోలేదు. ఇప్పుడు మిగిలి వున్నదల్లా, స్వరాజ్య భవనంగా మారిన ఆనందభవనం, కమలా నెహ్రూ ఆస్పత్రి – ఆ రెండూ శాశ్వత సహచరులు.

పురాణకాలపు భరద్వాజాశ్రమం - వర్తమానకాలపు ఆనందభవనం చూచిన తర్వాత మధ్యయుగపు అక్బరుకోటను సందర్శించాము. దీని నిర్మాణ 2(.75 లో అక్బరు తనవిస్తృత సామ్రాజ్యంలో పరిపాలనా సౌలభ్యంకొరకు తన పాలిత ప్రాంతాన్ని 12 రాష్ట్రాలుగా (సూబా) విభజించాడు. అందులో అలహాబాదు ఒక ప్రధానరాష్ట్రం. మిగిలినవి. ఆగ్రా, అహమ్మదాబాద్, అజ్మీర్, బెంగాల్ (ఒరిస్సాతో కలిపి) బీహార్, ఢిల్లీ, కాబూల్ (కాశ్మీర్‌తో కలిసి) లాహోర్, మాల్వా, ముల్తాన్ (సింధుతో కలిసి) ఔధ్...తర్వాత మహమ్మద్ నగర్, బీహార్, ఖందేశ్, ఈ రాష్ట్రాలకు "సిపహసాలార్" (గవర్నరులు) అనే అధిపతులు నియమించబడినారు. రాజా తోడర్ రుల్) అక్బరు ప్రధానమంత్రి) వేసిన ఈ పునాదుల మీదనే తర్వాత వచ్చిన బ్రిటిషు పాలకులు రాష్ట్రాలను విభజించారు. అదే మన ఫెడరల్ రిపబ్లిక్‌కు ప్రాతిపదికయని చెప్పవచ్చును. ఆ సందర్భంలో అలహాబాద్‌లో సిపహసాలార్ నివాసానికి అక్బరు నిర్మించిందే 1575 నాటికోట.

అలహాబాద్ ఒక గొప్ప విద్యా - విజ్ఞాన కేంద్రం, అలహాబాద్ విశ్వవిద్యాలయం దేశంలోని గొప్పవాటిలో ఒకటి. కొన్ని వేలమంది విద్యార్థులకువసతి కల్పించగలహాస్టళ్ళు వున్నాయి. మనకు వీధులవెంట కనుపించేది అంతా విద్యార్థులే. ఉత్తరప్రదేశ్ హైకోర్టుగూడా అలహాబాద్‌లోనే. ఇన్నింటిదృష్ట్యాగీర్వాణ కావ్యాలు ఉద్ఘాటిస్తున్నట్లు ప్రయాగ తీర్థ రాజమే'

15 వ తేదీ ఉదయానికి కాశీపురి చేరుకున్నాం. కాశీకి పురాణంలో, ఇతిహాసంలోనే కాకుండా హిందువుల హృదయాలలో ఒక ప్రత్యేక స్థానమున్నది. అందుకే మార్తెతుల్లో అనేకమంది మాబండి దేశపర్యటన చేస్తూన్నా "కాశీబండి" అంటుండేవారు. కాశీలో అడుగు పెట్టడంతోటే తమ జన్మలు సార్థకమయ్యాయనీ, పావన గంగోత్రిలో స్నానమాడటంతో పాపపరిహారం జరిగిందనీ, తమ పితృదేవతలకు పిండతర్పణాలతో వారికీ స్వర్గద్వారాలు తెరువబడినాయనీ ప్రతి హిందువూ భావిస్తున్నాడంటే - కాశీ రామేశ్వర యాత్రలకు శంకుస్థాపన చేసి ప్రోత్సాహమిచ్చిన శంకరాచార్యుని ఆధ్యాత్మిక సూత్రాలలో, విశిష్టాద్వైతములో ఈనాటికీ ఎంతటి బిగువు ఉన్నది!

వైదిక ధర్మం ఒకానొక జాతి స్వార్థానికి వినియోగపడుతూ మూఢవిశ్వాసాలతో, అత్యాచారాలతో, హింసతో హిందూ ధర్మం చివికి, చితికి పోతున్న ఆపత్సమయంలో గౌతము డుద్భవించి మానవజాతిని ఉద్ధరించుటకు కంకణం కట్టుకొన్నాడు. ప్రాయోపవేశాలు చేసి - దేహాన్ని శుష్కింపచేసి జ్ఞానోదయంకొరకు అహోరాత్రస్య దీక్ష కొనసాగించాడు. జ్ఞానోదయమైన అనంతరం - మొట్ట మొదటిసారిగా, తమ మోక్ష విజ్ఞాన స్రవంతులను వెదజల్లిన పవిత్రస్థలం 'కాశీ' ఆనాడు కాశీ పౌరులు-కాశీ పరిపాలకులు బౌద్ధ ధర్మానికి పరవశు లయ్యారు. దేశానికి, ప్రపంచ దేశాలకు మార్గగాము లయ్యారు. ఆనాడు కాశీలో వైదికధర్మం లేదు. యజ్ఞయాగాదులు లేవు. అయితే ఐదు శతాబ్దాలపాటు కాశీలో ప్రవర్ధమానమైన బౌద్ధధర్మం శంకరాచార్యుని అద్వైత ధ్వజంముందు

ఆగలేక పోయింది. శ్రీ శంకరాచార్యులు దక్షిణాపథాన ఎత్తిన వైదికధర్మధ్వజానికి కాశ్మీరు వరకు ఎదురులేకపోయింది. వేదవ్యాసుని కాలంలో వ్యాప్తిచెందిన తీర్థయాత్రలు, ఆతర్వాత రెండున్నర వెయ్యి సంవత్సరాలకు శ్రీ శంకరాచార్యునిచే క్రొత్తపద్ధతులద్వారా పటిష్ఠితం చేయబడినాయి. కాశీ, రామేశ్వర యాత్రలు సాగిస్తేనే ముక్తి అన్నాడు. ఆ విధంగా హిందూ సంఘాన్ని సమైక్యం చేశాడు. వైదికధర్మాన్ని పునర్వ్యవస్థీకరింప జేశారు. సంఘంలో బ్రాహ్మణ ఆధిక్యతను పునస్థాపన జేయగలిగాడు.

గంగానది ముందో, కాశీపురి ముందో చెప్పేందుకు ఆధారాలు లేవు. గంగ ఎంత పురాతనమైందో, కాశీగూడా అంత పురాతనమైనదే. కాశీవిశ్వనాథుని పాదాభిషేకం చేసేందుకే గంగామ తల్లి కాశీమీదుగా ప్రవాహాన్ని ఏర్పాటు జేసికొన్నదట ఔనుమరి! విశ్వనాథుని జటాఝూటంనుండి ఊడిపడిందే కదా గంగాదేవి! గంగను భూలోకానికితీసుకవచ్చింది భగీరథుడు. పత్నిగా స్వీకరించింది పరమశివుడు. ఇవి పుక్కిటి పురాణాలే కావచ్చు. కానీ గంగామతల్లి భూలోకాన్ని సస్యశ్యామలం చేస్తున్నమాట వాస్తవం.

రామాయణ కాలంనాటికి ముందే హరిశ్చంద్రుడు కాశీపురిలో కాటికాపరి చేసినట్లు మన పురాణాలు చెప్తున్నాయి గదా! అయినప్పుడు కాశీపట్నం చరిత్ర వేదయుగంనుండీ ప్రవర్ధమాన మౌతూందిగదా!

కిరస్తానీయులకు రోంనగరం, మహమ్మదీయులకు మక్కా మదీనా ఎంతటి పుణ్యక్షేత్రాలో, హిందువులకు కాశీ, రామే శ్వరాలు అంతటి పవిత్రతీర్థాలు. కాశీలోని "మణికర్ణికా" ఘాటులో దేవతలు తీర్థమాడారట. పార్వతీ పరమేశ్వరులు జలక్రీడలు సలిపారట. అందులో తీర్థమాడకపోతే ముక్తి లేదట. హరిశ్చంద్రఘాటులో సత్యంకొరకు అయోధ్య చక్రవర్తి హరి శ్చంద్రుడు మాలవానికి బానిసగా అమ్ముడుపోయి కాటికాప రిగా ఉన్నాడట. హరిశ్చంద్రుడు కాటికాపరిగా వున్ననాటికే విశ్వనాథుడు కాశీలో కాంచేసియున్నట్లు పురాణాలు చెప్తు న్నాయి.

అన్ని ధర్మాలకు, అన్ని మతాలకు అందరు ప్రవక్తలకు కాశీ కేంద్రస్థానమైంది. వైదిక ధర్మానికి అది నిలయం బౌద్ధ ధర్మోపదేశానికి అది ప్రారంభ వేదిక. శంకరాచార్యుని నూతన వైదిక ధర్మ సిద్ధాంతానికీ అది పట్టుగొమ్మ. ఈనాడదీ వైదిక మత ప్రాశస్త్యానికి స్థిరాయిగా నిలబడివుంది. కొన్ని వేలమందికి మంత్రాలతో జీవనోపాధిని కలిగిస్తున్నది. రోజుకు వందలాది మృతజీవులకు స్వర్గద్వారాలను తెరిపిస్తూంది. నర కంలో యమయాతన లనుభవిస్తున్న కోటానుకోట్లు మృతజీవు లకు పిండప్రదానాలు ద్వారా, గంగా ప్రవాహంలో అస్థిమజ్జ నం ద్వారా, స్వర్గరాజ్యంలో రంభా, ఊర్వశి, మేనక, తిలో త్తమలాంటి వేశ్యల సహవాసాన్ని ప్రసాదిస్తున్నది. పరలోకం లో స్వర్గమో, నరకమో, తెలియదుగాని కాశీయాత్రికు

నకు, కాశీలోని పండాలు [పౌరోహితులు] నరకం కంటే అతి నికృష్టం. స్వర్గంపేరుతో - పుణ్యంపేరుతో - నిలబెట్టి, బెదరించి - పీడించి - పిప్పిచేసి డబ్బును గుంజే పండాలు అడిగినంత యివ్వకపోతే "తల పగుల్తుంది. నికృష్టనరక-మనుభవిస్తావు - ఇంటికి సరిగ్గా చేరవు" అంటూ శాపనార్థాలు పెట్టే పండా లేనా స్వర్గద్వారాలను తెరిచేది, స్వర్గమిప్పించేది" అనిపించింది. అందుకే ఒకానొక సందర్భంలో గాంధీగారన్నారు "Panda's are worse than Pindaris" పండాలు పిండారీలకంటే అన్యాయం" అని. అందుకే కబోలు వైదికమతంపై ధ్వజమెత్తిన స్వర్గీయ త్రిపురనేని తాము సూతర్షిని కాశీదగ్గర గంగానదీతీరంలో కలిసికొని జ్ఞానోదయాన్ని పొందినట్లు "సూతపురాణము" లో ఉటంచారు.

ఈ పండాలలో అనేక పార్టీలున్నాయి. దైవజ్ఞులైన విశ్వనాథుని ఆస్థాన పౌరోహితులు, మహారాష్ట్ర పండాలు-తెలుగుపండాలు. తెలుగుపండాలు, మహారాష్ట్ర పండాలు ఏకమై ఆస్థాన పండాలలోని ఒక ప్రముఖునిపై మహాద్రావకంపోసివికలాంగుని చేశారట. మణికర్ణికాఘాటులో పిండప్రదానాది క్రతువులు జరిపించే హక్కునుగురించిఅస్థాన పండాలకు, రాష్ట్రేతర పండాలకు కోర్టు వ్యాజ్యాలుగూడా జరిగాయట. ఆస్థానపండాలే ఆ లావాదేవీలలో గెలుపొందారట. రాష్ట్రేతరపండాలు అసలు పండాలుకాదనీ, వారుక్రతువులు జరిపించేచోటుగానీ, విధానం గానీ, మోక్షసాధన కాదనీ, మణి

కర్ణిక ఒక్కటే మోక్షప్రదాయిని అనీ ఆస్థాన పండాల ఏజంట్లూ అసలుమణికర్ణిక వొట్టి మురికిపీళ్లనీ, మిగిలిన ఘట్టాలలో తీర్థమాడితేనే స్వర్గం లభిస్తుందనీ మిగిలిన పండాలు జరుపుకునే ప్రచారాన్ని, పోట్లాటలను, వాగ్యుద్ధాలను చూస్తే కాశీ సృష్టి, కేవలం ఈ సోరాయల, కోపిష్టుల జీవనోపాధి కొరకే 'ననిపిస్తుంది.

మా రైతులు అన్ని ఘాటులలో స్నానమాడారు. పిండ ప్రదాన క్రతువు లాచరించారు. కాశీవిశ్వేశ్వరుని ఆరాధించారు కాలభైరవుని దర్శించారు.

వ్యాస కాశీ, కాశీ రాజు కోటను సందర్శించారు. వేదవ్యాసుడు హిందూ సంస్కృతికి పితామహుడు. హిందూధర్మ వ్యవస్థాపకుడు. పంచమ వేదంగా పరిగణింపబడుతున్న మహాభారత కృతికర్త. కురుపాండవ వంశం నామ రూపాలు లేకుండా నశించనున్న కాలంలో ఆహుటి. ధర్మాన్ననుసరించి తల్లి యోజనగంధితో తమ్ముల భార్యలతో కూడి, ధృతరాష్ట్రి, పాండురాజు, విదురుల జన్మలకు కారణభూతులైన వంశోద్ధారకులు వేదవ్యాసుడు. 3800 సంవత్సరాలనాటి వాడనిఆధారాలు చూపించబడు తున్నాయి. మానవ చరిత్రకు పురాణానికి పునాదులు వేసినవాడు వ్యాసుడు. "సత్యము, తపస్సు, శాంతి" అనే త్రివిధములైన నైతిక సూత్రాలను సిద్ధాంతీకరించినవాడు వ్యాసుడు. అవే భవిష్యత్ మానవజాతి మనుగడకు క్రమానుబద్ధమైన సూత్రాలయ్యాయి

భారతీయ సంస్కృతికి, నైతిక సూత్రాలకు మూలపురుషు డైన ఈ వ్యాసుడు ఒక జాలరికన్యకు వివాహానికిముందే జన్మిం చాడు. వశిష్టమహర్షి మనుమడు పరాశరుడు యమునానదిపై నౌకాయానం చేస్తుండగా ఆ నావను నడుపుతున్న "సత్యవతి" అనే ఒక అతిలోకసుందరియైన జాలరికన్యను మోహించి, భౌతిక సుఖాన్ననుభవించాడు. తత్ఫలితంగా ఒకశిశువు జన్మిం చాడు. నల్లని శరీరచ్ఛాయగలవాడు కాబట్టి ఆ శిశువుకు "కృష్ణ" అనే పేరు పెట్టుకొన్నది. సత్యవతి శిశువు పెరిగి పెద్ద వాడైన తర్వాత - ఆరణ్యాలకువెళ్ళి కఠోర తపమాచరించి తన ముత్తాత వశిష్టునిలాగా మహర్షి అయ్యాడు. అతడే వ్యాస మునీంద్రుడు. అధ్యాత్మిక జ్ఞానాన్ని ఆకళింపు జేసికొని వేదా లను సృష్టి జేసి వేదవ్యాసుడయ్యాడు.

కొన్నాళ్ళకు వ్యాసునితల్లి "సత్యవతి"ని హస్తినాపురి నేలుచున్న శంతనమహారాజు ప్రేమించి పెండ్లాడినాడు. శంత నుడు మరణించిన పిదప వంశానికి ఒక పెద్దప్రతిష్టంభన యేర్ప డింది. శంతనునకు గంగవలన జన్మించిన "భీష్ముడు"తండ్రికోర్కె తీర్చేందుకు ఆజన్మాంతం బ్రహ్మచారి అయ్యాడు. సత్యవతికి జన్మించిన విచిత్ర వీర్యుడు వంశవృక్షాన్ని నిలుప లేకపోయాడు. తుదకు గత్యంతరంలేక తనపూర్వ పుత్రుడు వ్యాసుణ్ణి పిలి పించుకొని వంశాన్ని నిలపవలసినదిగా ప్రాధేయపడింది. తల్లి ఆజ్ఞానుసారం వ్యాసుడు తన సవతి సోదరుల భార్యలతోకూడి వంశ వృక్షాన్ని నిలిపాడు. అది ఆనాటి ధర్మం స్త్రీ ఎన్నివివా హాలైనా చేసికోవచ్చు. వావి వరుసలను పాటించనవసరంలేదు. అవసరంకోసం అన్నభార్యతోకూడినా తప్పులేదు. వ్యాసుడు

రాజుల వంశవృక్షాలను నిలపడమే కాదు. భారతీయసాంస్కృతీ వృక్షానికిగూడా నారుపోసి – నీరు పెట్టాడు. వ్యాసుడు దేశ పర్యటన గావించాడు. తానుపోయిన ప్రతిదేశాన్ని ఒక పార స్వాత,సాంస్కృతిక నిలయంగా పరిమార్చుగావించాడు. అరణ్య విశ్వవిద్యాలయాలను నెలకొల్పాడు. వ్యాస కాశీ ఒక అరణ్య విశ్వవిద్యాలయం. ఒక మహర్షి పీఠం. వశిష్ఠుడు, విశ్వామిత్రుడు జీవితాలలాగా వ్యాసుని జీవితంకూడా "బ్రహ్మజ్ఞానం" ఒక ప్రత్యేకమైన తెగయొక్క సొత్తుకాదు అని నిరూపిస్తూంది. విశ్వకళాపరిషత్తును నిర్మించిన ఆ పవిత్ర ప్రదేశాలలోనే ఈ నాడు కాశీ విశ్వవిద్యాలయం వెలసియున్నది. బెనారస్ విశ్వ విద్యాలయం ప్రపంచ ఖ్యాతి గాంచినటువంటిది. అది కళలకు నిలయం.

కాశీలో మా రెండురోజుల మకాంలోనూ బుద్ధుడు జ్ఞానోదయమైన తర్వాత మొట్టమొదటిసారిగా పంచయతు లకు జ్ఞానోపదేశంచేసిన పుణ్యస్థలం 'సార్‌నాథ్' ను గూడా సందర్శించాము.

# సార్నాథ్

'తథాగతా – నా ప్రభూ – నాగురూ–మనుష్యత్వం ఎక్కడో నీవు అక్కడే ఉద్భవించావు. మానవుడు క్రూరత్వంతో కోరలుచాచి విషజ్వాలలను వర్షిస్తూ వుండగా – నీ చల్లని కటాక్ష వీక్షణాలతో పీడితుల హృదయాలను చల్లబరచినావు.



దుష్టులనుశిష్టులు గావించావు...' అని విశ్వకవి రవీంద్రుడు వాక్రొన్నాడు. ఆ బుద్ధుడు తొలిసారిగా 'పంచయోగులను' పావన మొనరించిన పవిత్రస్థలమే సారనాథ్. సారనాథ్‌ను గురించి తెలుసుకోవడానికి ముందు బుద్ధగయను గురించి తెలిసికోవడం అవసరం.

'నిరంజన' నదీ ప్రవాహాన్ని ఆనుకొనివున్న బుద్ధగయ యావత్ ప్రపంచానికే పుణ్యక్షేత్రం. 2500 సంవత్సరాలనాడు

కపిలవస్తుపురంలో రాకుమారుడుగా జన్మించిన సిద్ధార్థుడు రాజ్యాధికారాన్ని విసర్జించి, భార్యా బిడ్డలను తల్లిదండ్రులను విడనాడి కీకారణ్యాల పాలై సత్యాన్వేషణార్థం సన్యాసియై మగధ దేశాన్ని దాటివచ్చి, ఈ నిరంజననదీ తీరంలోనే ఉరువేల గ్రామసమీపాన తపమాచరించాడు.



చైనా బౌద్ధాలయం

ఆనాటి హిందూ సమాజంలోని వొడుదుడుకులు, అశాంతీ — సిద్ధార్థుని లేత హృదయాన్ని కలవరపెట్టాయి. హెచ్చుతగ్గులకు హేతువేమి? ఉచ్చనీచాలకు కారణమేమి — మానవపీడ ఎందుకు జరుగుతూంది. యజ్ఞ, యాగాదులపేరిట, మోక్షంపేరిట, దేవునిపేరిట జరుగుతున్న జీవహింస — అత్యాచారాలు ఆయన హృదయాన్ని క్షోభింపజేశాయి. మంచి

పేరుతోనే చెడు జరుగుతూంది. జీవికి మోక్షంపేరుతోనే హింస జరుగుతూంది. ముక్తిపేరుతో అత్యాచారాలుజరుగుతున్నాయి. హాహాకారాలు ఒక ప్రక్క వినిపిస్తుంటే - హోమాగ్ని చిటపటలు ఆకాశాన్నంటుతున్నాయి. - సోమయాజుల మంత్రోచ్ఛారణలతో దశదిశలు మార్మోగి పోతున్నాయి, ఒకరి ఆధిక్యత - ఇంకొకరి అధోగతి - ఒకరికి అహంభావం-మరొకరికి పిరికితనం-ఒకరిభోగం, వేరొకరి దౌర్భాగ్యం - అవీ రోజులు. అప్పుడే సిద్ధార్థుని హృదయ పేటిక పగిలి బ్రద్దలైంది. మానవ సమాజం అసహజపు ధోరణిలో సాగిపోతూంది. 'అలాసాగడానికి వీలులేదు. సహజంగా సమాజాన్ని నడిపించాలి' అదే సిద్ధార్థుని సత్యాన్వేషణ ప్రారంభం. మగధదేశంలో అడుగు పెట్టి -జంతుబలులను మాన్పించాడు. శాక్యముని అయ్యాడు. మగధనుండి మరల సత్యాన్వేషణ - తపోసంపన్నులను ఆశ్రయించాడు. జ్ఞానభిక్షను అర్థించాడు. 'అలార కలాను' అనే మహాతపస్సంపన్నుని ఆశ్రయించాడు. ఆ సన్యాసివద్ద పూర్తి ప్రయోజనం కలగలేదు. తిరిగి యాత్రసాగించాడు. ఉదంకుడనే ఋషిసత్తము సన్నిధి నాశ్రయించాడు. అయినా ప్రయోజనం పూజ్యం. తిరిగి యాత్ర. మగధదేశాన్ని దాటాడు. నిరంజన నదీతీరాన్ని చేరుకున్నాడు. ఆ ప్రదేశం ఎంత ప్రశాంతంగావున్నది! ఆనాటికీ ఈనాటికీ అది ప్రశాంత వాతావరణ గర్భిత ప్రదేశమే. నిరంజన నది స్ఫటిక జలాలు, సారవంతమైన ఆ పంట భూముల్లో ప్రవహిస్తూ - ఆ ప్రదేశాన్ని సస్యశ్యామల మొనర్చుతున్నాయికదా!

ఆ ప్రశాంత వాతావరణంలో శాక్యముని తపోనిష్ఠాగరిష్ఠు డయ్యాడు. కఠోర ప్రాయోపవేశ దీక్ష సాగించాడు. శరీరం శుష్కించింది. కండరాలు కరిగిపోయాయి. శాక్యముని అస్థి పంజరమయ్యాడు. ఆ గొల్ల పిల్లడు ఎంతటి పుణ్యాత్ముడో - స్పృహతప్పి పడిపోయిన సిద్ధార్థుని నోటిలో అజమాత క్షీరాన్ని పిండి శాక్యమునికి తెలివి తెప్పించాడు. ప్రాయోప్రవేశం ద్వారా శరీరాన్ని శుష్కింపజేయడం జ్ఞానార్జనకు సాధనమా! అన్న ప్రశ్న సిద్ధార్థునిలో అప్పుడే ఉదయించింది. ఉరువేల గ్రామములో నివసిస్తున్న సుజాత అనే ఒక ఉత్తమ యువతి తన బిడ్డ ఆరోగ్యాన్ని అభిలషించి సిద్ధార్థునకు మధుర పాయసాన్ని ప్రసాదంగా సమర్పించుకొన్నది. ఆ మధురాన్నముతో తిరిగి శాక్యమునికి జవసత్వాలు చేకొన్నాయి. ఆ పావన హస్తాలతో, నిర్మల మనస్సుతో - భక్తిపూర్వకంగా అందించిన క్షీరాన్నమే శాక్యముని నిశ్చల తపస్సుకు గీటురాయి అయింది. అదొక మహత్తర సన్నివేశం, మానవధర్మ పరిభ్రమణానికి ఆ రసాత్మక ఘట్టం-విప్లవబీజాలను నాటింది, "నా చిరకాల వాంఛితమైన నా కడుపుపండి-ఉత్తమ శిశువును కన్నట్లే-ఈ క్షీరాన్నముతో తమజీవితాశయము కూడా ఫలించుగాక" అని అభిలషించిన సుజాత అభిలాష-ఆశీస్సు 'అజరామరముగదా!'

ఆ రాత్రే సిద్ధార్థుడు ఆ చోటునుండి లేచి బోధివృక్ష ఛాయను చేరుకున్నాడు. ఆ నాటి ఆయన అడుగులచప్పుడు ముల్లోకాల్లో ప్రతిధ్వనించాయి. భూమికంపించింది. ఆకాశం దద్దరిల్లింది. తూర్పుముఖంగా పవిత్రబోధి వృక్షం క్రింద ఆసీను

డైన శాక్యముని నిర్మలమనస్కుడై, నిండుహృదయంతో "ఇహ సానే సుశ్యతుమే శరీరం, త్వగ స్థిమాంసం ప్రళయం కయాతు, అప్రాప్యబోధిమ్ బహుకల్పదుర్లభమ్, నైవశానత్ కాయం ఏతత్ కాలిశ్యతి"

"నాశరీరం, నరాలు, ఎముకలు శిథిలమైపోవుగాక-రక్తం కరుడుకట్టిపోవుగాక - నాకు మనోదయమగువరకూ ఈ ఆసనము వీడను'' అని ప్రతిజ్ఞ తీసుకొన్నారు. అది నిండుపూర్ణిమ. భయంకర రక్కసులు సిద్ధార్థుని తపోభంగంతలపెట్టారు. సురుచిర సౌందర్యరాసులైన అప్సరసలు ప్రణయభంగిమలలో శాక్యమునిచుట్టూ మనోహరనాట్యాన్ని ప్రదర్శించారు కాని సిద్ధార్థుని ధ్యాననిష్ఠ మొక్కవోలేదు.

ఆ పున్నమరేయి సిద్దారునకు మనోదయము ప్రారంభమైంది. మొదటియామంలో పూర్వగురువు ప్రబోధాలు మనసుకెక్కాయి. రెండవ యామంలో మనోనిశ్చలత, సమచిత్తత సమకూరాాయి. మానవసమాజ ధోరణి-భిన్నభిన్న మార్గాలు-ఆయనకు క్షుణ్ణంగా అవగతమయ్యాయి. చివరి యామంలో పామరత్వం నశించింది. దేదీవ్యమానమైన ఒక మనోజ్యోతి సిద్ధార్థునిలో ప్రవేశించింది.

సిద్ధార్థుడు బోధిసత్వుడయ్యాడు, గౌతమబుద్ధుడయ్యాడు.

'నాలో' ఒక నూతనత్వం ప్రవేశించిది. నాలోనిబాధలు ఆందోళన తొలిగిపోయాయి. నాకొక నూతనమార్గం గోచరించింది....' అని బోధిసత్వుడే అన్నాడు.

బోధివృక్షంలో ప్రకాశిస్తున్న ఆ పవిత్రస్థలమే 'బుద్ధగయ'. ఆ నాడే పూర్ణ చంద్రోదయానంతరం ప్రపంచానికి నవ ప్రభాతమైంది. ఏళ్ల తరబడి శ్రమించి, తపించి – వొడుదుడుకుల మధ్య పయనించి– నిజ జీవితంపై ప్రయోగాలుచేసి–సత్యం కోసం, జ్ఞానంకోసం, ప్రపంచంతో – ప్రకృతితో, బ్రతుకుతో, చావుతో పోరాడి పోరాడి – గౌతముడు విజయాన్ని సాధించాడు – బుద్ధుడయ్యాడు ఆ పవిత్రస్థలం – ఆ నిరంజన నదీ తీరం – ఆ ఉరువేల గ్రామప్రాంగణం ఆ గొల్లపిల్లడు– ఆసతీమ తల్లి సుజాత – ఎంతటి ధన్యులు. ఆ బోధివృక్షం క్రిందనే బుద్ధుడు మరి ఏడువారాలపాటు ధ్యాననిష్ఠలో గడిపి-తనమనోదయాన్ని–విశ్వానికుపకరించే మార్గాలను చర్చించుకొన్నాడు. ఆకళింపు జేసికొన్నాడు. ఇప్పుడు పరిపూర్ణుడయ్యాడు, ప్రబోధకుడయ్యాడు. మోక్షప్రదాయని అయ్యాడు; ఎక్కడికెళ్లాలి ! ఎవరికి బోధించాలి ! అనేదే తరువాతి ప్రశ్న.

ఒకనాడు తాను ప్రాయోపవేశ దీక్షను విరమించిన తర్వాత – తన చిత్తశుద్ధిని శంకించి - తన యోగశక్తిని విశ్వసించక – తననుండి వేరైన ఐదుగురు శిష్యులకు మనభిక్ష ప్రసాదించదలచుకొన్నాడు. ఆ ఐదుగురు సన్యాసుల అన్వేషణలో బయలు దేరాడు బుద్ధుడు. వనాలు వనాంతరాలు దాటాడు. 280 మైళ్లు కాలినడకన పయనించాడు - వారణాసి చేరుకున్నారు. వారణాశి ప్రక్కన ఋషి పట్టణంలోని హరిణవనంలో నివాస మేర్పరుచుకొనియున్న ఆ పంచయతులను బుద్ధుడు కలిసికొన్నాడు. ఆ ఋషిపట్టణమే ఈనాటి 'సారనాథ్'. నిగ్రహం లోపించిన శాక్యమునికి మర్యా

దలు చేయరాదనీ, కనీసం ఆసనమైన చూపెట్టరాదని, ఆదిలో తలపోసిన ఆ యతులు - సహస్ర భానోదయంవలె, జగజ్జేయమానంగా వెలుగుతున్న బుద్ధుని దర్శనమును గాంచి, ఆసనం చూపెట్టకుండా ఉండలేకపోయారు. నమస్కరించకుండా ఉండలేకపోయారు. మర్యాదలు వారికి తెలియకుండానే చేయడం జరిగింది.

అక్కడే-ఆ పవిత్రగంగానదీ లోయలోనే - ఆ ప్రాచీన నగర వాటికలోనే - నవ్యమానవ సిద్ధాంతాన్ని తథాగతుడు పంచయతులకు ప్రబోధించి - జ్ఞానోదయాన్ని కలిగించాడు.

వారణాశి నగరం- బుద్ధుని తేజస్సుతో దేదీప్యమానంగా ప్రకాశించింది. వారణాశి ప్రజ తథాగతుని పాదపద్మములకు భక్త్యాంజలి ఘటించారు భక్తిపరవశంలో - జ్ఞానసముపార్జనా సంవిధాన ప్రశాంతుల మధ్య పులకాంకితమైన ఒకానొక వణిక్ప్రముఖుడు—

"బుద్ధం శరణం గచ్ఛామి; ధర్మం శరణం గచ్ఛామి; సంఘం శరణం గచ్ఛామి" అంటూ-

ఒక హావభావోపేతమైన నవప్రబోధ గీతాన్ని ఆలపించాడు.

"అజ్ఞానం మానవ పీడకు హేతువు. స్వార్థాన్ని తృప్తి పరచుకొని ఆనందిస్తున్నాము. నిజమైనఆనందం అదికాదు. స్వార్థం మానవత్వానికి అసహజలక్షణం. పరిపూర్ణత్వంజెందిన సంఘంలో స్వార్థం ఉండదు......" కోరికలను తీర్చుకోనేందుకు ప్రాకులాడటం - మరో లోకంలో ముక్తికొరకు - ఈ లోకంలో ఆందోళన చెందడం - అలౌకిక వ్యాపారంలో విజ

యాన్ని సాధించ ప్రయత్నించడం–'' విసర్జించగలిగితే మానవ జన్మ సార్థకమౌతుంది. మూఢవిశ్వాసాలనుండి మనస్సుకు విముక్తి సాధించగలిగితే – ఆత్మను, అభిలాషను కట్టడిచేసికో గలిగితే – విశ్వప్రేమలో భాగస్వాములము కాగలిగితే, మానవుడు సంపూర్ణత్వాన్ని, శాంతిని, సౌఖ్యాన్ని పొందగలడు.''

ఋషిపట్టణంలో పంచయతులకు – వారణాశి ప్రవాసీకానికిబోధించిన మానవజీవితతత్వం అనతికాలంలోనే భారతదేశానికే కాకుండా ప్రాక్ దేశాలకుకూడా వేదవాక్యాలయ్యాయి ఆ ప్రదేశంనుండే భిక్షువులు బౌద్ధసందేశ విస్తరణకు నలుదిక్కులకు పయనించారు చక్రవర్తులు – సామంతులు – మంత్రులు – శ్రీమంతులు– సామాన్యులు- కిరాతులు– ఒక్కటేమిటి అనతికాలంలోనే అందరూ బౌద్ధధర్మ నిష్ఠా గరిష్ఠులయ్యారు.

సారనాథ్‌లో తథాగతుడు మొట్టమొదటగా ఐదుగురు సన్యాసులకు జ్ఞానోదయాన్ని కలిగించిన పవిత్ర ప్రదేశంలో "చౌఖండీ" అనే ఒక మహాస్తూపం నిర్మించబడి వున్నది. ఆ మహాస్థూపం బౌద్ధధర్మ విశిష్టతను చాటుతూంది. ఇది బౌద్ధభిక్షువుల పవిత్ర స్థలం. హర్షవర్ధనుని కాలంవరకూ దీని శోభ మకుటాయమానమై యున్నది. ఆనాటి భిక్షువుల తపోవిహారాలు - ఈ నాటికీ శిథిలావస్థలో వున్నా యాత్రికుని హృదయాన్ని రంజింప జేస్తున్నాయి. ఎన్నో విహారాలు – ఎన్నో కట్టడాలు - సజీవంగా ప్రకాశిస్తున్న తథాగతుని విగ్రహాలు – తురుష్కుల మత మౌఢ్యానికి బలియయ్యాయి. మహమ్మద్ ఘోరీ – వారణాసిపై సారనాథ్ పైదండయాత్ర

జేసి - సొమ్మును దోచుకోవడమే కాకుండా ప్రాచీన భారతా వని ఉన్నతిని ప్రదర్శించే మహత్తర నిర్మాణాలను - కళాఖండా లను నాశన మొనర్చాడు కదా! శంకరాచార్యుని కాలంలో సారనాథ్ ప్రాముఖ్యత తగ్గింది. ఒక్క వారణాశిలోనే కాదు ప్రతి బౌద్ధ ధర్మ కేంద్రంలోనూ ఒక వైదికనిలయం - ఒక యజ్ఞశాల, ఒక పురోహిత పాఠశాల, ఒక వేదాంత చర్చా వేదిక వెలసినాయి. బౌద్ధ ధర్మాన్ని నాస్తికవాదంగా చిత్రించారు. బౌద్ధులు నాస్తికులన్నారు. సారనాథ్ ఒక ఎడారి ప్రాంతమయింది 600 సంవత్సరాలపాటు ఎడారి జీవితం, అజ్ఞాతవాసం గడిపిన ఆ ఋషి పట్టణం సార నాథ్ తిరిగి 1931 లో విదేశీయుల పుణ్యమా అంటూ ప్రాశ స్త్యానికివచ్చింది. సింహళ బౌద్ధసన్యాసి, "అనంగారిక ధర్మపా లుని"చే 1801 లో స్థాపించబడిన 'మహా బోధి సొసైటీ 1932 లో తిరిగి సారనాథ్‌ను పునరుద్ధరించుటకు పూనుకొన్నది. సార నాథ్‌లోని మహత్తరమైన 'మూల గంధకుటి విహార' ఆలయ నిర్మాణం మహాబోధి సొసైటీఅధ్వర్యాన 1931లోప్రారంభమై 1936 లో పూర్తి అయింది ఇది బుద్ధగయలో అశోక చక్ర వర్తిచేనిర్మింపబడిన ఆలయాన్ని పోలివుంటుంది. దీని నిర్మాణం 'కొసేటు నోషు' అనే సుప్రసిద్ధ జపాను శిల్పినాయకత్వాన జరిగింది. ఎత్తయిన శిఖరం ఆలయ విశిష్టతనుచాటుతూంది. లోపల బుద్ధజీవితానికి, విశేషాలకు సంబంధించిన అద్భుత చిత్రలేఖనాలతో అలరారుతూంది.

పురావస్తుశాఖవారి ప్రదర్శనశాలలోని బుద్ధవిగ్రహం వేల సంవత్సరాల నాటిది. ఈ ప్రదర్శనశాల చూచిన మాత్రా

న్నీ ఆనాటి సారనాథ్ విశిష్టత, శోభ, పవిత్రత – అవగాహన కాగలవనుటలో సందేహంలేదు. 1910 లో సర్ జాన్ మార్షల్ మహాశయునిచే నిర్మింపబడిన ఈ మ్యూజియం బౌద్ధ యుగ ప్రాశస్త్యానికి గీటురాయిగా నిలచిందనేచెప్పాలి. ఇందులోని 2300 సంవత్సరాలనాటి అశోకుని చతుర్ముఖ సింహస్తూపం ఈ నాటికీ కొత్తదిగానే కనుపిస్తూంది. అదే ఈనాటి మన సర్వతంత్ర ప్రజాతంత్ర భారత రిపబ్లిక్ చిహ్నం. ఇవన్నీ సారనాథ్ త్రవ్వకాలలో బయల్పడిన అమూల్య బహుమతులు.

ఈ నాడు భారతప్రభుత్వం సార్‌నాథ్‌ను ఒక మహాక్షేత్రంగా రూపొందించగలగడంముదావహం. కొన్ని శతాబ్దాలకైనా తథాగతుని జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాము. అందుకు నిదర్శనమేగదా సార్‌నాథ్ రైల్వేస్టేషన్ బౌద్ధస్తూపాకారంలో నిర్మించుట. సాంచీ స్థూపానికి ఆంధ్రరాజులచే నిర్మించబడిన కళావిలసితమైన విశ్వవిఖ్యాతి నార్జించుకున్న ద్వారాలను పోలినట్లుగా సార్‌నాథ్ స్టేషన్ ఆవరణానికి ద్వారాలను నిర్మించారు.

సార్‌నాథ్‌లోని చైనావారి బౌద్ధదేవాలయంలో ఎంత ప్రశాంతత! వారణాశిలోని పండాలబాధగానీ. శాపనార్థాలుగానీ, హడావిడిగానీ, ఆర్భాటంగానీ సారనాథ్‌లో లేకపోవడం... హరిద్వార్, ఋషీకేశ్, ప్రయాగ, కాశీక్షేత్రాలలో పండాలతో పడినబాధనుండి 'విముక్తి లభించినదా' అనిపించడంలో ఆశ్చర్యమేముంది!

ఈ పవిత్ర ప్రదేశాన్ని గురించి ముగించబోయేముందు సారనాథ్ – చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్‌దృష్టి నెలా ఆకర్షించిందో తెలిసికోవడం అవసరమనుకుంటాను.

“సారనాథ్ అంధి ఎనిమిది భాగాలుగా విడదీయనగును. చుట్టూ గోడ, అంతస్థులు గలిగిన శిఖరాలు అందులో ప్రశాంతమైన గుహాలు, బాల్కనీలు విశిష్ట శిల్పచాతుర్య నిర్మాణంతో అలరారుతున్నాయి. ఈ మహాన్యాస విద్యాలయంలో 1600 భిక్షువులు నివశిస్తూవున్నారు. వీరు 'సమ్మితీయుని' హీనయాన ధర్మావలంబికులు. ఇందు 200 అడుగుల ఎత్తుగల ఒక బ్రహ్మాండమైన విహారమున్నది. శిఖర ఉపరిభాగంలో బంగారు మామిడిపండు అమర్చబడివున్నది. ఈ మహోత్తర నిర్మాణపు పునాదులు ఇటుకలతో చేయబడివున్నది. విహారానికి నలువైపులా నూరు వరసలలో గూళ్ళు అమర్చబడి ఉన్నాయి. ఒక్కొక్క గూడులో ఒక్కొక్క బంగారు బుద్ధ విగ్రహం ప్రకాశిస్తూంది. మధ్య భాగంలో రాగితో చేయబడిన పెద్ద బుద్ధ విగ్రహం సుప్రతిష్ఠితమై ఉన్నది. ఈనిలువెత్తు బుద్ధ విగ్రహం ధర్మచక్రాన్ని త్రిప్పుతూంది.”

ఏడు శతాబ్దాలక్రితం మరచిపోయిన సారనాథ్ ఇప్పుడిప్పుడే ప్రాశస్త్యానికి రాగలిగినందుకు ఈ యుగపు భారతీయుల శాంతిప్రియత్వానికి, సహజీవన సిద్ధాంతానికి, పంచశీల ప్రభావానికి జోహారులర్పించకుండా ఎలావుండగలను !

# బుద్ధగయం

"క్రోధావేశాలకు అతీతుడు. బ్రాహ్మణుడు – కార్యదక్షుడు. నీతి పరుడు. ఆశ అనే ఆకలికి అతీతుడు, కోరికలను అణచుకొని – మానసికత్వంలో పరిపక్వ దశకు వచ్చినవాడు.

తామరాకుపై నీరుపడి అంటుకుండా జారిపోయినట్లే ఆవగింజ సూది మొననుండి జారిపోయినట్లుగానే ఆముష్మికమైన కోర్కెలు అతడికి అంటవు. అతడి జ్ఞానం అగాధం. అతడి బుద్ధి అమేయం. అతడి వివేచనాశక్తి అపారం, అతడు పరిపూర్ణుడు.

అతడు చంద్రునివలె ప్రకాశవంతుడు; పవిత్రుడు; నిర్మల హృదయుడు; శాంతచిత్తుడు నిశ్చలుడు, అతడి నడవడి అందరకూ ఆదర్శం.

అతడే బ్రాహ్మణుడు – అందులో ఏదిలోపించినా - ఆ నామధేయానికి అనర్హుడే"

— గౌతమబుద్ధ.

వారణాశిలో రెండురోజులుండి, హిందూ – బౌద్ధపుణ్యక్షేత్రాలను దర్శించి మరునాడు 18వ తేదీ ఉదయానికి "గయ" చేరుకొన్నాము. గయ బీహారు రాష్ట్రంలో మండల కేంద్రము, పెద్ద పట్టణము. బీహారు ప్రజలు, బీహారు రైతులు మా రైతులకు నూతనోత్తేజాన్ని కలిగించారు, ఆంధ్ర రైతులు, పంజాబు రైతులకు ఏమాత్రమూ తీసిపోని కష్టజీవులు బీహారు రైతులు. ఒక్క రైతులేకాదు. ఆ రాష్ట్ర ప్రజలే ఒక ఎత్తు; ఎంతో సహృదయులు.

అసలు బీహారు కర్షకోద్యమాలకు పుట్టినిల్లు. సోషలిస్టు ఉద్యమానికి అది ప్రాణం. సోషలిష్టు నాయకుడు శ్రీ జయ ప్రకాశ్ నారాయణ ఆదేశపువారే భారత ప్రజాతంత్ర ప్రభుత్వాధినేత బాబూ రాజేంద్రప్రసాద్ ఆపుణ్య భూముల్లో పెరిగినవారే. జాతీయోద్యమ రథసారథులలో ఒకరు శ్రీ రవి శంకరశుక్ల ఆమాగాణపు బిడ్డయే. వారంతా రైతు కుటుం బీకులు. అదేమనకు గర్వకారణం.

గౌతముడు గౌతమ బుద్ధుడయిన తర్వాత మొట్ట మొద టగా ఆ జ్ఞాని పాదధూళి సోకిన బీహారుప్రాంతం ఎంత పవిత్ర మైనది.

గయలో మార్గైకులకు గొప్ప గౌరవం జరిగింది. ఎక్కడా అంత సన్మానం జరగలేదేమో! భారత సేవక సమాజం, నగరసమ్మేళనం - మమ్ముల్ని ప్రత్యేకంగా గౌర వించారు. బుద్ధ గయలో తేనీటివిందుచేశారు. సన్మాన సభ ఏర్పాటుచేశారు. ఆ ఉత్సవంలో పాట్నా విశ్వవిద్యాలయ విద్యార్థులు - అధ్యాపకుల ఉత్సాహం వర్ణనాతీతం. వారి ఉత్సాహం - వారి సేవానురక్తి, మాలో నూతనోత్తేజాన్ని కలిగించింది. వారిలో ఎందరో గ్రామీణప్రాంతాల వారు. సన్మాన సభలో ఆంధ్రరైతుల ఉత్సాహాన్ని కొనియా డారు. ఆంధ్ర రైతు ఉద్యమ నిర్మాణశక్తిని ప్రశంసించారు. ఆంధ్ర రైతుల నిర్మాణాత్మక ధృక్పధాన్ని ప్రస్తుతించారు. ఆంధ్రరైతులు దేశానికి మార్గగాములన్నారు. "దేశంనాది భారతావని అఖండం - అమేయం, అజరామరం" అని నిరూ పిస్తున్నారన్నారు. ఒక మాజీ పార్లమెంటు సభ్యుడు

ఆచార్య రంగా నాయకత్వంతో ఇంతటి నిర్మాణశక్తిని బడయగలిగిన ఆంధ్రరైతులు ధన్యులంటూ, రంగాజీ నాయకత్వానికి జోహారు లర్పించారు.

ప్రపంచ ప్రదక్షిణ గావిస్తున్న ఒక అమెరికా పౌరుడు, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయ ప్రొఫెసరు ఆరోజు మాతో గడిపాడు. ఇంతమంది రైతులు ఒకేసారిగా దేశాటనం చేయడం తనకు ఆశ్చర్యంగా ఉందన్నాడు ఇలాంటియాత్ర ఈ దేశానికేకాదు ప్రపంచ పౌరులకే ఆదర్శమన్నాడు. ఆంధ్రరైతుల్ని అభినందించాడు. భారత దేశంలో ఈ రైతుయాత్ర తనకొక అపూర్వానుభవమన్నాడు. దీనిని ఇతివృత్తంగా తీసికొని తన విశ్వవిద్యాలయ విద్యార్థులకు పాఠాలు నేర్పుతాననికూడా వాగ్దిచ్చాడు. ఆ ప్రొఫెసరు మాతో. మా సరసన మన ఆచారాలకు- అలవాటులకు అనుగుణంగా భోజనం చేయడం విశేషం

ఆ సమావేశంలో ఆంధ్రరైతుల తరపునఅచ్చటిపెద్దలకు కృతజ్ఞత చెప్పేభాగ్యం నాకు కలిగింది. ఈ రైతుయాత్రలు మా రైతు ఉద్యమంలో ఒకభాగమే నన్నందుకు ఆంధ్ర దేశంలో కర్షకోద్యమ చరిత్రను వినాలన్నంత ఆసక్తి వారిలో ప్రబలింది

బుద్ధగయలో మేముపొందిన ఆపూర్వ అనుభూతిని జన్మజన్మాంతరాలకూ మరువలేము. బుద్ధగయ ప్రాశస్త్యాన్ని గురించి క్రితంలో చెప్పుకున్నాము. అచ్చటి విశేషాలను గురించి మాత్రమే ప్రస్తుతం ముచ్చటించుకుందాము.

బుద్ధగయలో ప్రధానమైనది బోధివృక్షం. బుద్ధగయ ఆలయం. "అప్పటి బోధివృక్ష శాఖ ఇప్పటికీ ఆ ప్రదేశంలో నేవున్నది. దానిప్రక్కనే బుద్ధగయ ఆలయమున్నది.

బుద్ధగయలో బస్సులు దిగటంతోనే మా కండ్లఎదుట ప్రత్యక్షమైన వేల సంవత్సరాలనాటి బోధి ఆలయం దిగ్భ్రమ గొలిపింది.

ఈఆలయాన్ని 2300 సంవత్సరాలనాడు సామ్రాట్ అశోకుడు నిర్మించాడు. 1500 సంవత్సరాలపాటు ఇది బౌద్ధుల ఆధ్యాత్మిక విశ్వశాంతి మందిరం గా వెలుగొందినది. సముద్రగుప్తుని హయాములో సింహళచక్రవర్తి మేఘువర్మ దీన్ని మరింత ప్రాశస్త్యంలోనికి తీసుకవచ్చాడు. మేఘువర్మ బుద్ధగయను బ్రహ్మాపట్టణంగా రూపొందించాడు. ఆలయానికి ఉత్తరదిశగా ఈ చక్రవర్తి మూడు భిక్షాశ్రమాలను నిర్మించాడు. ఆయాశ్రమాలను - ఆలయప్రాశస్త్యాన్ని క్రీ. శ. 5 వ శతాబ్దంలో సందర్శించిన చీనా యాత్రికుడు ఫాహియాన్ ఘనంగా వర్ణించాడు.

ఆనాడు ఇది ప్రపంచ యాత్రాకేంద్రం. చైనా, జపాన్, మంగోలియా, టిబెట్, సిలోన్, బర్మా తదితర ఆగ్నేయ ఆసియాదేశసులకు, ఇది పుణ్యక్షేత్రం. ప్రతిఏటా బుద్ధ జయంతికి ఈ పవిత్రస్థలంలో ప్రపంచ భిక్షుక సమావేశాలు, ప్రపంచ శాంతి మహాసభలు జరుగుతూ ఉండేవి.

ఒకనాడు వైదిక మత విజృంభణ, బుద్ధగయ ప్రాశస్త్యాన్ని కించపరచింది. 1079 సంవత్సరంలో బర్మారాజు

ఈ ప్రాంతాన్ని సందర్శించాడు. పాడుపడి పడిపోతున్న ఆల యానికి మరామ్మతులు చేయించి పుణ్యంకట్టుకున్నాడు. ఆ తర్వాత 1297లో మరొక బర్మారాజు దీనికి మెరుగులుదిద్దాడు.

1500 సంవత్సరాలుపాటు బుద్ధగయ విశ్వజనీన సందే శాన్ని అందజేసింది. భారతావనిపై మహమ్మదీయుల దండ యాత్రలు బుధగయకు పీడకలలుగా పరిణమించాయి. అప్ప టికే శంకరాచార్య ప్రభావంతో క్షీణదశ పట్టిన బౌద్ధధర్మం, మహమ్మదీయుల దండయాత్రలో తుడిచిపెట్టుకపోయింది. పర మతసహిష్ణుతలేని ఆ మహమ్మదీయ దండధనుల ఇనుపపాగాల క్రింద హిందూ, బౌద్ధధర్మాలు నలిగి పోయాయి. సార్‌నాథ్ లోని బంగారు బుద్ధ విగ్రహాలు మాయమైనట్లే, బుద్ధగయ విహారాలు నేలమట్ట మయ్యాయి. మహాబోధి ఆలయకుడ్య లలో చెక్కబడిన బుద్ధ విగ్రహాలను వికృతంగా బ్రద్దలుకొట్టా.

బుద్ధగయలో కారుచీకట్లు కమ్ముకొన్నాయి. తర్వాత కొన్ని శతాబ్దాలపాటు బుద్ధగయ చరిత్ర అంధకార బంధు రంలో అణగారిపోయింది. భిక్షువులులేరు. భిక్షుక విహారాలు లేవు. శాంతిలేదు. శాంతిసమావేశాలులేవు భారతావనిలో మహమ్మదీయ, మొగల్ సామ్రాజ్యాలు అలాగే పాతమారి పోయాయి.

బ్రిటిషు మహాయుగం ఆరంభమైంది. విక్టోరియారాణి పరిపాలన కొంచెం మెరుగనిపించింది. బుద్ధగయలో అలముకొని యున్న చిమ్మ చీకట్లు కొద్దికొద్దిగా విచ్చిపోతున్నాయి. ఈ పవిత్ర దేశపు దౌర్భాగ్యస్థితికి బర్మావాసులు కన్నీరు కార్చారు. 19వ శతాబ్దపు పూర్వభాగంలో బర్మా రాజ

ప్రతినిధులు బుద్ధగయను సందర్శించారు. అప్పట్లో ఆ పవిత్రాలయం ఒక హిందూమహంతు తనస్వంతఆస్తిగా జేసికొని వాడుకుంటున్నాడు. అప్పటి భారత ప్రభుత్వంతో ఈజీర్ణాలయ పునరుద్ధరణనుగురించి బర్మా ప్రభుత్వంరాయభారాలు సాగించింది. తుట్టతుదకు హిందూమహంతు ఆధీనం నుండి ఆలయం విముక్తి జేయబడింది. 1880 సంవత్సరంలో బర్మా-భారత ప్రభుత్వాలు ఈ ఆలయపునరుద్ధరణకు సమష్టిగా పూనుకొన్నాయి. సర్ అలెగ్జాండర్ కానింగ్‌హామ్, డాక్టర్ రాజేంద్రలాల్ మిత్రా పర్యవేక్షణక్రింద పునః రుద్ధరణ కార్యక్రమం ప్రారంభమైంది. ఆ సమయంలోనే అనేక వందసంవత్సరాలు మధ్య-కాల పరిభ్రమణంలో, పోషణలేక, వయసుమళ్ళి, చివికి క్షీణించిపోయిన వేలసంవత్సరాలనాటి ఆ పవిత్రమైన మహాబోధివృక్షం తలవాల్చింది. తథాగతునిలో ఐక్యమైంది. అయితే ఈ భౌతిక ప్రపంచంలో తన జ్ఞాపకార్థంగా రెండు వేరుమొక్కలను వదలిపెట్టడం మన భాగ్యం. ఆ మొక్కలనే తల్లివృక్షం పడిపోయిన పాదిలో ఆలయానికి పశ్చిమభాగంలో ఒక మొక్కను - ఉత్తరభాగంలో మరో మొక్కను నాటిపెంచారు. ఆ మొక్కలే ఇప్పటికి పెరిగి పెద్దవయ్యాయి.

పునరుద్ధరణ జరుగుతున్న సమయంలోనే 'ఆసియా దివ్యజ్యోతి' Light of Asia గ్రంథకర్త 'సర్ ఎడ్విన్ అర్నాల్డ్' బుద్ధగయ ఆలయాన్ని 'బుద్ధిస్టులకు అప్పగించి వేయాలని ఇంగ్లండులోనూ - ఇండియాలోనుగూడా బ్రిటిషు ప్రభుత్వంపై ఆందోళన సాగించారు. 1891లో సింహళ బిక్షుక నాయకుడు అనగారిక ధర్మపాలుడు భారతదేశంలో మహా

బోధి సొసైటీశాఖను నిర్మించారు. అప్పటినుండీ బుద్ధగయ ఆలయ నిర్వహణ సమస్యనుగురించి ఈ సంస్థ ఆందోళన సాగిస్తూనే వచ్చింది. తుదకు స్వాతంత్ర్యానంతరం 1949 లో 'బుద్ధగయ ఆలయశాసనం' రూపొందించబడింది. ఆ శాసనం మేరకు నలుగురు బౌద్ధులు – నలుగురు హిందువులు మొత్తం ఎనమండుగురు సభ్యులుగాగల ఒక కమిటీకి బుద్ధగయ ఆలయ నిర్వహణ అప్పగింత పెట్టబడింది.

బుద్ధగయ ఆలయ పునరుద్ధరణతో బాబు బుద్ధగయ ప్రాశస్త్యం తిరిగి ప్రపంచ యాత్రికుల – చరిత్రకారుల – పురావస్తు పరిశోధిత శాస్త్రకారుల దృష్టిని ఆకర్షిస్తున్నది. ఇటీవల జరిగిన 2500 వ బుద్ధజయంతి ఉత్సవాల సందర్భంలో–బుద్ధగయ, సారనాథ్ ప్రపంచ యాత్రికులకు విహారవాటిక యైనది.

నిరంజన నదీ తట ప్రాంతంలో బోధిసత్వుడు కఠోర తపమాచరించాడు, ఆ పవిత్రనదీ ప్రాంతంలోని పచ్చనిపైరులు ఒకనాడు తథాగతునిపాదధూళికి పవిత్రమైనవేగదా. గౌతముడు బుద్ధుడైనతర్వాత ఏడువారాలు- ఏడు ప్రాంతాలలో విహారం సల్పి తన జ్ఞానోదయాన్ని నిండుగా ఆకళింపుజేసికొన్నాడు. మొదటివార మంతా జ్ఞానోదయమైనచోట బోధివృక్షంక్రిందనే నిశ్చలంగా నిలబడి బుద్ధిని కేంద్రీకరించుకున్నాడు. మరువారంలో వునకూ– ముందుకూ తిరుగుతూ ఒడు దుడుకులను సరిదిద్దుకొన్నాడు తర్వాత వారం ఒకచోట నిశ్చలంగా ఆసీనుడై సమాజంలోని చెడు కారణాలను సమీక్ష చేసికొన్నాడు. మరోవారం సూజాత పరమాన్నాన్ని అరిగించిన "నిగ్రోధ"

వృక్షఛాయన నిశ్చలంగా కూర్చుని "నిర్వాణ" సూత్ర విశిష్టతను గాఢంగా పరిశీలించి ఆనందించాడు. ఈవిధంగా ఏడువారాలు - ఏడు ప్రదేశాలను పవిత్రమొనర్చి- జ్ఞానార్జనలో పరిపూర్ణత్వంజెంది. గౌతబుద్ధుడయ్యాడు. ఆ ఏడు పవిత్రస్థలాలలోనూ - స్థూపాలు నిర్మించబడినాయి. అందు కొన్ని శిథిలావసలో వున్నాయి ఆ ఏడు పవిత్ర సలాలలో సంచారం చేసిన మా రైతు లెంతటిధ్యనులు! బోధివృక్షం క్రింద "వజ్రాసనం" సిద్ధార్థునకు జ్ఞానోదయమైన ఆసనం. ఈ ఆసనంలోని మహత్తు, బోధిసత్వునికే తెలియునట. ఆయాసనం నుండే కదా ఒక విశ్వ శాంతిదూతి వెలువడింది! ఆ యాసనం నుండేకదా, ఒక విశ్వజనీన సిద్ధాంతం ఒకానొక అర్ధరాత్రంలో ఆవిర్భవించింది ! అది ప్రపంచలోకల్లా పవిత్ర స్థలమంటే అతి శయోక్తి ఏమున్నది !

బోధిసత్వుని అలయంతో మామనస్సుకు శాంతి చేకూరింది. అందులోని అందమైన బుద్ధవిగ్రహం హృదయ ఫలకంలో సుప్రతిష్ఠితమైంది. బోధి మహావృక్షం ఎదుట నిత్యమూ బెట్లు లామాలు ప్రార్థనగీతాలనాలాపిస్తారు.బోధిసత్వుని ఆలయంలో లెఖ్ఖకు మించిన దివ్యజ్యోతులు నిబిడాంధకారాన్ని బ్రద్ధలు చేస్తున్నాయి.

బుద్ధగయలో చైనా, బర్మా టిబెట్టు విహారాలు - ప్రత్యేకాకర్షణలు. అచ్చటి క్రమశిక్షణ అత్యద్భుతం. అచ్చట ఆదిబోధిమహావృక్షపు ఆకులు భద్రపరచబడినాయి. లోకంలో అన్యాయాలు, అక్రమాలు. అశాంతి ప్రబలిననాడు బోధి సత్వుడు తిరిగి అతరిస్తాడని టిబెట్టు లామాల విశ్వాసమట.

అంతవరకూ, నిరంతరమూ ఆ సుందర విహారంలో బోధి సత్త్వుని ఆరాధన జరగవలసిందే నిత్యమూ అచ్చట జరిగే ఆ సాధన శాంతికోసమే మానవుల సౌఖ్యంకోసమే మానవ కళ్యాణం ఆశించే! అదేకదా తథాగతుని ఆశయం.



గయలో ఫల్గుణీనదీ తటంలో మా రైతులు తిరిగి పితృ దేవతలకు పిండప్రదానాలు చేశారు విష్ణుపాద ఆలయాన్ని దర్శించారు. "కోరికల మర్రి చెట్టు" క్రింద కోరికల నుండి విముక్తులయ్యారు. గయనుంచి బుద్ధగయకు వచ్చేదారిలోని ఈ "కోరి

కల వృక్షం" కోరికలతో ఉక్కిరిబిక్కిరౌతు మానవుని - ఆ జ్వరంనుండి విముక్తుని జేస్తుందని విశ్వసించబడుతున్నది. నిజమే. మరి! అసహజమైన కోరికలు - మానవుని క్రుంగదీస్తాయి. కోరికలనుండి మానవుడు విముక్తుడైనప్పుడే మనస్సుకు శాంతి, పచ్చని చెట్టుక్రింద చేసిన ప్రమాణానికి, పైరుపంటలలో విలసిల్లే భారతావని నిలువ జాస్తిగదా మరి !

# దామోదర్ వ్యాలీ ప్రాజెక్టు

ప్రథమ పంచవర్ష ప్రనాళిక క్రింద నిర్మాణమౌతున్న దామోదర్ వ్యాలీ ప్రాజెక్టు ఒక ఘనవిజయం. దామోదర్ వ్యాలీ కార్పొరేషన్కు సంబంధించిన 'మైథన్' డ్యాంనుగూడా మా రైతులుసందర్శించారు ఇదిఒక బ్రహ్మాండమైననిర్మాణం. దామోదర్ నదిబీహార్, బెంగాలు రాష్ట్రాలలో ప్రవహిస్తున్నది. ఈనదిపై ఐదుఆనకట్టలు నిర్మించబడుతున్నాయి. ఇర్రిగేషన్కు, విద్యుత్ శక్తి ఉత్పత్తికి, వరదనివారణకు, నావిగేషన్కు ఈ ప్రాజక్టు బహుళార్థప్రయోజన కారిగా రూపొందించబడుతున్నది

దామోదర్నది చిన్నది. బీహార్లోచోటా నాగపూర్ పర్వతాలలో జన్మించిన ఈ నది సుమారు 300 మైళ్ళు పర్యంతం ప్రవహించి కలకత్తా దిగువను హూగ్లీలో సంగమిస్తున్నది. ఇది దేశంలోని మిగతా పెద్దనదులతో పోల్చిచూస్తే దివిటీ క్రింద దీపమే. అయినా, ఏటేటా వచ్చే వరదలవలన దేశానికి కలిగేనష్టం అపారం. వంగదేశములోని సస్యసంపద శతాబ్దాలుగా ఈ నదీ జలప్రళయానికి ఆహుతి ఔతుండేది.

'పిట్టకొంచెము కూతఘనము' అన్నట్లు వరద ముమ్మరంగా వచ్చినప్పుడు 650,000 క్యూసెక్కుల వరకూ నీరు ప్రవహిస్తున్నది. 1943 లో ఈ నదీ వరదలవలన సుమారు 9 కోట్లు రూపాయల నష్టం సంభవించింది. ఈ వరదనివారణకు యెన్నో పథకాలు వేయబడినట్లు 1852 – 1943 సంవత్సరాల బెంగాలు రికార్డుల వలన తెలుస్తున్నది.

దామోదర్ లోయ ఖనిజసంపదకు ఆలవాలమైనది. ప్రకృతిసంపదకుపుట్టినిల్లు. దేశంలోని ఖనిజసంపదలో సుమారు మూడింట రెండువంతులు ఇక్కడే లభ్యమౌతుంది. ఇనుము, బొగ్గు, రాగి, అభ్రకం, క్రోమైట్, పింగాణి మట్టివంటి నిధి నిక్షేపాలకు ఈ లోయ అమేయమైన ఖని. కానీ ఈఖని నిన్న మొన్నటివరకూ అజ్ఞాతంలోనే ఉండిపోయింది. దామోదర్ నది వరదలవలన ప్రతియేటా ఈ సంపదకు అపారనష్టం కలుగుతుండేది. దామోదర్ నీటిని సద్వినియోగం చేసికోగలిగితే ఈ ఖనిజ సంపద దేశప్రయోజనానికి. ఉపయోగపడుతుంది.

చిరకాలంగా పంటభూములపై విలతాండవం చేస్తూ, రైతాంగాన్ని నానాబాధలకు గురిచేస్తున్న ఈ దామోదర్ నదిని అరికట్టుటద్వారా– వరదల్ని నిరోధించుటకు, వ్యవసాయ క్షేత్రాలకు నీటి వసతులు – గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయుటకు, అడవుల పెంపకం, భూసార రక్షణ. నౌకాయానసౌకర్యాలు- ప్రజారోగ్యరక్షణ, నిర్వాసితులకు పునరావాస సౌకర్యాలు – మొదలగు కార్యక్రమాలను నిర్వహించుటకు 1948 లో కేంద్ర శాసనసభ విస్తృతాధికారాలతో

"దామోదర్ వ్యాలీ కార్పొరేషన్" అనే ఒక సంస్థను నిర్మించింది. ఇది దాదాపు అమెరికాలోని "టెన్నెస్సీవ్యాలీ అథారిటీ" ప్రాతిపదికలమీద పనిచేస్తుంది. అలాగే మన "నాగార్జున సాగర్ కంట్రోలు బోర్డు" కూడాను. ఈ దామోదర్ వ్యాలీ కార్పొరేషన్ (డి.వి.సి)లో కేంద్ర, బీహారు. బెంగాలు రాష్ట్ర ప్రతినిధులు ఉంటారు.

దామోదర్ లోయ ఎగువభాగం ఖనిజసంపదలో సమృద్ధమైనది. అలాగే దిగువభాగం వ్యావసాయకంగా సంపన్నమైనది. బర్ద్వాన్, హుగ్లీ, హౌరా, బంకురాజిల్లాలు ఒకప్పుడు వ్యవసాయోత్పత్తిలో ఎంతో ప్రసిద్ధి గాంచినప్పటికీ దామోదర్ నదీజలాల ఔద్ధత్యంవలన అవి క్రమంగా పాడుపడుతూ వచ్చాయి. ఈ లోయలోని నిక్షిప్త సహజసంపదను సద్వినియోగం చేసికొనేందుకు స్వతంత్రభారతం ముందంజ వేయగలగడం మన రైతాంగపు అదృష్టం.

ఆదిలో ఈ ప్రాజెక్టు 55 కోట్ల వ్యయంలోనే పూర్తి కాగలదని అంచనాలు వేయబడినప్పటికీ, తర్వాత ఆయకట్టును విస్తృంజేయు తలంపుతో ఆ అంచెనాను 55 నుండి 77 కు పెంచవలసి వచ్చింది. తిరుగా ధరలు పెరిగినందున అంచెనాలు ఇంకా సవరించక తప్పలేదు.

ఈ అంచెనాల ప్రకారం దామోదర్ నదిపై ఐదు చోట్ల - అనగా-తిలయా, కోనార్, దుర్గాపూర్, మైథన్, పంచత్ హిల్ దగ్గర ఐదు ఆనకట్టలను నిర్మించవలసియున్నది.

ఇప్పటికి తిలయ్యా, కోనార్ ఆనకట్టలు, దుర్గాపూర్ బ్యారేజీ-మైథన్ డాం పూర్తయ్యాయి. పంచత్ హిల్ వచ్చేసంవత్సరం పూర్తవుతుంది.

మా రైతులు మఖాన్ డాంను సందర్శించారు. ఈ ఆనకట్ట నదీగర్భం నుంచి 192 అడుగుల ఎత్తుఉన్నది. రిజర్వాయరులో 11 లక్షల ఎకరాలకు సరిపడే నీరు నిల్వచేయబడుతుంది. మట్టిపనితో సహా మొత్తం ఆనకట్ట నిడివి 3 మైళ్లు విద్యుత్పాదన యంత్రం పూర్తి అయి పనికి సిద్ధం చేయబడుతున్నది. ఆనకట్టమీదనుండి చూస్తే నది చిన్నదిగా కనుపిస్తున్నది. అయినా నీటిప్రవాహం జాస్తి. ఇచ్చట పవర్ హౌసు 60,000 కిలోవాట్ల శక్తిని ఉత్పత్తిచేస్తుంది.

దామోదర్ లోయ ప్రాజెక్టుక్రింద ఉత్పత్తిఅయ్యే శక్తి గయ, పాట్నా, డాల్మియానగర్, కలకత్తాలకుగూడా సరఫరా చేయబడుతుంది. ఈ ప్రాజెక్టుక్రింద ప్రథమదశలో 40 వేల ఎకరాలు తిరిగి వ్యవసాయయోగ్యం చేయుటకు, భూసార సంరక్షణ కార్యక్రమాన్ని సాగించుటకు నిశ్చయించబడింది. అంతే కాక 15 లక్షల రూపాయల వ్యయంతో సాలుకు 500 ఎకరాల చొప్పున కొంత భూమిని అటవీప్రాంతంగా మార్చుటకు గూడా నిశ్చయించ బడింది. బీహారులో 15 లక్షల ఎకరాలకు తిలయా సాగు పథకం ప్రవేశపెట్టబడింది.

మొత్తం ఈ ప్రాజెక్టుక్రింద ఆయకట్టు 16,26,000 ఎకరాలని అంచనా వేయబడింది. దామోదర్ నదిలో ప్రతియేటా సరిపడినంత నీరు ఉంటుందో— ఉండదోనన్న అనుమానంతో

బొకారోదగ్గర ఒక థర్మల్ స్టేషన్‌ను నిర్మించారు. దీని ఉత్పాదక శక్తి 200.000 కిలోవాట్సు. ప్రస్తుతం 150000 కిలోవాట్సు మాత్రమే ఉత్పత్తి అవుతుంది. దీనిద్వారా జెమ్షెడ్‌పూర్. హీరాపూర్ ఇనుము - ఉక్కు కర్మాగారం, ఘటశీలావద్ద రిఫైనరీ, రాగిగనులు, పశ్చిమబెంగాలు, బీహారు రాష్ట్రంలోని బొగ్గుగనులు, ఆసన్‌సోల్. సింద్రీ పరిసరాలలోని సిమెంటు ఫ్యాక్టరీ, ఇంజనీరింగు పరిశ్రమలకు విద్యుత్తు సరఫరా చేయబడుతుంది. జలవిద్యుత్ చాలినంత లభ్యం కానప్పుడు ఆ లోపాన్ని బొకారోథర్మల్ స్టేషన్ భర్తీచేస్తుంది. అందుచేత డి. వి. సి. లో ఇదీ అంతర్భాగమేనని చెప్పవలసి ఉంటుంది,

దామోదర్ లోయలో లభ్యమయ్యే అపార ఖనిజసంపదలను వినియోగించి ఇక్కడ ఉత్పత్తి అయ్యే విద్యుత్‌తో రకరకాల పరిశ్రమలను నెలకొల్పవచ్చును. అందుకు భారత ప్రభుత్వం అంచెనాలను తయారు చేయిస్తున్నది. ప్రభుత్వం తరఫున అప్పుడే అనేక విదేశ సంస్థలు దర్యాప్తులు ప్రారంభించాయి. ఇందుకు సంబంధించిన భారత ప్రభుత్వప్రతినిధులతో ఒక దర్యాప్తుసంఘంగూడా నియామకమైంది. కాల్షియమ్ సైనైడ్, కాస్టిక్‌సోడా, ఎరువులు, అదకపురంగులు, మందులు ఇంకా అనేక రకాలైన రసాయన పరిశ్రమలు స్థాపించే విషయమై ఈ కమిటీ పరిశీలనలు సాగిస్తున్నది. చేనేతవస్త్రాలు- వ్యవసాయ పరికరాలు, ఇనుము- కంచు- ఇత్తడిసామానులు- కమ్మరం మొదలైన కుటీరపరిశ్రమలను ఆధునిక పద్ధతుల్లో అభివృద్ధిపరచే విషయమైకూడా దర్యాప్తులు జరుగుతున్నాయి.

దామోదర్ నదిమీద నిర్మించబడిన "దుర్గాపూర్ బ్యారేజీ" నుండి హుగ్లీమీద- కలకత్తాకు 46 మైళ్ళ ఎగువన వున్న రఘునాథ్‌పూరుకు- మొత్తం 88 మైళ్ళదూరం నావల్లో ప్రయాణం చేయడానికి వీలుగా ఒక పెద్దకాలువ త్రవ్వబడు తున్నది. దామోదర్‌లోయ బాగా అభివృద్ధి అయినమీదట ఈ కాల్వమీద ఏటేటా 2000,000 టన్నుల రవాణా కాగల దనీ తద్వారా సాలుకు మొత్తం 80 లక్షల రూపాయిలు ఆదాయం లభించగలదనీ అంచనా వేయబడింది.

ఈ ప్రాజెక్టుకు సంబంధించిన మైథాన్ డాం చూచిన మీదట - అచ్చటి దామోదర్ వ్యాలీ కార్పొరేషన్ కార్యా లయంలో ప్రాజెక్టు వివరాలను తెలిసికొన్నమీదట - కొలది రోజుల్లోనే ఈ దామోదర్ లోయ - వ్యవసాయికంగానూ, పారిశ్రామికంగానూ-అత్యున్నత స్థానాన్ని అందుకొనగలదనీ- అది నవభారత నిర్మాణానికి ఒకచక్కని దృష్టాంతరం కాగలదనీ కూడా మా రైతులు తమ సంతృప్తి వెలిబుచ్చారు.

# సింద్రీ ఎరువుల ఫ్యాక్టరీ

మైథన్ డాంనుండి ఆసియాలోకల్లా పెద్దదైన సింద్రీ ఎరువుల ఫ్యాక్టరీని సందర్శించాము.

ఒకనాడు 'సింద్రీ' ఒక కుగ్రామం ఈనాడది ఒకనగరం స్వతంత్ర భారతంలో మొట్టమొదటిసారిగా దేశీయుల- విదేశీయుల దృష్టి నాకర్షించ గలిగింది సింద్రీయే.

ఇది వ్యవసాయ దేశమైనప్పటికీ సింద్రీ ఫ్యాక్టరీ నిర్మాణమయ్యేవరకూ ఈ దేశంలో ఎరువుల కర్మాగారమే లేదు. ఆంగ్లేయుల హయాంలో మన పొలాలు బీడుపట్టిపోయాయి. ఊసర క్షేత్రాలయ్యాయి.

స్వతంత్రంవచ్చిన కొద్దికాలానికే మన వ్యవసాయదారులకు గర్వకారణమైన సింద్రీ ఫ్యాక్టరీని నిర్మించుకోగలిగాము! మన వ్యవసాయాన్ని శాస్త్రీయపద్ధతుల్లో అభివృద్ధి చేసికోనేందుకు - వ్యవసాయోత్పత్తిలో పురోగమించేందుకు ఆహార ధాన్యాలలో స్వయంసమృద్ధిని సాధించేందుకు- వాణిజ్యపంటలలో విదేశమారకంద్వారా దేశీయ ఆర్థికవ్యవస్థను బలపరచుకోనేందుకు సింద్రీ ఎరువుల కర్మాగారం నాంది ప్రస్తావన అనుటలో సందేహంలేదు.

ఎన్నాళ్ళుగానో మనం కలలుకన్నాము ఎరువుల ఫ్యాక్టరీ కొరకు. దాన్ని సింద్రీదగ్గర సాధించుకోగలిగాము. ఆకర్మాగారాన్ని మా రైతులు చూచినప్పుడు వారి ఆనందానికి మేరలేక పోయింది. ఔను మరి! రైతుకు కావలసింది భూసారాన్ని

రక్షించుకోవడం - పెంచుకోవడమే కదా! దూడను పెంచుకున్నట్లు, దానికి ఏ అరిష్టాలూ రాకుండా కాపాడుకుంటూ ఎద్దు చేసుకొన్నట్లుగా; రైతు పొలాన్ని కాపాడుకుంటాడు. సారం చావకుండా జాగ్రత్త పడతాడు. భూమి నిస్సారమైతే రైతు నిస్తేజుడౌతాడు. సమాజమే నిస్తేజమౌతుంది. మానవాళి కరువురాకాసి కంకాళ నృత్యానికి వికాసికలైపోతుంది.

మనకు శాస్త్రీయమైన - కృత్రిమమైన ఎరువులు లేని నాడు - రైతు సంపదను పెంచుకొన్నాడు. పశువులద్వారా భూమికి సారమిచ్చాడు - పదును పెట్టాడు - సేద్యం చేశాడు. ఆ నాడు పొగాకులాంటి వాణిజ్య పంటలు లేవు. పశుగ్రాసాన్ని ఇచ్చే పంటలు జాస్తి. కానీ సేద్యం విస్తృతం కాలేదు. భూమి నంతా సేద్యంక్రిందకు తీసుకరాలేకపోయాడు. అందుకు కారణం - కావలసినంత ఎరువులు లేకపోవడమే.

యిరోపా - అమెరికా దేశాలను పోల్చిచూస్తే - మన కున్న పొలాలకి సగటు ఉత్పత్తి తక్కువగా కనపిస్తుంది. ఏళ్ళనాటికావడం భూసారం తగ్గడం వల్ల - కీటనాశకాలు లేనందున - పరదబాధలు జాస్తియయినందున భూములు పండలేదు. గ్రామాలు కరువుకాటకాలకు గురి అయ్యాయి. వెనకబడి పోయాయి.

అయినా రైతు కోండ్రను వదలిపెట్టలేదు. అది మన దేశపు అదృష్టం. కష్టాల కోర్వలేక - శిస్తులు - బకాయిలు చెల్లించలేక, కుటుంబాన్ని జరుపలేక రైతు పస్తులపాలై పోవలసింది. లాగుడు రిక్షాను ఆశ్రయించవలసింది. బస్తీలలో పాకీదొడ్లపాలు కావలసింది. కాని ఆ అపాయం తప్పింది.

జాతీయోద్యమం, రైతు ఉద్యమం ఆ అపాయాన్నుంచి దేశాన్ని రక్షించాయి. అలాంటి నికృష్ట జీవితాలకు రైతాంగం, గ్రామీణులు పాల్పడక ముందే కర్షకోద్యమం కనువిప్పినది. రైతాంగంలో జాగృతి కలిగించింది, కర్షకోద్యమం- జాతీయోద్యమం ఏకమై జాతీయస్వాతంత్ర్యాన్ని సాధించుకొన్నాయి. దేశానికి, రైతాంగానికి అదృష్టపు దినాలు అవతరించాయి. స్వాతంత్ర్య భానోదయంతో రైతాంగాని కొక ఆశాకిరణం దృగ్గోచరమైంది అదే రైతులు, వారి ప్రతినిధులు సామాజిక వ్యవస్థానిర్మాణంలో ముఖ్యమైన పాత్రను తీసుకోగలగడం. రైతులకొక నాయకత్వం దొరికింది దానిని అందజేసికొని ఆర్థిక రంగంలో పురోగమిస్తున్నారు. నన్ను మొన్నటి సింద్రీఫ్యాక్టరీ, భాక్రా, నాంగాల్, నేటి నాగార్జునసాగర్, రేపటి రామపాదసాగర్, వంశధార - రైతాంగపు జాగృతియొక్క సత్ఫలితాలే; నాయకత్వపు ప్రభావములే.

రైతుల ఆశాజ్యోతి సింద్రీ. అలాంటివి ఆంధ్రులకు ఒకటి కావాలి. ఆ భావన ఆనాడు సింద్రీదగ్గర మా రైతులలో ప్రస్ఫుటమైంది. ఈనాడు సింద్రీలో ఉత్పత్తి అయ్యే ఎరువు నంతా ఆంధ్ర రైతులు వినియోగించుకోగలరు. సింద్రీ దేశావసరాలకు చాలదు. అది ఆసియాలోకల్లా పెద్దదైనప్పటికీ, అంతభారీ ఫ్యాక్టరీలో ఉత్పత్తిఅయ్యే ఎరువులు - శరవేగాన పురోగమిస్తున్న ఆంధ్రప్రదేశ్ వ్యవసాయానికే చాలదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలం ముగిసేలోగా మన రాష్ట్రంలో వ్యవసాయోత్పత్తులు నూరింట 40వంతులు పెంచాలంటున్నారు.

అది సాధింపబడాలంటే సింద్రీ అంత పెద్దకర్మాగారం విజయవాడలో నెలకొల్పబడాలి. ఆంధ్ర రైతులు శాస్త్రీయ ఎరువుల వాడకంలో ఘటికులయ్యారు. ప్రథమశ్రేణిలో వస్తున్నారు. అవకాశాలంటే రెట్టింపుగా ఉత్పత్తుల్ని పెంచేశక్తి ఆంధ్ర రైతులకున్నది. ఇదే ఆశాభావాన్ని సింద్రీ ఫ్యాక్టరీ దగ్గర మా రైతులు వెలిబుచ్చారు.

## చిత్తరంజన్

ధన్‌బాద్ దగ్గర దామోదర్ వ్యాలీ కార్పొరేషన్‌కు సంబంధించిన "మైథాన్ డాం" సింద్రీ ఎరువుల ఫాక్టరీచూచిన తర్వాత జూన్ 19 ఉదయానికి చిత్తరంజన్ చేరుకొన్నాము.

చిత్తరంజన్ సంతాల్ పరగణాలలోనిది 1947కుముందు ఒక చిట్టడవి. కొండగుట్టలు- చిట్టడవులతో నిండి బాటసారులను భయభ్రాంతులు గొలిపే, ఆ ప్రదేశంలో ఈ నాడొక మహా పట్టణం వెలిసింది. ఒక మహత్తర కర్మాగారం ప్రతిష్ఠాపితమై ఉన్నది.

సంతాలులు కొండజాతివారు. దాప్లుకొట్టుకొని జీవిస్తూ ఉండేవారు. ఆ ప్రాంతం మనుష్యులకు దుర్భేద్యం. ఆనాడది మానవ సభ్యతకు నోచుకోలేదు. సభ్యసమాజనాగరికతకు సుదూరంలో ఉన్నది. కానీ కాలప్రభావం! కాలపురుషుడు కాలుకదిపాడు. అంతటితో చరిత్రగతిమారింది. ఆ ప్రాంతం నవనాగరికతా ప్రపంచానికి మకుటాయమానమైంది. సమాజానికి ప్రాణప్రదమైన రైలు

ఇంజన్లు ఈనాడక్కడ భారీ యెత్తున ఉత్పత్తి అవుతున్నాయి. దేశానికి నాడులు రైల్వేలు ఈ నాగరికతా ప్రపంచంలో రైల్వేలే లేకపోతే చరిత్ర ఉండదు. సంస్కృతి ఉండదు. అసలు దేశమే లేదని చెప్పాలి. 104 సంవత్సరాలనాడు లార్డ్ కర్జన్‌హయాంలో బొంబాయినుండి మొట్టమొదట రైలు మార్గం నిర్మించబడింది ఈ దేశపు నాగరికతలో అదొక ప్రధానఘట్టం

ఈ దేశ చరిత్రలో ఒక శతాబ్దపు రైల్వేల చరిత్ర రసవత్తరమైంది. ఆనాటినుండి ఈనాటివరకు రైళ్ళలోని రద్ది అందుకు నిదర్శనం. అయితే ఒక విశేషమేమిటంటే నిన్న మొన్నటివరకు రైలుపెట్టెల్లో మార్పు తక్కువ. ఇటీవల బొగు ళూరులోని హిందూస్తాన్ ఎయిర్‌క్రాఫ్ట్స కంపెనీలో తయా రయ్యే పెట్టెలే సౌకర్యంగా ఉన్నాయి.

రైల్వేలు నిర్మాణమైన ఆదిలో కట్టించిన వంతెనలు శిధిలావస్థలో ఉన్నాయి వందలాది మానవప్రాణాలు మూ కుమ్మడిగా ఈ శిధిలావస్థలో ఉన్న రైల్వేలకు బలికావలసి వస్తున్నది. రైళ్ళలోరద్ది మరెన్ని చిక్కులను కలిగిస్తున్నది. మనరైళ్లు "టైం టేబుల్" ను ఎప్పుడో అధిగమించాయి. మామూలు రోజులలో కూడా గంటల తరబడి ఆలస్యమవు తూనే ఉంటాయి. గంటలు గంటలు ప్రయాణీకులు ఎలాంటి వసతులూ లేని నికృష్టమైన ప్రయాణీకుల షెడ్డులలో "కాన్సన్ ట్రేషన్ క్యాంపు" జీవితాలను గడపవలసి వస్తున్నది. దీనికంతా కారణం ప్రయాణీకులు జాస్తికావడం. రైల్వేఅడ్మినిస్ట్రేషన్‌లో

నైపుణ్యత కొరతబడడం; ప్రజా సహకారాన్ని కావలసినంత పొందేవిధంగా రైల్వే అధికారులు వ్యవహరించలేకపోవడం అని చెప్పవలసివస్తున్నది.

ఏది యేమైనప్పటికీ స్వతంత్రభారతంలో రైల్వేలు గణనీయమైన అభివృద్ధిని సాధించాయి. అందుకు చిత్తరంజన్, పెరంబూర్, హిందుస్థాన్ ఎయర్‌క్రాఫ్ట్స్ ఫ్యాక్టరీ చక్కని నిదర్శనాలు. చిత్తరంజన్ ఒక కల లాటింది. పది సంవత్సరాలలో అది ప్రపంచ ప్రఖ్యాతిగాంచింది. భారతీయులు అన్నిరంగాలలోనూ సమర్థులు, నిపుణులు, దీక్షాపరులు అనడానికి చిత్తరంజన్ ఒకగొప్ప సాదృశ్యం.

చిత్తరంజన్‌కు ముందు–ఇంజన్లు తయారుచేసే ప్రయివేటు కంపెనీలు లేకపోలేదు. కాని చిత్తరంజన్‌కు సాటి చిత్తరంజనే. అంతకు ముందున్న "పెనన్సులర్ లోకోమోటీవ్ కంపెనీ తాతా లాకో మోటీవ్ ఇంజనీరింగు కంపెనీకి అప్పగించబడింది– ఆ కంపెనీ ఉత్పత్తిచేసే లోకోమోటీవ్‌లు, బాయిలర్లు 17 సంవత్సరాలపాటు ప్రభుత్వం కొనుగోలుచేయాలనే ఒప్పందంమీద.

అదికాక ప్రత్యేకంగా ఒక సంస్థను నిర్మించాలని ఆలోచన 1947 లో ఫలించింది. కాంచ్రాపర దగ్గర ఈ సంస్థను నెలకొల్పుటకు – అక్కడే ఒక అధునాతనపట్టణాన్ని నిర్మించుటకు నిర్ణయంజరిగింది. దీనికి అకుంఠిత దేశభక్తుడు – త్యాగి అయిన దేశబంధు చిత్తరంజన్ స్మృతి చిహ్నంగా నామకరణం చేయగలగడం మన అదృష్టం – త్యాగాల పట్లమనకుగల విశ్వాసానికి తార్కాణం.

అది చిత్తరంజన్ రైలు ఇంజన్ల కర్మాగారం. మా రైలు అజాయ్‌నది సరోవర ప్రాంగణంలో ఆగింది. అజాయ్‌నది సరో వరం 101 ఎకరాల వైశాల్యం. నవ భారత నిర్మాణం మా కళ్ళ ముందు నిలచినట్లున్నది. ఎనిమిదేళ్ళలో అంత పెద్ద పట్ట ణం అంత పెద్దకర్మాగారం – అన్ని రైలు ఇంజన్లు తయారు కావడం చూస్తే – కన్ను మూసి కన్ను తెరచేలోగా ఏదో గారడి జరిగినట్లుండదూ !

కర్మాగారంలో జట్లుగా ప్రవేశించాము. అది సామాన్యమైనదా? 8.80,000 చదరపు అడుగుల వైశాల్యం, 985 వర్కుషాపులు నిర్మాణానికి 183 లక్షల రూపాయలు ఖర్చయింది. ఇంజను అమర్చే వర్కుషాపు, బాయిలర్లు తయారుచేసే షాపు, టెండర్ షాపు, ఎరెక్టింగ్ షాపు అన్నింటి కంటే పెద్దవి. 3,32,350, చదరపు అడుగుల వైశాల్యంలో 1560 అడుగుల పొడవు 213 అడుగులవెడల్పున ఉన్నాయి. షెడ్డుఎత్తు 75 అడుగులున్నది.

ఇంజను నిర్మాణానికి కావలసిన సిట్లు దగ్గరనుండి బాయిలరు వరకు ప్రతి వస్తువు అక్కడే తయారవుతున్నది. మొట్ట మొదట్లో ముడిఉక్కును చూశాము. చిట్టచివరన పొగలు చిమ్ముతూ – ఆఖరి కూతకూస్తూ – గుప్పుగుప్పుమని షెడ్డునుండి బయటకు వెళ్లుతున్న రైలు ఇంజన్ను చూశాము. ఒక్క మూడు గంటల్లో రైలు ఇంజనులోని మర్మాన్ని తెలిసికో గల గడం సామాన్యమా !

మొదటి పథకం ప్రకారం సాలుకు 120 ఇంజన్లు 20 విడిబాయిలర్లు ఉత్పత్తిచేయాలని అంచనా. ఇటీవల పై అంచె

నాలను సవరించి సాలుకు 200 ఇంజన్లు 100 విడిభాగాయిలక్లు ఉత్పత్తిచేయడానికి నిర్ణయించారు. చిత్తరంజన్‌లో తయారు చేస్తున్న ఇంజనులు W. G, టైపు. ఒక వంద W. G. ఇంజన్లు తయారుచేయుడానికి సుమారు 7400 టన్నుల ఉక్కు భాగాలు 2300 టన్నుల ఉక్కు చుట్టలు, 250 టన్నుల బాయి లర్ ట్యూబులు 150 టన్నుల రబ్బరు – కొయ్యసామానులు అవసరముంటుంది.

ఇప్పుడు 577 W. G. లోకో మోటివ్ ఇంజన్ భారీ మైనది. నడిచేటప్పుడు 175 టన్నుల బరువు తూగుతుంది. ఖాళీగా ఉన్నప్పుడు (స్టీమ్ లేనప్పుడు) 123 టన్నుల బరువుం టుంది. దీనిలో సుమారు 5330 విడిభాగాలున్నాయి. ఇది మామూలు బ్రాడ్ గేజి ఇంజనుకంటే పెద్దది.

మొట్టమొదటి చిత్తరంజన్‌లో లోకోమోటివ్ ఇంజనుకు 1951 నవంబరు 1 న ప్రారంభోత్సవం జరిగింది 1950 – 51 ఆర్థిక సంవత్సరంలో 7 ఇంజన్లు తయారయ్యాయి. 1951-52 లో 17, 1952-53 లో 33, 1953-54 లో 64, 1954 – 55 లో 98 ఇంజన్లు పనిలో ప్రవేశించాయి. నెల నెలకూ ఉత్పత్తి సంఖ్య అభివృద్ధి చెందుతూనేఉన్నది.

1955 జనవరినుండి నెలకు 10 ఇంజన్లు చొప్పున తయారౌతున్నాయి. 1956-57లో 125 ఇంజన్లు తయారు కాగలవని అంచనా.

1954 జనవరి 6 న 100 వ లోకో ఇంజనుకు రైల్వేల మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ప్రారంభోత్సవం జేశారు. దీనిని చిత్తరంజన్ 100 అని నామకరణం చేశారు.

1955 ఏప్రిల్ 27-న 200 వ లోకో ఇంజన్‌కు రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ప్రారంభోత్సవం చేశారు. ఈ భారీఇంజను గంటకు 15 మైళ్ళ వేగం పోగలదు.

1956 ఆసాంతానికి మొదట వేసికొన్న అంచనాల ప్రకారం 263 ఇంజనులు తయారు కావలసియుండగా దాదాపు 337 దాకా పూర్తి కావస్తున్నవి. ఇదే భారతీయ కార్మికుల- ఇంజనీరుల సాంకేతిక నైపుణ్యానికి, దీక్షకు ప్రబలతార్కాణం

గూడ్సు రైలుబళ్లకు పనికివచ్చే W. G. భారీ ఇంజన్లనే కాకుండా పాసెంజరు బండ్లకు పనికివచ్చే తేలిక ఇంజన్లను గూడా ఉత్పత్తి చేయుటకు ఆలోచనలు జరుగుతున్నాయి. ఇప్పుడు చిత్తరంజన్‌లో తేలిక ఇంజనులను తయారుచేయుటకు అవసరమయ్యే సాంకేతిక సంపత్తిని సాధించినారని చిత్తరంజన్ సమాచార శాఖాధ్యోగి మాతో అన్నారు. కొద్ది రోజుల్లోనే రైలు ఇంజన్లకు విదేశ దిగుమతులపై ఆధారపడకుండా భారత దేశం స్వయం సమృద్ధిని సాధించగలదనిగూడా ఆయన అన్నారు.

చిత్తరంజన్ కర్మాగారంలో మహత్తరమైన విశేషాలను తిలకించాము. ఆ మరలలో ఆ ధ్వనిలో-ఆ అగ్నిగోళాలమధ్య- ఆ వేలాది కార్మికుల శ్రమలచెమటలో-దీక్షలో-పటుత్వంలో-

నైపుణ్యంలో ఆ ఇంజన్ పరికరాలలో – ప్రతిశీలలో - ప్రతి ముక్కలో – మేము నవభారత నిర్మాణాన్ని చూశాము. దేశాభివృద్ధిని కాంచాము ఆ సమ్మెటపోటులో భారత భావి గోదయం ప్రతిధ్వనిస్తూంది. స్వేదాచ్ఛాదితమైన ఆ కార్మిక సోదరుల ముఖంలో భారతజాతి ఉజ్వల భవిత్యం ప్రతిబింబిస్తూంది. తయారైన, పొగలు చిమ్ముతూ ఘీంకరిస్తున్న ఇంజను ధ్వనిలో భారతావని అభ్యుదయ పురోగమననినాదం మా కర్ణ రంధ్రాలకు సోకింది.

చూచాము కార్మిక సోదరుల, నవభారత నిర్మాతల సుందర నగరాన్ని. అందులోని ఉద్యానవనాలను. పగలంతా చెమటోడ్చి నవభారతం నిర్మాణంలో ఇటుకలు అమర్చిన మా కార్మిక సోదరులకు – ఆ మనోహర సరవాటిక మనశ్శాంతిని ప్రసాదిస్తుందికదా!

ఆ పారిశ్రామిక నగరం సువిశాలమైనది. శ్రేయో రాజ్య సూత్రాలను దృష్టినందిడుకొని నియమ బద్ధంగా నిర్మించిన నగరమది. మరలమధ్య మనుష్యులకు మనశ్శాంతి అవసరం కదా! ఆ గ్రామీణ వాతావరణంలో నిర్మించిన పారిశ్రామిక నగరం సుందర ప్రకృతికి ఆలవాలమై 5000 కట్టడాలతో విరాజమానమైయున్నది. ఇది ఒక నూతనమైన నమూనా పారిశ్రామిక నగరం. ఈ నగర నిర్మాణానికి 680 లక్షల రూపాయలు ఖర్చయింది. దీని వైశాల్యం 7 చదరపు మైళ్లు. 30 వేల జనాభా ఉన్నది

కట్టడాలు అధునాతనంగా – ఆదర్శంగా – అందంగా ఉన్నాయి. ప్రతి ఇంటికీ రెండు గదులు – ఒక వంటగది – ఒక

వగైరా.- ఇంటిముందర ఖాళీస్థలం - కాంపౌండు - విద్యు ద్దీపాలు - నీటికొళాయిలు- ఫ్లెష్ఔట్ మరుగుదొడ్లు, స్నానా లగది అమర్చబడి ఉన్నాయి. ప్రతి కాలనీకి ప్రత్యేకంగా అంగళ్ళు, మాతాశిశు వైద్య కేంద్రాలు, పాఠశాలలు, క్రీడా మైదానములు, ఆస్పత్రులు, ఉద్యానవనాలు, సాంఘిక సేవా కేంద్రాలు, రిక్రియేషన్ క్లబ్బులు నెలకొల్పబడినాయి.

సాంఘిక వైజ్ఞానిక జీవితానికి అవసరమైన అన్ని హంగులూ సమకూర్చబడినాయి. సినీమాలు - నాటకశాలలు ఆటలపో టీలు, ఒకటేమిటి - ఆధునాతన మానవ జీవితానికి అవసర మైన వాతావరణం ఆ అద్భుత నగరంలో సృష్టించబడింది. అందుకే "భారతదేశ అభ్యుదయానికి చిత్తరంజన్ పారిశ్రా మిక సుందరనగరం ఒక రసాత్మక చిహ్నం" అన్నారు మన ప్రధాని నెహ్రూ.

చిత్తరంజన్‌లో మేము గడిపింది 5 గంటలు మాత్రమే. అది దాటి మా బండి బయటకు వచ్చిన తర్వాత మరో ప్రపం చంనుండి బయటికి వచ్చినట్లుగా ఉంది.

ఆ మరునాడు ఒక మహా పారిశ్రామిక నగర సందర్శ నం. ఒక లోహయుగంలో అమాంతంగావచ్చి వాలాము. అదే జమ్‌షెడ్‌పూర్.

# తాతానగర్

తాతానగర్ సందర్శనంతో మా బీహారు పర్యటన పూర్తయింది. నాలుగు రోజులు పర్యంతం బీహారులో తిరి గాము పవిత్ర బౌద్ధక్షేత్రమైన గయతో ప్రారంభమైన బీహారు పర్యటన సుప్రసిద్ధ పారిశ్రామిక నగర మైన జెమ్‌షెడ్‌పూర్‌తో (తాతానగర్) పరిపూర్ణమయింది.

జెమ్‌షెడ్‌పూరులో మాత్రం దాదాపు యావత్తు భారత దేశాన్ని చూడగలిగాము. బీహారీయులు, వంగీయులు, ఓంఢ్రులు, ఆంధ్రులు, సిక్కులు, మహారాష్ట్రీలు, తమిళులు అందరూ తాతా నగర్‌లో ఉన్నారు. బహుభాషల కూడలి తాతానగర్. శ్రమజీవులకు, నవభారత నిర్మాతలకు భాషాభేదం గానీ, వర్గవ్యత్యాసంగానీ, ప్రాంతీయ భేదంగానీ అంటవనీ– శ్రమజీవులంతా ఒకటేనని, ఒకే మతమనీ– ఆ పారి శ్రామిక నగరం నిరూపిస్తూంది.

అక్కడి కాంగ్రెసు సంఘానికి ఆంధ్రుడే ప్రధాన కార్య దర్శి. అయినా వారిలో ఆభేదం కనుపించదు.

అది ఒక మహత్తర పారిశ్రామికకేంద్రం – కార్మిక నగరం. అలాంటి పారిశ్రామిక కేంద్రాన్ని కలిగయున్న బీహారు ధన్యత జెందింది.

జూన్ 20 అర్ధరాత్రికే మాబండి దిట్టంగా పొగలు చిమ్ముతున్న తాతానగర్ చేరుకున్నది. తెల్లవారిందే తడ వుగా అనేక భాషలు మాట్లాడేవారి మధ్య మేముండటం మా ...తులకు ఆశ్చర్యంగానేఉన్నది.

అచ్చటఆంధ్రసోదరులు మమ్మాదరించారు. వెయ్యి - అరవెయ్యికాదు.నలభైవేలమంది తెలుగు సోదరులున్నారు ఆ పారిశ్రామిక నగరంలో. తెలుగు మాగాణంనుండి - పొట్టచేత బుచ్చుకొని - పర రాష్ట్రాలకు, పర దేశాలకుపోయినవారు మిగతా విషయాలెలా ఉన్నా కష్టార్జితంతో తిండికి బట్టకు లోటులేకుండా జీవితయాత్రసాగిస్తున్నారు. అది మనకు సంతోషదాయకంకాదా !

"ఈ ఇనుప యుగాన్ని చూట్టానికి వచ్చారా మన రాజ్యంనుండి" అని పరామర్శించారు. ఫ్యాక్టరీని సందర్శించుటకు అన్ని ఏర్పాట్లు చేశారు మా ఆంధ్ర సోదరులు.

ఆరోజు మధ్యాహ్నం నుండి చీకటిపడేవరకూ ఆ బృహత్తరమైన కర్మాగారంలో బస్సులలో తిరిగాం. ఆ ఫ్యాక్టరీ ఆవరణం 2-క చదరపు మైళ్లు.

దేశంలోని ఇనుము - ఉక్కు ఫ్యాక్టరీలన్నింటికంటే ఇది పెద్దది. ఒకప్పుడు ఈ కంపెనీయే రైలు ఇంజన్లు తయారు చేస్తుండేది.

స్వాతంత్ర్యానంతరం మనం యంత్రయుగంలో అడుగిడుతున్నాము పారిశ్రామికాభివృద్ధి పథకాలను రచించుకొంటున్నాము. అపారమైన సహజసంపదను వినియోగించు కొనేందుకు ముందుకు వస్తున్నాము.

ఒకనాటికి మన కాకిరా ముగనులు నవభారత నిర్మాణ చరిత్రలో మొదటి పుటలో ఉల్లేఖించబడగల వనుటలో సందేహంలేదు. శాస్త్రవిజ్ఞానం పెరిగిపోతున్నకొలదీ ఇనుముకు ప్రాధాన్యత హెచ్చిపోతున్నది. పరమాణుయుగంలో రాకెసి

బొగ్గు, నూనెగనులకు ప్రాధాన్యత తగ్గిపోతుందిగాని ఇనుము-ఉక్కు అవసరం మాత్రం తరగదుగదా! అధికమిస్తుంది. అదే మన దేశంలో కోకొల్లలుగా లభిస్తున్నది. ఎక్కడతవ్వినా కాకి రాయే. రాకిరాయి ప్రభావం బంగారును మరపింప జేస్తున్నది. ఇనుము మానవ సమాజానికి భృతి కలిగిస్తున్నది. మానవ నాగరికతకు మెరుగులు దిద్దుతున్నది. మానవాభ్యుదయాన్ని శరవేగాన ఉరకలు తోలిస్తున్నది. బంగారం ఇనుముతో సరి తూగ లేకపోతున్నది. సువర్ణం సోమరితనంగానే ఉండిపోతున్నది. అయినప్పటికి ఏదిగొప్పది? వర్తమాన కాలంలోనూ, భవిష్యత్తులోనూ లోహానికిగల ప్రాముఖ్యతనుగుర్తించే-భారత ప్రభుత్వం ఇనుము, ఉక్కు పరిశ్రమాభివృద్ధికి ప్రత్యేక మంత్రిత్వశాఖను ఏర్పాటు చేసింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అంచెనాల ప్రకారం ఉక్కు వినియోగాన్ని తల ఒకటికి 50 లేక 52 పౌనుల వరకు ఎంచాలి అందుకు 60 లక్షల టన్నులు ఉత్పత్తి కావాలి.

టాటా ఇనుము - ఉక్కు కర్మాగారంలో సాధింపబడుతున్న అభివృద్ధిని చూచిన తర్వాత . అనతికాలంలోనే దేశంలోని నిరుద్యోగ సమస్య చాలావరకు పరిష్కారం కాగలదని ఊహించకుండా ఎలా వుండగలం? ద్వితీయ ప్రణాళికక్రింద ఈకంపెనీలో 20 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తిచేయవలసి ఉన్నది. ఆ పనిలో ఈ ఫ్యాక్టరీ చురుకుగా సాగిస్తున్న కార్యక్రమాన్ని చూచి మా రైతులు చకితులయ్యారు.

నిత్యమూ చూస్తూనే ఉన్నాము. మన బారన్‌లకు ఉపయోగపడే రేకులు - గొట్టాలు - ఇనుప బారులు-బండి

పట్టాలు - నాగటి కర్రలు- అంతేకాదు - వంతెనలకు వేసే ఉక్కు- దూలాలు- భవనాలకు ఉపయోగించే ఇనుపచువ్వలు- దూలాలు - ఇంకా ఎన్నెన్నో... అయితే సాధారణంగా పొలాలలో దొరికే కాకి రాయినుండి పీటన్నిటినీ - ఇంత పెద్ద దూలాలను ఎలా తయారు చేస్తున్నారో చూస్తే అశ్చర్యం! ప్రత్తినుండి - దూది; దూదినుండి - ఏకులు; - ఏకుల నుండి - దారము; దారం నుండి బట్ట- తయారౌతుంటేమనకు ఆశ్చర్యంగాలేదు. కారణం మనం రోజూ చేస్తున్నది - చూస్తున్నది కాబట్టి...

అయితే కాకి రాయినుండి - ఇనుము, ఇనుమునుండి ఉక్కు. ఉక్కునుండి రకరకాలైన సామానులు - గుండుసూది మొదలు - పెద్ద దూలంనరకూ - ఇది చూస్తే ఆశ్చర్యంగానే ఉన్నది.

కాకిరాయిని కరిగించి ఇనుమును బయటికి తీస్తున్నారు ఒక పెద్ద 'బ్లాస్టుఫర్నెస్' ద్వారా.

ఎక్కడచూచినా అగ్నిగోళాలే. ఎర్రగా కాలిన ఇనుప ముద్దలు విద్యుచ్ఛక్తితో పనిజేసే యంత్రాలు (క్రేనులు) ద్వారా ఫర్నెసులు (పొయ్యి) లోనికి వస్తూవుంటే అంత రితంలో అగ్నిగోళాలు అటూ ఇటూ పరువులు తీసినట్లుగా ఉంది. ఒక చోట ఎర్రటి గోళంలా కనుపించిన ఇనుపముద్ద కొంతదూరం పోయేటప్పటికి రైలు చక్రాలుగా పరిమార్పు జెందుతున్నది. ఆ ఇనుప ముద్దయే మరొకచోట ఇనుపరేకు లుగా పరిణామం చెందుతూంది. రేకును కావలసిన పరిమాణానికి కత్తిరించే యంత్రం గూడా అందులోనే అమర్చబడి

వుంది. ఆ యంత్రం వేగంగావస్తూన్న రేకునువెన్నపూసను నరికి నట్లుగా నరుకుతున్నది. ఇనుప చువ్వలు ఎర్రగాకాలి ఫర్నేసు నుంచి బయటికి పరుగులు తీస్తూవుంటే ఆకాశంలో మెరుపుతీగలులాగా కనుపిస్తున్నాయి. ఇనుపదూలాల తయారీ మరీ భయంకరంగావున్నది. ఫర్నేసులో బాగాకాలి బయటకి యినుపముద్ద పయనించే మార్గంలోనే పరిమార్పుజెందుతూ – గమ్యస్థానం చేరుకునేటప్పటికి కావలసిన పరిమాణానికి దూలంగా తయారవుతున్నది ప్రయాణ మార్గంలో ఏడెనిమిది సమ్మెటపోట్లు తగులుతాయి. ఇనుపముద్ద పొడవుగా సాగుతుంది. సాగిన ఆ ముద్ద చిట్టచివరను నిర్ణీత పరిమాణానికి కత్తిరింపబడి, దూలాలు గమ్యస్థానం చేరగానే జడివానలాగా పడతాయి చన్నీళ్ళు. ఫ్యాక్టరీ అంతా విద్యుచ్ఛక్తితోటే పనిచేస్తున్నది. ఫ్యాక్టరీలో జరిగే పనిఅంతా ఏదో ఒక గారడీ మహాత్యంలాగా కనుపించింది. కాకిరాయి వాగన్లు ఒక ప్రక్కనుంచి వస్తూఉంటే – రైలుచక్రాలు, రేకులు, దూలాలు, చువ్వలు, వ్యవసాయక సామగ్రి మరోప్రక్కనుండి వాగన్లలో బయటికి పోతున్నవి. యంత్రయుగంలోని మహాత్తు ఇది.

ఆంధ్రసోదరుల ఆదరంతో ఆనందదాయకంగా ఒక రోజు ఆమహోన్నత పారిశ్రామిక నగరంలో గడిపి మరునాటికి ఒక మహానగరానికి చేరుకున్నాము.

# కలకత్తా

కలకత్తా వంగదేశపు రాజధాని. ఈ దేశం ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనలో ఉన్నప్పుడు దేశానికంతకూ ఇదే రాజధాని. ఇది పురాతన నగరంకాదు. ఆంగ్లేయులు ఈగడ్డపై అడుగుపెట్టిన తర్వాత బొంబాయివలెనే కలకత్తాగూడా ప్రాశస్త్యాకి వచ్చింది.




16వ శతాబ్దపుమొదటిరోజుల్లో వ్యాపార స్థావరాల అన్వేషణార్థం భారతదేశానికి వచ్చిన ఆంగ్లేయులు గంగానది ముఖ

ద్వారంలో ఒక వాణిజ్య కేంద్రాన్ని నెలకొల్పుకోవడం అవసరమని తలంచారు. గంగానది సారవంతమైన బెంగాలు, బీహారు ప్రాంతాలకు అత్యుత్తమమైన జలమార్గం కదా! అందులో హుగ్లీనది వెంట ఒక ఫ్యాక్టరీని నిర్మించుకున్నారు. కానీ కొలప కాలానికి ఆ ఫ్యాక్టరీని స్వదేశీయులకు ఇచ్చివేయవలసి వచ్చింది. అప్పటి బ్రిటిషు ఏజెంటు జాబ్ చార్నాక్ అక్కడి ప్రజల వత్తిడికి తట్టుకొనలేక, మొగలాయి అధికారుల తాకిడికి ఆగలేక మద్రాసుకు మకాం మార్చవలసివచ్చింది. తెలివిగలవాడు కాబట్టి సమయం వచ్చేదాకా జాబ్ చార్నాక్ దొర మద్రాసులో తలదాచుకొని-పరిస్థితులు అనుకూలించిన మీదట 1690లో తిరిగి కలకత్తా చేరుకున్నాడు. హుగ్లీనది ఒండ్రుమట్టి పేరుకొని ఉన్న ప్రాంతంలో ఒక పెద్ద కోటను నిర్మించాడు. అదే ఇప్పటి "ఫోర్టు విలియమ్స్". తదాదిగా ఆ ప్రాంతం ఫ్యాక్టరీల మయమయింది. బెంగాలులోని ఫ్యాక్టరీల పరిపాలనకు ఒక ప్రెసిడెంటును, ఒక కౌన్సిలును ఏర్పాటు చేసుకున్నారు. అదే బెంగాల్ ప్రెసిడెన్సీ. అది మొదలుకొని అక్కడ ఒక మహానగరం పెరిగిపోయింది.

కలకత్తాలో మేము మూడు రోజులున్నాము. నగరంలోని పాతకొత్తల్ని పరిశీలించాము. హుగ్లీ- గంగానదులమీద పరివేష్ఠితమైవున్న కలకత్తా ప్రపంచంలోనే . ఒక మహానగరం. సుమారు 26 లక్షల జనాభా కలిగిన ఈ నగరం 17 వ శతాబ్దానికి ముందు ఒక కుగ్రామమని చెప్పుకున్నాము. దాదాపు

మూడు శతాబ్దాలుగా పెరుగుతూవస్తున్న ఈ నగరంలో పాత కొత్తల కూడలిగా కనుపిస్తున్నది.

నగరపు పొలిమేరలనుండి 'శీల్డా' స్టేషను మాబండి చేరుటకు దాదాపు మూడు గంటలుపట్టింది. నగరంలో రైలు ప్రయాణంచేస్తూ ఉంటే నగర మంతా ఇనుపదారులు,ధూమ శకటాలే ననిపించింది. ఒక వైపున ఆకాశ హార్మ్యాలు-మరొక వైపున జీర్ణ కుటీరాలు, ఒక ప్రక్కగా అరికాలు మలినంకాని చక్కని తారురోడ్లు మరో ప్రాంతంలో దుర్గంధభూయిష్టమైన మురికికూపాలు-ఒక చోట అష్టఐశ్వర్యాలు-మరొకచోట నిష్టదారిద్ర్యము - కొందరు అతినాగరికులు - వారిప్రక్కనే మరికొందరు దుర్గంధాన్ని చిమ్ముతూ- చింపిరితలలతో - చింకి పాతలలో కనుపించే చరిత్రహీనులు - కలకత్తా వైవిధ్యాలమధ్య మా రైలుకు ప్రత్యక్షమయింది. రైల్వేస్టేషనులన్నీ తూర్పు బెంగాలు హిందూ కాందిశీకులతో క్రిక్కిరిసి, మురికివాసనలను విరజిమ్ముతున్నాయి. పదేళ్ళనాడు దేశం విభజింపబడినా కాందిశీకుల సమస్య ఏరోజుకారోజు క్రొత్తదిగానే పరిణమిస్తున్నది. నాటికీ - నేటికీ కాందిశీకుల రహదారిక ద్వారం మూయబడలేదు. ఆంగ్లప్రభువుల ధర్మమాఅంటూ కృత్రిమంగా సృష్టించ బడిన ఈ సమస్యకు అంతమెప్పుడో? నగరంలో ప్రవేశించగానే ప్రప్రథమంగా మా దృష్టి నాకర్షించగలిగింది. 'హౌరా వంతెన- హుగ్లీనదిమీద నిర్మించ బడిన ఈవంతెన నవీననిర్మాణ శాస్త్రానికి గీటురాయి. ఇలాంటి వంతెన భారత దేశంలో ఎక్కడాలేదు.

"ముంబాయమ్మ" అనే దేవత పేరుతో బొంబాయి వెలసినట్లే "కాళీఘట్టము" పేరుతో కలకత్తా వెలసింది. ఇది కాళీకాస్థానము. కాళికా నగరము. కలకత్తాలో కాళీ, మధురలో మీనాక్షి, కంచిలో కామాక్షి, బెజవాడలో కనకదుర్గ ఆదిశక్తి స్వరూపాలు. ఈ ఆదిశక్తియే విశ్వసృష్టికి ఆధారభూతురాలు. ఆశక్తిఅనిర్వచనీయమైనది. మానవుడు ఆ శక్తిని అర్థం చేసుకునేందుకు విభిన్న స్వరూపాలను సృష్టించుకొన్నాడు. పంచభూతాలు ఆ శక్తిలోనే ఇమిడివున్నాయి. పంచభూతాలే ఆ శక్తిస్వరూపాన్ని దాల్చాయి మనజన్మకు, మన ఐశ్వర్యాలకు మన కష్టసుఖాలకు కారణభూతురాలైన ఆ ఆదిశక్తి జగత్తుకు పరమ పూజనీయురాలుగదా! అందుకే ఈ ఆధ్యాత్మిక భారతదేశంలో వివిధ స్వరూపాలలో అశక్తిని ఆరాధిస్తున్నారు. ఆ ఆరాధన మూఢవిశ్వాసాలకులోనైనప్పుడు దూరంచనుంచి, మానవ పీడనగూడా జరుగుతూ వుంది. అందుకే ఆ శక్తికి భయంకర స్వరూపాన్నిచ్చారు. మానవత్వంలో పరిపక్వాన్ని పొందనిస్థితిలో భయభక్తులతో మెలగాలంటే భయంకర శక్తుల్ని సృష్టించుకోవడం, ఆ భయంకర మూర్తుల తృప్తికి మానవరక్తాన్ని వాడుకోవడం- మనుష్యమాంసాన్ని దేవీప్రసాదంగా పరిగ్రహించచేయడం-అనాగరిక మానవ సమాజంలో ఒక ఆచారమైంది. ఆ యాచారం ధర్మంగా రూపొందించబడింది.

జంతు బలులు - నరబలులు విచ్చల విడిగా అమలులోవున్న ఆనాటి వంగదేశంలో 'పాల' రాజుల కాలంలో బౌద్ధధర్మం వ్యాపకమయింది.

కలకత్తా నగరాన్ని కంటికి రెప్పగా కాపాడుతూవుం డే కాళీమాత భయంకర స్వరూపాన్ని దర్శించుకున్నాను మా రైతులు. కాళీమాత (త్రినేత్ర)ధారి. చతుర్భుజములలో ఒకచేత కత్తి, ఒక చేత మధుకైటభుల మస్తకము, రెండు చేతులతో భక్తాభయ ముద్రను వహించి, పొడవుపాటి వాలు కచాచి - నరముండ మాలధరించి, మహాదేవ వక్షస్థలమందు చరణములుంచిన ఆ మాత అతి భయంకర మూర్తిని దిష్టాంత రంగా చూచినంతనేశరీరము కంపిస్తుంది.హింసకుప్రతిచిహ్నం గాసృష్టింపబడిన ఆ మూర్తి మానవులకు ఆరాధ్యదైవం.ఈఆల యము గంగాతీరమున పరివేష్టితమైయున్నది ఇది అతి పురా తనమైనది. ఇప్పటి విశాలమందిరాన్ని 1809 నేసేలా చౌధ రీలు నిర్మించారు. కాళికాదేవికి మా రైతులు పూజా పుష్పా లను సమర్పించారు. ఈ ఆలయ ప్రాంగణంలో జేబుదొంగల అపాయం అధికం వంగీయులు ఆధ్యాత్మిక తత్వంలో ఆది నుండీ సుశిక్షితులు,లందుచేతనే ఆగడ్డపై తత్వవేత్తలు, భక్తి పరులు కవులు, గాయకులు పారస్వతవేత్తలు కోకొల్లలుగా ఉద్భవించారురు.

ఇచ్చటి ముస్లిములలో బెంగాలీతత్వం అధికంగా ఉం టుంది. "మొట్టమొదట వింగీయుని - తర్వాత ముస్లింను" అని ప్రతి ముస్లిం పౌరుషా భావిస్తాడు బెంగాల్ ముస్లింని-వంగవిడ దీయుటకు చాణుక్యులని ప్రసిద్ధిగాంచిన ఆంగ్లేయులతరంకాలేదు సరికదా - ఈ నాటి పాకిస్తాన్ ప్రభుత్వంచేతగూడా కాలేదు. బెంగాలు భాషను నాశనం చేయాలని ప్రయత్నించిన ముస్లిం లీగ్ తూర్పుబెంగాలులో తుదముట్టింపబడింది.

ముస్లిముల దాడితో – శంకరాచార్యుని సూతన సిద్ధాంత ప్రభావంతో బౌద్ధమతం నిలువలేకపోయినా అందులోని ధర్మసూత్రాలు మాత్రం ఎప్పటికప్పుడు ఏదోవిధంగా ప్రచారమవుతూనే వస్తున్నాయి. 15వ శతాబ్దంలో శ్రీ చైతన్యుడు జాతి, మత, భేదములులేని సర్వమానవ సౌభ్రాతృత్వ సిద్ధాంతములో హరినామాన్ని ననున్వయ పరచాడు. ఆయన వైష్ణవ మతావలంబకుడు కావచ్చు. కాని అందులో గౌతమ బుద్ధునివంటి సంస్కర్త చైతన్యుడు శ్రీ కృష్ణభగవానుని పారమని వంగీయుల విశ్వాసం. శ్రీచైతన్యుని నాటినుంచే వంగ దేశంలో సంస్కారిత వైష్ణవధర్మ–సర్వజనంగీకారమైనది స్త్రీలు సైతం వైష్ణవ సన్యాసినులయ్యారు. కానీ వంగీయులు మహా కాళిని మరువలేదు. వైష్ణవమతసారంలోనే కాళమాతను విలీనం చేసుకున్నారు.

హైందవ తత్వంలో సిద్ధహస్తుడు శ్రీ రామకృష్ణ పరమ హంస కాళీకాభక్తుడు. ఆ మహానుభావునికు దక్షిణేశ్వరం లోని కాళికాలయంలో కాళిమాత ప్రత్యక్షమయిందట. ఈ ఆలయంలోనే శ్రీ రామకృష్ణ యోగాభ్యాస మొనర్చి ఆధ్యాత్మిక తత్వంలో పరిపక్వ మొందాడు. దక్షిణేశ్వరాన్ని సందర్శించే భాగ్యం మాకు కలిగింది. కలకత్తాకు నాలుగుమైళ్ళ దూరంలో ఉన్న ఆ సువిశాలమైన మందిరం బహు పురాతనమైన శక్తిక్షేత్రం. ఇందలి అధిదేవత భవతారిణీ దేవి. ఈ ఆలయాన్ని భవతారిణీ భక్తురాలు రాణీ రాసమణీదేవికట్టించినది. ఇదే శ్రీ రామకృష్ణ పరమహంసకు ప్రసన్నమయిన కాళి

కాలయము. ఇది ఒక మహత్తర నిర్మాణం. ఈ నిర్మాణము ఎనిమిందేళ్లు పట్టినదట.

కలకత్తాలో ప్రసిద్ధమైన జైన్, బౌద్ధఆలయాలున్నాయి నగరంలో మమ్మల్ని అమితంగా ఆకర్షించింది విక్టోరియా మోమోరియల్ హంసుమైళ్ళ పొడవు. మైలు వెడల్పుగలకలకత్తా విశాలమైదానికి దక్షిణముకుటలోవున్న విక్టోరియా మెమో రియల్ భారతావనిలో తెల్లదొరల పాలనకు ఒక శాశ్వత చిహ్నం. లార్డ్ కర్జన్ తలపెట్టిన ఈ నిర్మాణం 1921లో ప్రిన్స్ ఆఫ్ వేల్సుచే ప్రారంభోత్సవం చేయబడింది. దీని విలువ 76 లక్షల రూపాయిలు. ఈ నిధి ప్రజల నుండి వసూలుచేయ బడింది. ఈ భవ్యంలో బ్రిటిషు సహాయుగవు భారత దేశ చరిత్ర కండ్లకుగట్టినట్లుగా చిత్రింపబడివున్నది. విక్టోరియారాణి జీవిత సన్నివేశాలు రాయల్ గ్యాలరీలో ప్రదర్శింపబడి వున్నాయి. చంద్ర నగర్ లో పెద్దపులులవేట, టిప్పూ సాహెబ్ కుమారుని లార్డ్ కార్న్వాలీస్ స్వీకరించుట మొద లైన తైలకర్ణ చిత్రాలు హావభావోపేతంగా వున్నాయి ఈ మహత్తరమైన పాలరాతికట్టడం కలకత్తా నడిబొడ్డున బ్రిటిషు ప్రభువుల హుందాతనాన్ని ప్రకటిస్తూవున్నది. ఆంగ్ల సామ్రా జ్యంలో విక్టోరియా మహారాణి స్వర్ణయుగాన్ని సృష్టించు కొన్నది. ఆ రాణి కాలంలోనే ఆనాటి భారత రాజ కీయాలు ఒక దారికి వచ్చాయి.

కలకత్తా మ్యూజియంలో మొహంజో - దారో; హార ప్పా నాగరితను చాటుతున్న శిథిలాను చూశాము. భారతీయ సంస్కృతి ఆనాటిది. భారతీయ నాగరికత అంతటి పురాతన

మైనది. అది 4500 సంవత్సరాలమాట. ఆనాటి భారతీయులు నగరాలు నిర్మించుకొన్నారు. చక్కని రాస్తాలు వేసికొన్నారు డ్రైనేజి ఏర్పాటు చేసి కొన్నారు. పెద్దపెద్ద భవనాలను నిర్మించుకొన్నారు. సువర్ణ మణిహారాలను అలంకరించుకొన్నారు. అద్భుతమైన కళాఖండాలను సృష్టించుకొన్నారు. అనాటి వారి పాత్రల్లో, నగల్లో, దుస్తుల్లో, కాంస్యవిగ్రహాలలో - నాణ్యాలలో మనకు కనుపించేది కల, సౌందర్యం. అది సింధూ వ్యాలీ నాగరికత. ఆ మహత్తర సంస్కృతీ నాగరికతలను కలకత్తా మ్యూజయంలో చూడగలిగాము.

బొటానికల్ గార్డెన్సులోని వటవృక్షం మా రైతుల్ని చకితుల్ని చేసింది. ఆవట వృక్షం 1000 అడుగులు వ్యాపించివున్నది. 600 వూడలు భూమిలోనికి దిగినవి. తల్లిబోదె ఇప్పుడు లేదు. 1935 లోనే నరికివేయబడింది. ఆ వృక్షపు చల్లని నీడన మా రైతులు సేదతీర్చుకొన్నారు. ఆనందానుభూతిని పొందారు "చిడియాఘర్"లోని దున్నపోతులను చూస్తూవుంటే రైతులకే భయమేసింది,

హుగ్లీనదిపై నిర్మించిన హార్బరు. దాని సమీపంలోని 13 అంతస్థుల ప్రభుత్వ కార్యాలయం జూచి మా రైతులు ఆశ్చర్యపడ్డారు.

విచ్చలవిడిగా చేపలు తిండం వలన కాబోలు బెంగాలు స్త్రీలు బంగారాదుంపల్లాగా నునుపు తేలివున్నారు. చేపలు వారికి శాఖాహారం.

# కళింగదేశం

మూడు రోజులపాటు కలకత్తాలో గడిపి మరునాటికి భువనేశ్వర్ చేరుకొన్నాము. కళింగలో కాలుపెట్టాము.

ఒరిస్సా మన ఉత్తర సరిహద్దు రాష్ట్రం.

ఉత్కలుల చరిత్ర, సంస్కృతి శిల్పం, మతం, రాచరికం ఆదినుండీ ఆంధ్రులతో సంబంధమున్నది. ఉత్కళ దేశపు ప్రకృతిసంపద మహోన్నతమైనది. వైతరణీ, బ్రాహ్మణి, మహానది, ఋషికుల్య, వరహా, నాగావళి, శబరి, మచ్చగుండం మొదలగు నదులతో విరాజిల్లుతున్నది. బ్రహ్మాండమైన చిలుక సరోవరం ఉత్కళ దేశానికి ఒక వరప్రసాదం. 45 మైళ్ళపొడవు, 10 మైళ్ళ వెడల్పు గలిగిన ఈ సువిశాలమైన సరోవరం ప్రకృతి ప్రసాదం. లెక్కకు మించిన పక్షిసంతతికి ఆలవాలమైన ఈ సరస్సును "హిమాలయ బాతులు" పరిపాలిస్తున్నాయి. ఉత్కళ అరణ్యాలు బెంగాలు వ్యాఘ్రాలకు ప్రసిద్ధి మత గజాలతో మహారణ్యాలు భయభ్రాంతులు గొల్పుతాయి.

ఉత్కళ ఇతిహాసం అతిపురాతనమైంది. ఉత్కళ ప్రజలు వివిధ ప్రాంతాలనుండి వలసవచ్చి స్థిరనివాసా లేర్పరచు కున్నవారు. ఉత్కళరక్తం సంకరమైంది. కులభేదాలతో ఆనాటికీ ఈనాటికీ వారికంత పట్టింపులేదు. జగన్నాథాలయంలోని "చాపకూటి" సిద్ధాంతానికి ప్రధాన హేతువు అదేకావచ్చు. ఉత్కళులు అనార్యులు. ఆర్యుల ఆధిక్యతను ఆదేశం ఆదినుండి ప్రతిఘటిస్తూనే వచ్చింది. అక్కడ అగ్రజాతి ఆధిక్యత అంటూ

ఏదీలేదు. అందుకే కానచ్చు "అది అనాగరికజాతి" అనే బిరుదాన్నిచ్చారు ఆర్యఋషులు.

పౌరాణిక, ఇతిహాసాలలో ఒరిస్సా ప్రాధాన్యతను పరిశీలిస్తే రెండు మహాసంగ్రామాలలో ఈ భూమి ప్రధాన భూమికను నిర్వహించినట్లు గ్రాహ్యమౌతున్నది. అంతేకాదు. ఒకప్పుడు ఇక్కడనుండి ఒక మహాసామ్రాజ్యం విస్తరిల్లినట్లు కూడా చెప్పబడుతున్నది. అయోధ్య మొదలు గోమతీనది వరకు కళింగ సామ్రాజ్య మున్నట్లు రామాయణంలో ఉటంకించబడివుంది. వివిధ పురాణేతి హాసాలను బట్టి ఒకప్పుడు ఈ దేశం కాశీ, కోసల, విదేహ, పంచాల రాజ్యాలతోనూ, మరొకప్పుడు, గయ, ఉత్కళరాజ్యాలతోనూ, ఆ తర్వాత కొన్నాళ్లకు అంగ, వంగ పుండ్ర, తామ్రలిప్త దేశాలతోనూ - ఆపైన కొలదికాలానికి దక్షిణాపథంలోనివత. పుళింద - విదర్భ - ఆంధ్రదేశాలతోనూ సంబంధ మున్నట్లు చెప్పబడుతున్నది.

మహాభారత కథనం ప్రకారం "దీర్ఘాతముడ"నే ఋషి 'బలి' భార్యవలన అంగ - వంగ - కళింగ - పుండ్ర - సుమను అనే ఐదుగురు పుత్రులను బడశాడట. కళింగుడు తన పేరుతో 'కళింగ' అనే ఒక మహాపట్టణాన్ని నిర్మింపజేశాడట. ఈ ఐదుగురు పుత్రులూ ఐదు రాజ్యాలను నిర్మించుకొన్నారు. ఆ రాజ్యాలు వారివారి పేర్లతోనే ప్రసిద్ధికెక్కాయి. ఈ రాజ్యాల ప్రజలు పరస్పర సాంస్కృతీ సంబంధాలు కలిగియుండటమే పై కథనానికి ఒక నిదర్శనం. పుండ్రసుహ్మ, వంగరాజ్యాలను ఇప్పటి ఉత్తర నైఋతి-

ఆగ్నేయ బెంగాలు ప్రాంతాలని చెప్పుకోవచ్చు గంగా. నదికి దిగువన గోదావరీనది వరకూ కళింగ సామ్రాజ్యం విస్తరించియున్నదని గ్రీకు, రోమన్ చరిత్రకారులు వ్రాసిన కథనాల వలన తెలుస్తున్నది.

బౌధాయన ధర్మసూత్రానుసారం కళింగులు 'అనార్య జాతి' అని ఘోషిస్తున్నది. మహాభారతయుద్ధంలో కళింగులు కౌరవులపక్షాన, ఉత్కళులు పాండవుల పక్షాన పోరాడినట్లు మహాభారత కథనం అంగీకరిస్తున్నది. క్రీస్తుకు పూర్వం 4వ శతాబ్దంలో భారతదేశంలో పర్యటించిన గ్రీకుయాత్రికుడు 'మెగస్తనీసు' "రణరంగ కౌశల్యంలో మగధజాతి, ఆంధ్రజాతి తర్వాత చెప్పుకోదగ్గ వారు కళింగులే అని ప్రశంసించారు. శిశునాగ, నందమౌర్యరాజులు క్రీస్తుకు పూర్వం మొదలు 2వ శతాబ్దివరకూ కళింగ భూమిని పరిపాలించారు. 'కరవేలరాజు కళింగను ఏలినవారిలో ఘనకీర్తి సాధించాడు. కరివేలుడు జైన ధర్మావలంబకుడు. దేశమంతటా జైన దేవాలయాలను, గుహలను, శిల్పాలను, బస్తీలను నిర్మింపజేశాడు. నందవంశ రాజులు నదులనుండి కాల్వలు తవ్వి వ్యవసాయాన్ని అభివృద్ధి చేశారు.

కళింగ చరిత్రలో సామ్రాట్ అశోకుడిది ఒక అమర ఘట్టం. యావద్భారతంలో తన కత్తికి ఎదురులేకుండా విజృంభిస్తున్న అశోకచక్రవర్తికి ఎదురునిలచింది కళింగరాజ్యమే. కళింగులు తుదివరకూ అశోకుని సైన్యాలతో పోరాయి. అది ఒక రసవత్తరమై కథనం.

కళింగభూమిపై కారుమేఘాలు కమ్మాయి. దేశరక్షణార్థం కళింగభూమిలోని ప్రతిఒక్కరూ కత్తిబట్టి కదనరంగానికి

కురిశాయి. మహాపర్వతపంక్తులవలెవస్తున్న అశోకుని సైన్యాలను ఢీకొన్నారు ఒకరోజు కాదు,ఒకమాసంకాదు,ఒకయేడుకాదు. కొన్ని సంవత్సరాలు సాగిన భీషణ సంగ్రామం కళింగ అశోకు పాదాక్రాంతం కాలేదు. ఇరువాగులవైపూ సైనికుల శవాలు రణరంగంలో రాసులు పడ్డాయి సామ్రాట్టు ఒక్కసారి రణరంగంవైపు తేరిపారచూశాడు. మృతజీవుల మాంసం కొరకు రాంబందులుయుద్ధం చేస్తున్నట్లనిపించింది. కళింగ అంగనలు భర్తల శవాలను గుర్తించి వాటి బారినుండి రక్షించుకొంటున్నారు తల్లులు కొడుకుల మృతకళబరాలను మోసుకుపోతున్నారు. దిక్కులేని శవాలు రక్తపుటేరుల్లో కొట్టుకుపోతున్నాయి.

సామ్రాట్టు చూశాడు. ఒక అంగపతి మృతకళేబరాన్ని వెతుక్కుంటూ ఆ శవ సముద్రంలో ఈదినట్లుగా తూలుతూ సాగిపోతూంది. ఒక శవం కాలికి తగిలింది, బోర్లాపడింది తెప్పరిల్లుకొని లేచింది. కళేబరాన్ని తేరిపార చూచింది. కవచం పగిలివుంది ఛాతీమీద పుట్టుమచ్చ గుర్తించింది. అదితన భర్తదే! పూర్తిశవంకాదు. తల లేదు. మొండెంమాత్రమే, శిరస్సు ఎక్కడ ఎగిరిపోయిందో, చుట్టుపట్లా ఎన్నో శిరస్సులున్నాయి. తన భర్తదిమాత్రం కనుపించదు. మృతజీవుడైన పతిమోమును చూచుకొనేందుకైనా ఆ యంగన నోచుకోలేదు. ఆ మృతకళేబరాల రాసులమధ్య ఆ యంగన అహాకారాన్ని వినేదెవ్వరు? ఆమె లేచింది. శూన్యాకాశంలోకి చూచింది. మాంసకండరాల్ని తన్నుకపోతున్న రాంబందులు కనుపించాయి. ఎగిరిపోతున్న ఆ గ్రద్ధల ధ్వనినుండి వినిపించింది- 'రాజులు

రాక్షసులు, కర్కశహృదయులట, పసుపుకుంకుమ పోగొట్టు
కొన్న అభాగ్యురాలుగోడు వారికి వినిపించదు. మాతృహృద
యపుశోకం వాళ్ళ చెవిచెక్కదు, వాళ్లు ప్రభువులుకాదు, నర
రూప రక్కసులు.' రౌద్రంతో వెనుదిరిగింది. ఆజానుబాహుడు,
స్ఫురద్రూపి, తేజోవంతమైన ముఖవర్చస్సుగల ఒక దీర్ఘకా
యుడు ప్రత్యక్షమయ్యాడు. యువతి పోల్చుకొన్నది. వికటాట్ట
హాసం చేసింది. నువ్వే... నువ్వే... మహామ్మారివి... నాపతిని
మింగిన యమదూతవు. మళ్ళీ ఎందుకొచ్చావ్ కడుపునిండ
లేదూ ? ఇంతమందిని తిన్నావే ఇంకా చాలలేదూ? నన్నూ
తింటావా ... నన్నూ నా పతి దగ్గరకు పంపు... అలా
చూస్తావేం గ్రుడ్లు మిటకరించుకొని...' ఆవిడ నేత్రాలు
నిప్పులు చెరుగుతున్నాయి. నోటినుండి అగ్నిజ్వాలలు కురు
స్తున్నాయి.

"ఔను... నేనే - మృత్యువును- మృత్యువుకు మారు
పేరే అశోకుడు..."

అంగన స్తంభించింది. ఒక్క అడుగు వెనక్కు వేసింది.
మళ్లీ తెప్పరిల్లుకొన్నది.

"ఏమిటి నీకీర్పుట" సామ్రాట్టు ముకిళిత కరకములుడై
శిరస్సువాల్చిఅన్నాడు.

అంగన ఊపిరి సల్పుకొన్నది తిరిగి. నేత్రాలు నిప్పులు
గ్రక్కుతున్నాయి

"ఏలుకో... ఈ శ్మశానవాటికను... ఇదే మీకు
శిక్ష... అధికారదాహంతో-మానవ రక్తాన్ని అమృతంలాఆర
గించే సామ్రాట్టులకు తగినశిక్ష... ' అంటూ సామ్రాట్టు

మొలలోని బాకును రివ్వునలాగి...హృదయంలో గుచ్చుకొన్నది. ప్రశాంతంగా ప్రక్కనున్న పతిమొండెంమీద వ్రాలింది

తన కళ్ళెదుట జరిగిన ఈ దారుణ సంఘటనకు సామ్రాట్టుపాదాలక్రింద భూమాత కుంగిపోతున్నట్లనిపించింది క్రిందికి చూశాడు. తెగిన శిరస్సులు వికటాట్టహాసం చేస్తున్నాయి. ఆకాశంలోకి చూశాడు, అదేదృశ్యం! ఒక గ్రద్దవచ్చి సామ్రాట్టు తలపాగాను తన్నుకొని రివ్వున అంబరానికి ఎగిరి పోయింది ఆపాగా కోసం మరికొన్ని రాబందులు దానిపైకి లంఘించాయి, ఆకాశంలో మరో భీష్మణసంగ్రామం! ఆశ్చర్య చకితుడై చూస్తున్నాడు- అశోకుడు ఆ సంగ్రామాన్ని. తల పాగాను తన్నుకుపోయిన గద్ద పాగాను వదిలిపెట్టింది. పాగా సరాసరి వచ్చి భర్త మొండెం పైవాలి పడిఉన్న ఆ అపరాంగన శిరస్సున వాలింది. అశోకుడు క్రిందకు చూశాడు తెగి పోయిన శిరస్సులు వికటాట్టహాసంచేశాయి "ఏలుకో ఈ స్మశానవాటికను... మీ కిదే శిక్ష......" అనే శబ్దం ప్రతిధ్వనించింది. రిత్తపడి పైకిచూశాడు. గ్రద్దలు ఆకాశంలో ఎగురుతున్నాయి. వాటిరెక్కల ధ్వనినుండి అదేశబ్దం ప్రతిధ్వనించింది. "మేము వెళ్ళిపోతున్నాము ఈ దారుణ దావాగ్ని నుండి - ఏలుకో ఈ శ్మశానవాటికను... మీ కిదే శిక్ష!"

సామ్రాట్టు మనస్సు మెలికలు తిరిగిపోయింది. హృదయం సుడులు తిరిగింది. ఈ అనంత ప్రకృతి తన్ను శపించినట్లనిపించింది. మానవసమాజమేకాదు జీవజంతువులన్నీ తన్ను వెక్కిరిస్తున్నాయా- అనిపించింది. నరాలు బలహీనమయ్యాయి.

రక్తం గడ్డకట్టుక పోయింది. ఆయన్న దీర్ఘకాయం గజగజమని వణకుతూంది. తూలిపోతూనే నడక సాగించాడు శవాలగా నుల్ని తప్పుకొంటూ యుద్ధ మైదానాన్ని దాటాడు అశోక్షుం మీాద. తలపైకెత్తలేదు... 'బుద్ధం శరణంగచ్ఛామి' అనే ఒక తియ్యని శబ్దం వినిపించింది. తలపైకెత్తాడు. ఒకమహాభి క్షువు శరత్కాల చంద్రునివలె ప్రకాశిస్తున్నాడు. సామ్రాట్టు ముకుళితకరమలు చేయ్యాడు. 'నాయనా - నీ కర్తవ్యం పరిసమాప్తమయిందా ?' భిక్షువు జిహ్వనుండి వెలువడిన ఆ పదునైనమాట సామ్రాట్టును వేయివ్రక్కలుచేసింది. సామ్రాట్టుపెదవులు తడబడ్డాయి శరీరం చిరుచెమటలు పట్టింది.

'నాయనా...మానవసమాజాన్ని నీవెనక నడిపించా లని ప్రయత్నించి నీటికి ఎదురీదినావు. సంఘం ఏఒక్క వ్యక్తి వెంటానడవదు. అది ప్రకృతిరహస్యం సంఘం వెంటనే వ్యక్తి నడవాలి. సంఘం వెంటనడుస్తూ మాలిన్యముంటే కడిగివేసేం దుకు ప్రయత్నించాలి'

సామ్రాట్టు మాట్లాడలేదు.

ఇప్పుడు నీకు మిగిలిఉన్నది అదే... నిన్ను నీవేపరా భూతుణ్ని చేసికొన్నావు; ఇక నీవు సంఘాన్ని శరణు వేడు కోవాలి. సంఘానికి విజయాన్ని సాధించాలి. సంఘంలో ధర్మాన్ని ప్రతిష్ఠించాలి. దీని కంతకూ బౌద్ధమే శరణ్యం...

"బుద్ధం శరణం గచ్ఛామి - ధర్మంశరణం గచ్ఛామి. సంఘం శరణం గచ్ఛామి."

అనే ఆ భిక్షువు మంత్రోచ్ఛారణతో సామ్రాట్టు మానవుడయ్యాడు; మరోఅవతారం దాల్చాడు. దానితో

బౌద్ధధర్మం లోకధర్మమైంది. కళింగయుద్ధం అశోకుని సామ్రాజ్యం సముపార్జనకు చరమఘట్టమై చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడింది.

ఈ విధంగా కళింగదేశం ప్రపంచంలో ఒక సార్వజనీన ధర్మాన్ని వ్యాప్తి చేయుటకు కారణమైంది. ఆ విశ్వ విఖ్యాతమైన కళింగ యుద్ధంలో పాల్గొని అమరులైన ఆంధ్రులు, ఉత్కళులు ధన్యులు కాదా!

ఆ తర్వాత క్రీస్తు శకం 7 వ శతాబ్దం వరకూ బౌద్ధ ధర్మం కలింగరాజ్యంలో పాదు కొనియున్నది.

తర్వాత ప్రచలితమైన "జగన్నాథ తత్వం" బౌద్ధధర్మ సూక్తులను కాదనలేదు. బౌద్ధం నశించినా బౌద్ధధర్మం మాత్రం "జగన్నాథు" అండన శాశ్వతరక్షణను పొందినది.

పూరీలోని జగన్నాథ ఆలయాన్ని 1198 లో అనంగ భీమదేవ అనే రాజు నిర్మించినట్లు ఇటీవల బయల్పడిన తామ్ర శాసనాలవలన తెలుస్తున్నది. ఆ రాజు ఒక బ్రాహ్మణుని వధించి అందుకు పశ్చాత్తాపంగా ఈ మహా దేవస్థానాన్ని కట్టించినట్లు చెప్తారు. పూరీ జగన్నాథస్వామిని గురించి పురాణ కథనాల ప్రకారం ఒక రసవత్తర సంఘటనను వింటున్నాము. స్కంధ పురాణంలో, ఉత్కళకాండలో శ్రీమహావిష్ణువు నైమిశారణ్యంలో ఆశీనుడై పూరి పవిత్ర స్థానాన్ని గురించి అభివర్ణించాడట.

# వీడ్కోలు

విజయవంతంగా యాత్ర ముగిసింది. ఇందులో మా ప్రయత్నంకంటే మా రైతుల తోడ్పాటు, మా నాయకుల ప్రేరణ, అధికంగా పనిచేశాయి. సుమారు 6000 మైళ్ల పర్యాంతం భారతావనిని చుట్టివచ్చాము. అద్భుతమైన విషయం!

ఎందరో యాత్రలు నడిపారు–నడుపుతున్నారు. మేమూ నడిపాము నారికంటే మేము గొప్ప అని మాత్రంకాదు. అయితే మాయాత్రలో ఒకప్రత్యేకమైనలక్ష్యం ఉన్నదని మా అందరి విశ్వాసం. అనేక పురాణాలలో ఉటంకించ బడినట్లు – ఈ యాత్ర ఆశయం కేవలం పాప పరిహారార్థం మాత్రము కాదు. తాత తండ్రులకు పిండతర్పణలకు మాత్రమేకాదు. మూడువేల సంవత్సరాలనాటి భారతావని సంస్కృతీ చిహ్నాలను చూశాము. 2500 సంవత్సరాలనాడు ఉద్భవించిన బౌద్ధ ధర్మ అవశేషాలను చూశాము. తిరిగి ఈనాడు పునర్జన్మమెత్తుతున్న బౌద్ధాన్ని చూశాము. ఒకనాటి వైదిక సంస్కృతీ కేంద్రాలను సందర్శించాము. వాటి ఈ నాటితీరునూ గమనించాము. వెయ్యేండ్లనాటి మహమ్మదీయ ప్రాభవాన్ని తిలకించాము. ఒక దశాబ్దం క్రింతం వరకూ మనకు ఏలికలుగా వున్న ఆంగ్లేయసామ్రాజ్యపు స్మృతి చిహ్నాలనూ పరికించాం. అన్నింటినీమించి నవభారత నిర్మాణానికి సాగుతున్న బృహత్తర కృషిని మరింత శ్రద్ధాసక్తులతో పరకాయించాము.

అంతే కాదు. మాపొరుగు సోదరులైన కన్నడిగులు, మహారాష్ట్రీలు, ఓంఢ్రులను పరిచయంచేసికొన్నాము. మధ్య

ప్రదేశ్, బీహారు, బెంగాలు సోదరుల హృదయాలతో మా హృదయాలను జోడించాము పంజాబీయులతో గాఢమైత్రిని సాధించాము. కాశ్మీరు ప్రజలతో - మేమూ - మీరూ- ఒకటే, ఈ అఖండ భారతిలో అందరూ ఒకటే జాతి అనే సహజీవన భావనను ఒకరికి ఒకరు చెప్పుకున్నాము.

మన దేశాన్ని సస్యశ్యామలం చేస్తున్న మహానదులను సందర్శించాము. ఆ మహానదుల చల్లని కౌగిళ్ళలో పరవశ మొందాము, చూచాము ఆ మహానదుల ప్రాంగణాలలో విలసిల్లిన సంస్కృతీ కేంద్రాలను - కళాఖండాలను, ఆధ్యాత్మిక ప్రపంచాన్ని - వాటి పావనోదకాలను నిరస్నన చల్లుకొని పవిత్రతను పొందాము ఆ మహానదుల భయంకర ప్రవాహాలను మానవుడు అరికట్టే మహత్తర నిర్మాణాలనుచూచి అచ్చెరువందాము. సాగర గర్భంలో లీనమౌతున్న మహాజలాన్ని మానవుడు ప్రోగు చేస్తున్నాడు. పంటభూములపైకి మళ్లిస్తున్నాడు. పంటను పండిస్తున్నాడు. ఆమహాజలం ప్రళయ భయంకర గర్జనలతో గ్రామాలపై పట్టణాలపై విరుచుకుపడి పంటపొలాలను, జీవరాసుల్ని కబలించకుండా - మానవుడు ప్రయోగాలను చేస్తున్నాడు. విజయం పొందుతున్నాడు మహానదుల్ని తన అధీనంలో పెట్టుకొంటున్నారు. ప్రకృతిని తన స్వాధీనం చేసికొంటున్నాడు. మానవుడుప్రకృతి ప్రళయతాండవానికి లొంగిపోడు-- ప్రకృతికి బానిసకాడు. ప్రకృతిని తన ఉన్నతికి, వినియోగించుకొంటాడు. ప్రకృతి ఉపయోగాన్ని సౌందర్యాన్ని సద్వినియోగం చేసికొనగలడు'' అనే మహత్తర సత్యాన్ని నిరూపిస్తున్నాడు. అదే నవసమాజ నిర్మాణంలో.

అనంత ప్రకృతిలో మానవుని సాహసోపేతమైన ప్రయోగాలు
ఈ ప్రయోగాల తరహాను గమనించాము కాశ్మీరు పర్వతాలలో సొరంగాలుతొలిచి రాచబాటలు- నిర్మిస్తున్న చోట, సట్లెజ్ నదీ ప్రవాహానికి ఆనకట్టలు కట్టినచోట-దామోదర్ నది దాని ఉపనదులు గ్రామాలపై పొంగకుండా ప్రవాహాలను నిరోధిస్తున్న చోట.

యంత్రియుగాల్ని చూచాము చిత్తరంజన్‌లోనూ, టాటానగర్‌లోనూ. మానవుని వ్రేళ్ళలోగలగారడీనిచూశాము కాశ్మీర్‌లో కళావిలసితమైన చేతిపనుల కర్మాగారాలలో. శతాబ్దాలనాటి భారతీయుల కళావైభవాన్నిచూచి మురిసిపోయాము- ఎల్లోరా, అజంతా గుహలలో. మొగలాయియుగపు కళాకారుని నిర్మాణశక్తిని చూచాము తాజ్‌మహల్ దగ్గర.

వేల సంవత్సరాలనాటి భారతీయ ఇతిహాసపు విలువలను సమీక్షించుకొన్నాము. ఏగడ్డపై వెలిడినా - ఏ ప్రాంతాన్నిచూచినా - ఒక్కొక్కచోట ఒక్కొక్క ప్రత్యేకత మాకు అవగతమైంది.

పండరీ పురంలో పాండురంగని దర్శించినా,ఎల్లోరాలో తామరపువ్వుపై బుద్ధ భగవానుని చూచినా - సాంచీలో మహాస్థూపం చుట్టూ ప్రదణచేసినా-ఆగ్రాలోవున్న మచంద్రుని కాంతిలో తాజ్‌మహల్ మనోహరదృశ్యాన్ని ఆస్వాదించినా హస్తినాపురిలో ఆకాశాన్నిముద్దిడుకొంటున్నకుతుబ్ మీనార్ పైకెక్కినా, కాశ్మీర్ హిమగిరులమధ్య సరోవరతీరాలలో తిరుగుతునా - అమృతసరం స్వర్ణాలయంలోని ప్రశాంతతను

పరికించినా, ప్రయాగలోని. మహానదుల సంగమంలో జలక్రీడలు సలిపినా - కాశీలో విశ్వేశ్వరుని దర్శించినా - బుద్ధగయ లోని మహాబోధి వృక్షచ్ఛాయలో విశ్రాంతి తీసుకొన్నా కలకత్తాలో మహాకాళి భయానకమూర్తిని చూసినా - జగన్నాథ ధరధచక్రాలను కదిలించినా మమ్మల్ని ఉత్తేజితున్ని జేసినది విలక్షణమైన భారతీయ సంస్కృతి - కళా కౌశలమూ - భిన్నత్వంలోని ఏకత్వమూ

ఆనవాదాలుగా - ఆను వేల మైళ్ళు తిరిగాము. ఇంటికి వచ్చాము ఒకసారి నెమరువేసికొన్నాము. ఇప్పటికీ సుడులు తిరుగుతున్నది. హృదయాంతరాళంలో సుందరమైన భారత స్వరూపం.